

# 'హాసం'

హాస్య-సంగీత పత్రిక

## ఇవీ సంగతులు

57

**Also available on net:
www.haasam.com**





ముఖచిత్రం

'మల్లీశ్వరి' చిత్రంలో
కత్రినాకైఫ్

## హాస్యం


**సీరియల్స్:**

ఎలుక వచ్చే ఇల్లు భద్రం
-ఇలపావులూరి మురళీమోహనరావు 31

తాతా ధిత్తై తధిగిణతోం...
-జీడిగుంట రామచంద్రమూర్తి 46

**కథ:**

మా ఆవిడ ఫెమినిస్టూ... నేను రుబ్బురోలిస్టూ..!
- భువనచంద్ర 06

**బాపూరమణీయం:**

మిస్టర్‌పెళ్లాం (వెండితెర నవల)
- ఇలపావులూరి మురళీమోహనరావు 16

**హ్యూమరథం:**

-రావి కొండలరావు 24

**శీర్షికలు:**

హ్యూమర్ బాక్స్ 60

చౌ చౌ చౌరస్తా 22

**స్పెషల్స్:**

**'క' రాజు కథలు:**

గొప్పవాడు -సింగీతం శ్రీనివాసరావు 12

'అతడే ఒక సైన్యం'లో బ్రహ్మానందం పాత్ర గురించి... 36

బ్రహ్మానందం నటించిన చిత్రాల వివరాలు 50


'సెంటర్ స్ప్రెడ్' లో



సినిమా పాటల పుస్తకం











## సంగీతం


**సీరియల్:**

సప్తస్వరసుందరి లతా మంగేష్కర్
- పి.బి.శ్రీనివాస్ 56

**లలితం:**

తూరుపు దిక్కున అదిగోచూడు
- చిత్తరంజన్ 10

**పాప్‌కార్నర్:**

షాన్ - వి.అరుణ సత్యవతి 34

**సినిమా:**

**ఆపాత(ట) మధురం**

రాణి రత్నప్రభ - రాజా 66

**కొమ్మకొమ్మకోసన్నాయి:**

కథానాయకుడి కథ-కరిగిపోని కల- వేటూరి41

**శీర్షికలు:**

సరిగపదమని - 12 69

సరిగపదమని - 10ఫలితాలు 70

న్యూస్‌వ్యూస్ 53

**స్పెషల్స్:**

ఘంటసాల జ్ఞాపకాలు
-బాలాంత్రపు రజనీకాంతరావు 20

చక్రవర్తి తత్వం వ్యక్తిత్వం 15

హాసం సినీ గీతకోశం-2003 62

**ప్రేమికుల దినోత్సవ సందర్భంగా:**

జిందాబాద్ జిందాబాద్!

ఐ మొహబ్బత్ హై జిందాబాద్ - మృణాళిని 26

ఎంత ఘాటు ప్రేమయో...! 30

**అర్థంచేసుకుందాం-ఆస్వాదిద్దాం**

ఆర్జూ, హమ్‌దోనో-పి.వి. సత్యనారాయణరాజు43

మాయాబజార్ (తమిళం)- పి.ఎస్.గోపాలకృష్ణ 54


పాటల ప్రత్యేకం
71,72,
73,74
పేజీల్లో






ఈ సంవత్సరం తొలి 'హాసం' ముఖచిత్రం చిరంజీవిగారిది మమ్మల్ని ఎంతో అలరించింది. చాలా చాలా ధన్యవాదాలు. అలాగే జనవరి '6' రెహమాన్‌గారి పుట్టినరోజు సందర్భంగా మీరు మాకు ఇచ్చిన "కొమ్మ కొమ్మకో సన్నాయి"మా సంగీతాభిమానులను ఎంతో రంజింపచేసింది. మాకు పాటలు విని ఆనందించడం వరకే తెలుసు. కాని వెనుక ఎంత కథ ఉన్నది. ఎంత కష్టం ఉన్నది అన్నది మాకు తెలియపరచి, మాకు సంగీత విజ్ఞానాన్ని పెంచుతున్న మా 'హాసం-హాస్యసంగీత పత్రిక'కు నేను ఎంతో ఋణపడి ఉన్నాను. 'హాసం' ఎడిటర్ గారికి, మరియు వారి తోటి సహచరులకు చాలా చాలా... థాంక్స్.

**-ఎమ్.దుర్గాప్రసాద్,లక్ష్మీపురం,వరంగల్**

మధురమె...మధురమె... మధురమె...ఆ శీర్షికలన్నీ మధురమె, సీరియల్సూ మధురమె, ఆ పా(త)ట కనినామధురమె, అలనాటి హిట్సూ మధురమె, ఆ హాస్యమూ... సంగీతమూ వినినా చదివినా మధురమె, ఇన్ని మధురాలనందించే 'హాసం'పత్రిక ఎంతో మధురమె.

క్రొత్త సంవత్సరంలోకి అడుగిడే మా(మీ) పత్రికకు శుభాకాంక్షలనందనీయడమూ మధురమే, పదికాలాలు వర్ధిల్లాలని ఆకాంక్షించడమూ మధురమే. 'హాసం' పత్రిక యాజమాన్యానికి ఇవే మా నూతన సంవత్సర శుభాభినందనలు.

**-అనుపోజు శివకుమార్,కొమరవాని పేట.**

'హాసం'లో వేటూరిగారి 'కొమ్మకొమ్మకో సన్నాయి' బాగా ఆకట్టుకుంటోంది. జనవరి 16-31 సంచికలో ఆయన గురించి 'అక్షరం ఆయన లక్షణం' లో ఎన్నింటినో తట్టారు. ఆ తట్టడంలో 'నాగమల్లి'ని మొత్తంగా మరిచిపోయారనిపించింది. 'నిదురపోయే నదులన్నీ కదిలిన అలజడిలో' - 'సందె గాలులు సన్నాయి పాడడం', 'వేణువులోని పదరేణువులెన్నో', 'ప్రాణానికి హాయినివ్వడం', 'జలధి తరంగం, అలల మృదంగం' లాంటి పద ప్రయోగాలు మనసును ఎక్కడెక్కడికో తీసుకెళ్ళిపోతాయి. ఆనంద డోలికల్లో ఊపేస్తాయి.

మీ వీలును బట్టి 'నాగమల్లి' (సినిమా పేరు కూడా అదేనేమో గుర్తులేదు - కానీ పాటలన్నీ ఆ 'పాత' మధురాలే) - పాటల్ని పరిచయం చేయండి.

**-దమ్ము శ్రీనివాసబాబు,హైదరాబాద్**

నేను విద్యా వాలంటీరుగా మా పల్లె ప్రాథమిక పాఠశాలలో పనిచేస్తున్నాను. 'హాసం' పత్రిక కోసమే నేను మదనపల్లె పట్టణానికి వెళ్ళి షాపులన్నీ వెతికి తీసుకొని చదవనిదే నాకు ప్రశాంతత వుండదు. ఇటువంటి హాస్య-సంగీత పత్రిక వేరేది లేదంటే నమ్మండి. నా విద్యార్థులకు చూపించి, వాటిలోని జోక్స్ చదివి వారిని నవ్విస్తూ వుంటాను. ఇంకా ఈ పత్రికలోని అలనాటి పాత మధురమైన గీతాలను ఆలపించి ఆహ్లాద పరుస్తుంటాను. అందుకే నేనంటే పిల్లలకు చాలా అభిమానం. ఈ అభిమానం 'హాసం' పత్రిక వలన నాకు లభించింది. ధన్యవాదములు.

**-వై.రాజానాయుడు,పెద్దచెన్నయ్యగారిపల్లె, చిత్తూరు**

'రాముడు-భీముడు' పాటలు,కథ నా స్కూల్‌డేస్ గుర్తుకి తెచ్చాయి. ఈ చిత్రంలో ఎన్.టి.ఆర్ ద్విపాత్రాభినయం చేసినా చివరిలో యిద్దరు రామారావులను ఒకే సీన్‌లో చూపేటప్పుడు, ఒక రామారావుకు బదులుగా సత్యనారాయణని చూపించారు! థియేటర్‌లో ఒకటే ఈలలు! తరువాత హిందీలో వచ్చిన 'రామ్ అవుర్ శ్యామ్' టెక్నికల్‌గా చాలా బెటర్. అందులో ఇద్దరూ దిలీప్ కుమార్లే మరి! కానీ పాటల విషయానికి కొస్తే మన తెలుగు చిత్రానిదే పైచేయి. రేలంగి,రమణారెడ్డిల మధ్య సాగే 'తగునా ఇదిమామ',రేలంగి,గిరిజలపై చిత్రీకరించిన 'సరదా సరదా సిగరెట్టు' వంటి హాస్య గీతాలు హిందీ చిత్రంలో లేవు.

**-బి.శ్రీనివాసరావు,గడ్డిఅన్నారం**

'హాసం' పత్రిక అంటే మాకెంతో ఇష్టం. హాస్యం,సంగీతం గూర్చి ఎవ్వరూ పట్టించుకోని సమయంలో మీరు 'హాసం' పేరుతో పత్రిక ప్రారంభించడం చాలా ఆనందదాయకం. దినదిన అభివృద్ధి చెందుతున్న పత్రికను చూస్తే చాలా గర్వంగా వుంటుంది. మీరు అందిస్తున్న జోక్స్,పాత రచయితల గూర్చి కవుల గూర్చి, హాస్యం కథలు చూసిన వెంటనే అభిమానులుగా మారిపోతున్నారు. సరిగపదమని క్విజ్ మరియు ఎలుక వచ్చే ఇల్లు భద్రం సీరియల్ చాలా బాగా నచ్చాయి. పత్రిక కొన్న వెంటనే క్విజ్ మరియు సీరియల్ చూడటం జరుగుతుంది. సంగీత చరిత్రను మరువకుండా ఆ తరం సంగీతంను ఈ తరం వారికి అందిస్తున్న రాజాగార్కి కృతజ్ఞతలు. జీవితంలో స్నేహితులను మరువకూడదు. పత్రికలలో 'హాసం'ను చదవడం మరువకూడదు. ఇలాగే సంగీత సుగంధాలు ప్రతి ఇంటా పరిమళించాలని కోరుతూ...

**-పెద్దబూది త్రివిక్రమ్‌సాగర్,సూగూర్**

16-31 జనవరి 'హాసం'లో రాముడు-భీముడు చిత్రం పాటలు చూశాను. అందులో 'ఉందిలే మంచికాలం' పాటలో 'ఎవిటేవిటి మంచికాలం అంటున్నావు ఎలా ఉంటుందో అది ఇశిదంగా చెప్పు' అనే మాటలు పెండ్యాల గారు చెప్పారు. ఆ చిత్రానికి రికార్డు చేసిన 'తలచుకుంటే మేనుపులకరించేనే' ప్రతిజ్ఞా పాలన చిత్రంలో హీరో హీరోయిన్ల మీద చిత్రీకరించారు. ఆ చిత్రానికి వేణు సంగీతం ఇచ్చినా రికార్డు మీద మాత్రం పెండ్యాల పేరు వ్రాశారు. భట్టి విక్రమార్క ఆ తరం వాళ్లు ఎప్పటికీ గుర్తు పెట్టుకుంటారు. చిత్రం విడుదలకు ముందే పాటలు బాగా ప్రజాదరణ పొందాయి. ఆ చిత్రం నెగిటివ్ కాలిపోయినందున మళ్లీ రీషూట్ చేసారని చెప్తుంటారు. పాటల పుస్తకాల మీదే బాగా ఆదాయం వచ్చిందంట. హిందీ డబ్బింగ్ బొంబాయిలో పెండ్యాల చేశారు. ఓ నెలరాజా హిందీలో సుమన్ కళ్యాణ్‌పూర్, మహేంద్రకపూర్ పాడగా బాగా ప్రజాదరణ పొందింది.

**-ఎం.పి.రావు, విజయవాడ**

16-31 జనవరి 2004 నాటి 'హాసం' పత్రికలో పాటలు ప్రత్యేకం శీర్షికన మీరు ప్రచురించిన 'రాముడు-భీముడు' పాటలు మమ్మల్నెంతగానో ఆనందపరచాయి. అలాగే ఆపాత మధురం శీర్షికన భట్టివిక్రమార్కను అందించిన రాజాగార్కి మా అభినందనలు తెలియజేస్తున్నాము.

ప్రతిసంచికలో ఒక పాటను (పాత లేదా కొత్త)నొటేషన్‌తో వేయగలరని ఆశిస్తున్నాను. 16-31 జనవరి 2004 సంచికలో 35వ పేజీలో 'ఉపరాష్ట్రపతి ఎల్.కె.అద్వానీ' అంటూ ఒక చిన్న పొరపాటు దొర్లింది. గమనించగలరు.

**-సి.విజయసారథి,కర్నూలు**

**(నిజమే... పొరపాటు దొర్లినందుకు బాధగానే ఉంది-ఎడిటర్)**

**1. 16-31 జనవరి 2004 'హాసం' 57వ పుటలో దర్శకులు సింగీతం శ్రీనివాసరావు 'మాయాబజార్' తర్వాత 'మిస్సమ్మ'లో తిరిగి విజయాలో ప్రవేశించారు ఎస్.రాజేశ్వరరావు అని వ్రాశారు. అది పొరపాటు. 'మిస్సమ్మ' విడుదల 12.1.1955, 'మాయాబజార్' విడుదల 27.3.1957. 'మాయాబజార్'కు కొన్ని పాటల స్వరకల్పన చేసిన రాజేశ్వరరావు కారణాంతరాలవల్ల తప్పుకుని తిరిగి 'అప్పుచేసి పప్పుకూడు' (1959) చిత్రానికి పనిచేశారు.**

**2. ఆ సంచికలోనే విలక్షణంగా ఉన్న 'రాజా' గారి సంతకంతో కూడిన 'అక్షరం ఆయన లక్షణం' అంటూ వేటూరి గారిపై రాసిన వ్యాసం (65వ పేజీ) పత్రికకే హైలెట్.**

**-ఎస్.వి.రామారావు,హైదరాబాద్**

1. మీరు పేర్కొన్న ఆ పొరపాటు కరెక్టే. ఈ విషయాన్ని సింగీతం శ్రీనివాసరావు గారి దృష్టికి తీసుకువచ్చాం. ఆయన కూడా సహృదయంతో అంగీకరించారు. కనుక ఆ పొరపాటు 'ప్రమాదో ధీమతా మపి' ఎక్కౌంట్‌లోకి వస్తుంది. -ఎడిటర్

2. ఆ సంతకం రాజాగారు పెట్టినది కాదు, కానీ ఆయన సంతకం అలాగే ఉంటుంది. వారిపై అభిమానంతో బాపుగారు 'అనుకరించి' బహూకరించినది. బుడుగును అనుకరించి మల్లాదిరామకృష్ణశాస్త్రిగారు ముళ్ళపూడికి అక్షరాశీర్వాదం చేశారు. అలాగే 'హాసం' సంపాదకుడికి బాపు చేసిన ఆశీర్వాదం అది!

- మేనేజింగ్ ఎడిటర్

సంపుటి: 3 సంచిక: 9

**1-15 ఫిబ్రవరి 2004**

**పేజీలు: 76**

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
**డా॥ కె.వి.రావు**
**జె.మధుసూదన శర్మ**



**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com



Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018
Fax: 040-23541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82



The one and only Magazine devoted to Humour & Music




# హాసం

## హాస్య - సంగీత పత్రిక

57

రిపబ్లిక్ డే వస్తోందంటే చాలు, తెలుగునాట ఒక నిరాశ, అసంతృప్తి, బాధ, నిర్వేదం - అన్నీ వ్యాపిస్తాయి. 'పద్మ' అవార్డుల లిస్టు చూడగానే నిట్టూర్చని తెలుగువాడుండడు.

ఈసారి కూడా రివాజు ప్రకారం - ఫలానావారి కిస్తారట, ప్రభుత్వం సిఫారసు చేసిందట, కేంద్రంలో ఉన్నది మిత్రపక్షమే కాబట్టి మనవాళ్ల మాట చెల్లుబాటవుతుందట... ఇలా అనేక 'ట' వార్తలు వచ్చాయి. ప్రతిభలో ఏ మాత్రం తీసిపోకపోయినా, మనవారు అవార్డుల విషయంలో వెనుకబడుతున్నారని ఇప్పుడు సామాన్యుడు కూడా గ్రహించగలుగుతున్నాడు. గ్రహించగానే వీరి పట్ల వివక్షత ఎందుకు చూపుతున్నారని అతని తలలో కూడా చిన్న సందేహం మెదలుతుంది.

ఈ అసమానతలు తలెత్తడానికి కారణాలు ఏవైనా కావచ్చు. ఎన్నైనా ఉండొచ్చు. ఎదుటి వారివైపు ఒక వేలు చూపిస్తే మనవైపు మూడువేళ్లుంటాయన్న విషయాన్ని స్ఫురణకు తెచ్చుకుని ఆత్మ విమర్శ చేసుకుంటే - మొట్టమొదటి కారణం - జాతీయస్థాయిలో మనల్ని నిలబెట్టే విద్య మనం నేర్వకపోవడమే! లాబీయింగ్ అన్న ప్రక్రియను చిన్నచూపు చూడడం మనవాళ్ల ప్రధానలోపం. (ఈ లాబీయింగ్ గురించి లోగడ ఓ ఎడిటోరియల్‌లో ఓసారి ప్రస్తావించటం జరిగింది.) హాలీవుడ్‌లో రచయితలకు కూడా ఏజంట్లు ఉంటారు. రచయితకు కథాకల్పనాశక్తి ఉండవచ్చు కానీ తనను తాను మార్కెట్ చేసుకునే శక్తి ఉండకపోవచ్చు. అందువల్ల ఆ కళ తెలిసినవారితో ఒప్పందానికి వస్తాడు, తన కళను పదిమందికి అందించే ప్రయత్నం చేస్తాడు.

భారతదేశం కంటె ఎంతో చిన్నదైన పాకిస్తాన్, భారత్‌తో సమానంగా అనేక నిధులు తెచ్చుకోగలుగుతోందంటే దానికి కారణం - సరైన లాబీయింగే! ఆ విద్యను నేర్వక అంతర్జాతీయ స్థాయిలో మనదేశం దెబ్బతింటూంటే, జాతీయస్థాయిలో మనరాష్ట్ర కళాకారులు దెబ్బతింటున్నారు. మార్కెటింగు పరిభాషలో 'పొజిషనింగ్' చేయాలంటే ఒక వస్తువు కానీ, వ్యక్తి కానీ ఎదుటివాడి మెదడులో ఒక స్థానాన్ని ఆక్రమించేట్లా 'ప్రెజెంట్' చేయాలి. ఆ వస్తువు లేదా వ్యక్తి - ప్రత్యేకత, సాధించిన విజయాలు సాక్ష్యాధారాలతో సహా పొందికైన భాషలో, సరైన అధికారులకు అందించినప్పుడు ఎంతోకొంత ఫలితం ఉంటుంది.

సాధారణంగా కళాకారులకు ఇటువంటి వాటిపై నిరాసక్తత హెచ్చు. ప్రేక్షకులను, రసజ్ఞులను అలరించడమే మా పని కానీ, అవార్డుల కోసం తిరగడం మా లక్ష్యం కాదంటారు వారు. కళ ఆత్మానందం కోసమే, కానీ పదిమందితో పంచుకున్ననాడు, దానికి సార్థకత. దానికి పై మెట్టు గుర్తింపు. "ప్రతిమనిషి కోరుకునేది - 'గుర్తింపు'. దానికోసమే అతను శ్రమిస్తాడు" అని హోచిమిన్ అంటాడు. వృత్తిని ఆరంభించిన తొలిదశలో వచ్చిన అవార్డులు స్ఫూర్తి నిస్తాయి. వృత్తికి మరింతగా అంకితమయ్యేటందుకు దోహదపడతాయి. చివరిదశలో వచ్చినవి సంతృప్తి నిస్తాయి. ఇన్నేళ్ల తమ తపస్సు ఫలించిందన్న ఆనందాన్నిస్తాయి. అందువల్ల ప్రజాదరణతో బాటు ప్రజాప్రభుత్వాలిచ్చే అవార్డులకు కూడా మనసుల్లో సముచిత స్థానం ఇవ్వాలి.

ఈసారి అవార్డులు వచ్చిన సంగీతప్రముఖులలో గుల్జార్ , మదురై టి.ఎన్.శేషగోపాలన్, ఎన్.రాజమ్, (పద్మభూషణ్) హరిహరన్, సుధారఘునాధన్, (పద్మశ్రీ) ఉన్నారు. కార్టూనిస్టులలో సుధీర్ తేలంగ్‌కు పద్మశ్రీ వచ్చింది. తెలుగునాట ఎవరెవరికి రావలసివుందో వేరే చెప్పనవసరం లేదు.

లాబీయింగ్‌పై మనవాళ్లు శ్రద్ధ వహిస్తే వచ్చేసారికి ఈ సంపాదకీయం రాయవలసిన అవసరం ఉండదు. తన వంతుగా 'హాసం' చరిత్రను అక్షరబద్ధం చేస్తోంది. గీతకోశం ద్వారా 2003లో విడుదలయిన సినిమాపాటల వివరాలయితేనేమి, బ్రహ్మానందం నటించిన సినిమాల లిస్టయితేనేమి - ఇవన్నీ ఆ దిశలో సాగే ప్రయత్నాలే!



# మా ఆవిడ ఫెమినిస్టు నేను రుబ్బురోలిస్టు...!



ప్రముఖ సినీ గీత రచయిత
**శ్రీ భువనచంద్ర**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

**మా ఆవిడ ఇంతే మరి మీ ఆవిడ?-3**

'**రు**బ్బటం' అనే పదం ఋగ్వేదమంతటి ప్రాచీనమైనది. అసలు వేదాలూ ఉపనిషత్తులూ ఎక్స్ట్రా ఈనాటి వరకూ నిలబడటానికి కారణం కూడా రుబ్బటమే! 'వల్లె' వేయడానికి బదులుగా 'రుబ్బటం' అన్న పదం కనిపెట్టినాడు ఘనాతి ఘనుడు. 'రుబ్బుట' అన్న పదం 'మోటు'గా వుందని, నాకు తెలీని బెజవాడ పండితుడొకడు 'రుబ్బింగ్' అని నామకరణం చేసి కొత్త సొగసుని పండించాడు. ఓ రోజు ఏలూర్రోడ్డులో (అప్పుడు దానిపేరు ఏలూర్రోడ్డే!) "ఇచ్చట చక్కగా దోసెపిండి రుబ్బింగ్ చెయ్యబడును" అన్న బోర్డు చూసేవరకూ ఇంగ్లీషూ తెలుగూ ఇంత చక్కగా కలిసి కాపరం చేస్తాయని నేనూ ఊహించలేదు. తెలుగు 'రుబ్బ' ఇంగ్లీషు 'ఇంగ్'తో కలిసి ఆంగ్లోఇండియన్‌లాగా ఆంగ్లో ఆంధ్రమై సెటిలయింది. ఆ బెజవాడ బుద్ధిశాలికి నా నమోవాకాలు.

ఈ 'రుబ్బటం' అనేది అతిప్రాచీనమైన 'కళ' అని ముందే విన్నవించాను గనక - కొంచెం లోపలికి తొంగిచూడటం మన ధర్మం. రాజకీయ నాయకులు 'వాగ్దానాల్ని' రుబ్బిరుబ్బి మరీ ప్రజలమీదకి వదుల్తారు.

సినీ రచయితలు నటులూ 'డైలాగుల్ని' రుబ్బిరుబ్బి ప్రజల్ని ఆహ్లాదపరుస్తారు.

పెళ్ళాలు వాళ్ళ 'పుట్టింటి ఘనతని' రుబ్బిరుబ్బి, మనల్నీ, మన వంశాల్నీ చులకన చేస్తారు.

ఇస్కూలు పిల్లకాయలు 'రుబ్బిరుబ్బి - పరీక్షలు పాసవుతారు. టీవీ వాళ్ళు ప్రకటనలు రుబ్బిరుబ్బి - మనచేత నానా చెత్తా కొనిపిస్తారు.

అంతెందుకూ - మా పక్కింటి సుబ్బమ్మగారు కూడా మినుముల్ని రుబ్బిరుబ్బి 'కృష్ణా నువు వేగమే రారా' అని కృష్ణుడ్ని సహాయానికి పిలుస్తారు.

తరచితరచి చూస్తే "ఇందుగలదందు లేదని సందేహము వలదు... రుబ్బింగ్" అనేది బోధపడుతుంది.

ఇహ అసలు విషయానికి వస్తే - కోడికూతతో లేచిన మా కూచిపూడిది కూడా పొద్దున్నే 'రుబ్బటం' మొదలెట్టింది.

నేను కూడా 'రామనామతారకం... భక్తి ముక్తిదాయకం' రుబ్బటం మొదలెట్టి చాలాసేపయింది. అయినా మా ఆవిడ మేలుకొలుపు వినాలిగా!

"ఏవుందీ? బతుకులో సుఖమా పాడా? వెధవది... పొద్దున్నే లేవటం ఆ అరవ పనిమనిషి మొహం చూడ్డం... ఆ తరవాత ఆ పాలగిన్నె పొయ్యి మీద తగలెట్టడం... ఆ నియ్యోగం వాడు (నేనే) లేచేసరికి కాఫీ సిద్ధం చెయ్యటం (మా ఆవిడ వైదీకి లెండి...) కొంపే కైలాసం... వంటే వైకుంఠం... హూఁ" అంటూ ప్రారంభించింది.

ఇది ప్రతిరోజూ వినే రికార్డే కాబట్టి నేనేం తొణకలా... బెణకలా.

'రికార్డు'కి తెలుగు పదం కనిపెడితే బాగుండుననే ఆలోచన అరవదేశాని కొచ్చాక బలపడింది. ఇక్కడ 'గ్రామఫోన్ రికార్డు'ని



'ఇసైతట్ట' అని (ఇది ఇదివరకు కథలో చెప్పా కదా) - హార్మోనీ పెట్టెని 'ఇసైపొట్టి' అనిన్నూ అరవ్వాళ్ళు తమిళించుకున్నారు. మన పండితులకామాత్రం 'భాషాభిమానం' లేకపాయె! ఏం చేస్తాం!!

ఇంతలోకి మా ఆవిడ వచ్చి... "హూ..! రామరామాట!... దేవుడి చెవులు పగిలి పోయేంతగా అరవకపోతే - మా నాన్నగారూ మా తమ్ముడూ న్మరించుకున్నట్టు మెల్లగా అనకూడదూ? పుణ్యంకొద్దీ పురుషుడూ, దానంకొద్దీ బిడ్డలూ అని మా అమ్మమ్మ ఏనాడో చెప్పింది. చేనుకున్నంత వారికి చేసున్నంతనీ..." ఠపీమని గ్లాసు టేబిలు మీద పెట్టి చక్కాబోయింది.

ఆ మాత్రం 'కోటా' పడకపోతే నాకూ పూర్తిగా మెలకువరాదు గనక యీసారీ నేను తొణకలా. వినాల్సింది వినేసి నేను వాకింగ్ కమ్ కూరగాయల మార్కెటింగ్‌కి బయలుదేరిపోయా...! వలసర వాకంలో అన్నిటికంటే 'పొడుగైన' రోడ్డు మాదే. ఎవరు కనిపించినా 'పళ్ళికిలించటం' నా అలవాటు గనక - నేను కనపడినా ఆడామొగా 'పళ్ళి కిలిస్తారు'. ఒకరిద్దరు రోడ్డుమీదే



అవి 'పిచ్చాపాటీ' ముచ్చటిస్తారు కూడా. అలా అలా తిరిగి తిరిగి కూరగాయలు కొని నంచీ వూపుకుంటూ విలాసంగా నడుస్తూ మళ్ళీ మా వీధి మొదలు కొచ్చేసరికి నటరాజన్ కనబడ్డాడు. నన్ను చూడగానే భోరుమంటూ కాళ్ళమీద పడ్డాడు. ఆయనో రిటైర్డు స్టేషన్ మాస్టరు.

"ఛ...ఛ... ఏమైంది నటరాజన్ గారూ... డబ్బేమైనా కావాలా?" బలవంతంగా లేవదీసి అడిగా. (మా ఆవిడకి తెలీకుండా అప్పుడప్పుడూ వాళ్ళకీ వీళ్ళకీ చేబదుళ్ళు ఇస్తూవుంటా!... ఇప్పుడూ ఏదో అవసరం పడిందేమోనని డబ్బు కావాలా అని అడిగింది అందుకే)

"డబ్బా నా బొందా... సారూ... ఇది కయ్యిల్ల... కాలేదా... (ఇవి చేతులు కాదు కాళ్ళే అని తెలుగర్థం) నువ్వు నన్ను ఒడ్డుకి చేరుస్తానన్నాకే వదుల్తా!" అన్నాడు నటరాజన్.

"ఏం జరిగిందో చెప్పవయ్యా స్వామీ... కాలో చెయ్యో తరువాత చూద్దాం..." విసుక్కున్నా.

అసలే అరవ్వాడు. అందులోనూ అరచి మాట్లాడుతుంటే విసుగురాదూ...!

"నిన్నటిదాకా నా పొండాట్టి (పెళ్ళాం) బాగానే వుండాది సామీ.. ఈ పొద్దే మీ ఇంటికాడ మీటింగు వినొచ్చిన కాడ్నించీ నన్ను వుతికేస్తా వుండాది సామీ... మీ ఇంటావిడ ఏం చెప్పిందో కనుక్కోండి సామీ... నాకు ఇల్లంటేనే భయమేస్తా వుండాది సామీ..." వలవలా పడ్డాడు నటరాజన్.

"సరే నటరాజన్ సార్... నే కనుక్కుంటాగా... ప్లీజ్... కొంచెం కంట్రోలవండి.." అని సముదాయించి ఇంటివైపు దూసుకెళ్ళా.

బుర్రలో లక్షా తొంభై ఆలోచనలు. నటరాజన్ భార్య చాలా నెమ్మదస్తురాలు. ఎప్పుడు చూసినా ఏదో ఒక పని చేస్తూనే వుంటుంది. పనిలేకపోతే లక్ష్మీ సహస్రనామాలో మరొకటో చదువుకుంటూ వుంటుంది. అలాంటావిడ వాళ్ళాయన్ని పట్టుకు 'వుతికేసిందంటే' ఏమై వుండాలీ. అందులోనూ నాకు తెలీకుండా మా యింట్లో మీటింగేమిటీ?

"సార్" ఎవరో వెనకనించి పిలిస్తే తిరిగి చూశా. సుందరపాండి. ఆయనో బేంక్ ఆఫీసర్. తెలుగు బాగా వచ్చు. ఆంధ్రాలో కొంతకాలం పనిచేశాడు.

"సార్... ఇదేమన్నా బాగుందాసార్ !" ఇబ్బందిగా మొహం పెట్టి అన్నాడు.

"ఏమయింది?" అడిగా.

"తెలియనట్టు అడుగుతారేంటి సార్? మీయింట్లో నిన్న సాయంత్రం మీటింగు జరిగిందని మీకు తెలీదా? మీ వైఫ్‌గారు 'స్త్రీస్వాతంత్ర్యం' గురించి మాట్లాడిన విషయం మీకు తెలీదా?" నిష్ఠూరంగా అన్నాడు.

"నిజంగానే తెలీదు సుందరపాండి... నిన్న వచ్చేసరికే చాలా పొద్దుపోయింది" వివరించా. "అసలేమయింది?"

'హాసం' రీడర్స్ 'ఫేమిలీ'లో నేనూ ఓ మెంబర్ని. పెద్దపెద్ద వాళ్ళు (కుటుంబంలో) సరదాగా సభ తీరి కూర్చున్నప్పుడు పిల్లకాయలు కాస్త ఎక్కువ చనువు తీసుకుని 'తమ విద్యల్ని' ప్రదర్శిస్తూ వుంటారు. ఆ 'విద్య' మిమిక్రీ కావచ్చు... పాటలు కావచ్చు... ఆటలు కావొచ్చు. వాళ్ళు ప్రదర్శించే విద్యల్లో (ప్రజంటేషన్లో) ఎన్ని లోపాలున్నా 'పెద్దవాళ్ళు' ఎలా క్షమించి భుజం తట్టి ప్రోత్సహిస్తారో అలాగే మీరు నన్ను ప్రోత్సహిస్తున్నారని తెలుసు. కానీ ఉత్సాహం ఊరుకోదుగా... మరో కథ వ్రాయించింది. అదీ మన 'హాసాని'కే పంపుతున్నా.

మా ఆవిడ ఫెమినిస్టు సంగతేమో గానీ నేను రుబ్బురోలిస్టునని మన సంగీతం బాబాయ్ 'మణిశర్మ' గారి దగ్గర్నుంచీ మోహన్‌బాబు గారి ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ 'బాబు' దాకా అందరికీ తెలుసు.

మా ఇంటిచుట్టుపక్కల వాళ్ళకి మరీ మరీ తెలుసు. రుబ్బిన 'కథ' ఎలా వుందో తెలియజేస్తే నెక్స్ట్‌టైమ్ ఉప్పూ కారాలు 'సరి' చూసుకుంటాను.

ఇది అమ్మలగన్న అమ్మ మా రామలక్ష్మమ్మకి (శ్రీమతి ఆరుద్రకి) అంకితం

నమస్కారములతో...
భువనచంద్ర

"హూ..! మందేసి ఇంటికొచ్చినా మా ఆవిడ నోరెత్తేదిగాదు... అలాంటిది... ఇవాళ పొద్దునే చెడామడా తిట్టింది. పోనీ 'కోపంగా ఉందేమో' అని సరిపెట్టుకున్నా - ఇరుగుపొరుగు మగాళ్ళ గతీ నాలాగే తయారైంది. ఏమిటా అని ఎంక్వైర్ చేస్తే ఆడాళ్ళంతా నిన్న సాయంత్రం మీ ఇంట్లో సమావేశమైనట్టు పిల్లలు చెప్పారు. ఇవాళ్టినించీ మా పనులు మేంమే చేసుకోవాలిట. ఆడ బతుకు పనిమనిషి బతుక్కన్నా హీనమైపోయిందిట. మా ఆవిడ అనే ఒక్కొక్క మాటా వింటుంటే నా గుండె పగిలి బీటలు వారింది. నా కాఫీ నేనే పెట్టుకోవాలిట. రోజుకోపూట చచ్చినట్టు నేనే వంట చెయ్యాల్ట. అలా చేస్తే గానీ 'మగపీనుగులకి బుద్ధిరాదని మా ఆవిడ బల్లగుద్ది మరీ చెప్పిందిట... ఇది బాగుందా సారూ?'' ఏడుపు మొహంతో అన్నాడు సుందపాండి.

"నేను కనుక్కుంటా సుందరపాండీ సార్... కొంచెం... ఇంటిదాకా వెళ్ళనివ్వండి..!" అనునయిస్తుండగానే

''ఏంటండీ కనుక్కునేది? మీరు కనుక్కునేసరికి మేము చావడమో సన్యాసుల్లో కలవడమో జరిగిపోతుంది... అయినా ఆ మాత్రం పెళ్ళాన్ని కంట్రోల్‌లో పెట్టుకోపోతే ఎలాగండీ'' అరుస్తూ వచ్చాడు వరదాచారి.

వాళ్ళకి సర్ది చెప్పేసరికి నా తలప్రాణం తోకకి వచ్చింది. అసలీ గోలంతా ఏమిటీ... మా ఇంట్లో మీటింగేమిటీ? అసలే కూచిపూడిది...! 'భామా కలాపం' వెన్నతో పెట్టిన విద్య. ఏం చెయ్యాలీ? ఆలోచిస్తూ ఇల్లు చేరేసరికి గేటుకి అటువైపు ఆడవాళ్ళు, ఇటువైపు మగవాళ్లలో 'భిన్నత్వంలో ఏకత్వం' ప్రతిఫలిస్తోంది. నన్ను చూసి ఆ గుంపులో ఎవరో అరిచారు.

'ఆగయా...'

'వచ్చాడు...'




మగాళ్ళంతా నా చుట్టూ మూగి నానా రకాల అంగన్యాస కరన్యాసాలతో అనేకానేక శృతులతో తమ గోడు వెళ్ళబోసుకున్నారు.

గేటుకవతల ఆడాళ్ళ మధ్యలోంచి నన్ను చిద్విలాసంగా చూస్తోంది మా ఆవిడ. నేను గేటు తియ్యగానే ఆడాళ్ళు మర్యాదగా నాకు దారి ఇచ్చారు. నేనంటే మా వీధి ఆడవాళ్ళందరికీ కాస్త సదభిప్రాయం ఎక్కువే. (ఎటొచ్చీ నా పెళ్ళానికీ - వాళ్ళ పుట్టింటి వాళ్ళకే - లేదు..!)

''ఏం జరిగిందే కూచిపూడిదానా...! ఏమిటీగోల... జనాలు నన్ను చూసి అరుస్తూ ఏడుస్తూవుంటే తలెత్తుకోలేకపోయా...! ఇటువంటి అవమానం అసలు ఏ మొగుడికైనా జరుగుతుందా? మనింట్లో మీటింగేమిటి...?




నువ్వు ఆడవాళ్ళకి ఏదేదో నూరిపొయ్యడం ఏమిటి? వాళ్ళంతా మొగుళ్ళ మీద తిరగబడటం ఏమిటి? చెపుతావా? సన్యాసుల్లో కలిసిపొమ్మంటావా!'' కోపంగా అరిచా. 'కిసుక్కు'మని ఓ నవ్వు నవ్వింది గానీ నా ప్రశ్నలకి జవాబివ్వలా.

గేటుకివతల మగాళ్ళంతా చోద్యం చూస్తున్నారు. ఆడాళ్ళు మాత్రం వాళ్ళ ఎక్స్‌ప్రెషన్ మార్చలా. అసలే చింతలపూడి వాడ్ని. మరి కోపం ముంచుకొచ్చిందంటే ముంచుకురాదూ?

''ఓయ్... అటో ఇటో ఇవాళ తేలిపోవాల్సిందే..! మర్యాదగా నా ప్రశ్నలకి సమాధానం చెపుతావా లేకపోతే మా పుట్టింటికి వెళ్ళి పొమ్మంటావా?'' సీరియస్‌గా అడిగాను.

తెలుగు తెలిసిన ఆడాళ్ళు పకపకా నవ్వితే... తెలుగు అర్థమైన మొగాళ్ళు నెత్తికొట్టుకున్నారు.

''ఇప్పుడే చెప్పాలా... తరవాత చెప్పొచ్చా?'' ఛాయిస్ ఇచ్చింది మా ఆవిడ.

''ఇవుడు చెప్పాల్సిందే... చెప్పితీరాల్సిందే'' కోరస్‌గా నానా భాషల్లోనూ అరిచారు మగాళ్ళు.

"ఓకే...! మీ మగాళ్ళ దౌర్జన్యాన్ని మేం సహించం..! నానా తిప్పలూపడి టైమ్‌కి వండి వారుస్తుంటే మమ్మల్ని - అందరి ముందూ చులకనగా మాట్లాడటం మేం సహించం! మీ అన్నం ఇకనించీ మీరే వండుకోవాలి..! మీ పన్లు మీరే చేసుకోవాలి..! మీకు మీరే మాకు మేమే!'' అంటూ 'మిస్సమ్మ' లో సావిత్రిలా పాడుతూ డిక్లేర్ చేసింది మా ఆవిడ. ఆడాళ్ళంతా చప్పట్లు చరిచారు.

"నథింగ్ డూయింగ్...! మీ కోసం రెక్కలు ముక్కలయ్యేట్టు పనిచేస్తున్నాం...! నానాగడ్డీ కరిచి నెలాఖరుకి ఇన్ని విచ్చురూపాయలు మీ చేతుల్లో పోస్తున్నాం...! మా పనులు మేం చేసుకోవాల్సిన ఖర్మ మాకు పట్టలేదు...'' అరిచాడు సుందరపాండి.

"కావాలంటే మీ ఆయన్తో మీ ఇష్టం వచ్చిన పనులు చేయించుకోండి...! మా ఆడాళ్ళకి మాత్రం మీరు చచ్చు పుచ్చు వుపన్యాసాలిచ్చి పాడు చెయ్యటానికి వీల్లేదు'' అరిచాడు వరదాచారి.

''మీ ఆటలు... న...న...న...న... సాగనివ్వం'' తీవ్రంగా అన్నాడు నత్తినాయర్.

ఆడాళ్ళంతా ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకొని నవ్వుకున్నారు. మా ఆవిడ మళ్ళీ ఓ స్మైలిచ్చి...'' ఓకే... మా ప్రశ్నకి ముందు మీరు సమాధానం చెప్పండి.. మొన్న ఏం వారం?'' అడిగింది.

"ఆదివారం! అటు మొన్న శనివారం... నిన్న సోమవారం... రేపు బుధవారం... చాలా!''

కోపంగా అన్నా.

"కరెక్ట్... మాంచి జ్ఞాపకశక్తి...! ఆ రోజు సాయంత్రం మీరంతా ఏం చేశారో జ్ఞాపకం వుందా?" తలెగరేసి అంది మా ఆవిడ.

"ఏవుందీ... మేమంతా ఆ రోజు 'బార్ డే' కింద డిక్లేర్ చేసి కొన్ని మందు పుచ్చుకున్నాం... అంతేగా?" జవాబిచ్చా.

నెలకి రెండుసార్లు సరదాగా మొగాళ్ళమంతా మా మేడమీద కాస్త 'జల్సా పార్టీ' చేసుకుంటే - ఆడాళ్ళు కబుర్లు చెప్పుకుంటారు. 'ఫుల్ డిన్నర్ లైవ్'లో భోజనాలవంగానే ఎవరింటికి వాళ్ళు పోతారు. అది మామూలే.

"మందు పుచ్చుకోవటం గురించి కాదు నేనడిగింది...! ఆ రోజు ఏం మాట్లాడారో జ్ఞాపకం వుందా అని!" ఛాలెంజి నవ్వొకటి విసిరి అన్నది.

మనకసలే మతిమరుపు. ఆవిడదేమో టెలిగ్రాఫిక్ మెమొరీ... చచ్చా!

"ఏం జ్ఞాపకం లేదా? వన్ మినిట్" అని లోపలికెళ్ళింది.

మరుక్షణంలో ఎల్.ఐ.సి. ఆవిడా, పూం పుహార్ ఆవిడా (అందులో పనిచేస్తోంది లెండి) టీవీ ట్రాలీ తోసుకొచ్చారు. దానిమీద టీవీ లేదు కానీ మా ఆవిడకి వాళ్ళన్న కొనిచ్చిన 'పే...ద్ద' టేప్ రికార్డర్ వుంది. (ఆ టేప్ రికార్డర్ పాకెట్ సైజుది...! వాళ్ళ పుట్టింటివాళ్ళు గుండుసూదిని ప్రజంటు చేసినా అది మా ఆవిడకి గజరాజులా కనిపిస్తుంది...!)

"అసలు మాతాత అంత దూరాన కనపడగానే మా నాయనమ్మ ఒణికిపోయేది...! మరి మా నాన్న? 'ఒసేయ్' అని అరిచాడంటే




మా అమ్మ బాత్రూంలో వున్నా పరిగెట్టుకు రావాల్సిందే... మనమే మన పెళ్ళాలకి అలుసిస్తున్నాం వరదాచారీ..." మా పూర్వీకుల్ని నోరారా పొడుగుతున్న గొంతు నాదే.

"ఆమసార్..! మా తాంతా అంతే సార్...! మా అమ్మని పుట్టింటికే పంపలేదు..! మా అమ్మ పుట్టింటాళ్ళు వస్తే రాళ్ళు విసిరేవాడు" నటరాజన్ గొంతు...

మొత్తం 12 స్వరాలు... ఇంక్లూడింగ్ గుజరాతీ భగవాన్‌దాస్ అండ్ బెంగాలీ బెనర్జీ.

"ఆడదంటే గాడిద... తన్నకపోతే మాట వినదు..." కంక్లూడింగ్ వాయిస్ కుమరన్‌ది.

మా ముఖాలన్నీ నల్లబడిపోయాయి. నోట మాట రాలేదు.

మా ఆవిడ నా వంక చురచురా చూసొన్నా" ఏంవాయ్...! బారుకెళ్ళి తగలేస్తున్నారని పక్షానికోసారి ఇంట్లో మందుకి ఎలౌ చేస్తే మీరు కూసే కూతలివా? మీ అక్కల్నీ చెల్లెళ్ళనీ వాళ్ళ మొగుళ్ళు ఏమీ అనకూడదు. మీరు మాత్రం మీ పెళ్ళాల మీద అథార్టీ చెలాయించాలా? మీ ఆడపిల్లలు పురుళ్ళకీ పుణ్యాలకీ మీ ఇంటికి రావాలి గానీ - మీ పెళ్ళాల్ని మాత్రం పుట్టింటికి పంపరా? ఆర్నెల్లనించీ 'బార్ డే' రోజున మీరు వాగే వాగుడంతా రికార్డు చేసే వుంచాం. సుప్రీంకోర్టు కెళ్ళినా తీర్పు మావైపే వస్తుంది. ఖబడ్దార్!" గుక్కతిప్పుకోకుండా వుపన్యాసం చేసింది.

మా ఇంట్లో ఆరోజున కొబ్బరిపచ్చడి నేను రుబ్బుతుంటే, పక్కింటి సెల్వమణి మోపెడు మాసిపోయిన బట్టల్ని భుజానేసుకుని బావిదగ్గర కూలబడ్డాడు. ఎదురింటి వరదాచారి గరిట తిప్పుతున్నాడు. "కృష్ణా నీ బేగనే బారో' అంటూ సుందరపాండి పిల్లల్ని ఆడిస్తున్నాడు. మా ఆవిడ మాత్రం ఠీవిగా టీవీ చూస్తోంది.

మరి మీ ఆవిడ?

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-27402993

## తూరుపు దిక్కున అదిగో చూడు

ప॥ తూరుపు దిక్కున అదిగో
తూరుపు దిక్కున అదిగో చూడు
పొడిచె వేగు చుక్క ॥తూరుపు॥

చ॥సత్యాహింసల సూర్యోదయమై
నిత్యము శాంతి నిత్యము కాంతి
దేశ దేశ ప్రజల సంతోషించే
వార్తను తెచ్చిన చుక్క
పొడిచె వేగు చుక్క ॥తూరుపు॥

చ॥ తరతరాలుగా మానవోత్తములు
పురుషోత్తములు బుద్ధుడు క్రీస్తు
నరజాతికి చూపించిన త్రోవ
తిరిగి చూపే ఒకే ఒక్క చుక్క
పొడిచె వేగు చుక్క ॥తూరుపు॥

**రచన** : కీ॥శే॥ఆరుద్ర
**గానం,సంగీతం**: కీ॥శే॥ఘంటసాల వేంకటేశ్వరరావు
**రాగం**: గుణక్రియ
(హిందుస్తాని సం॥)
బైరవ్ థాట్ యొక్క జన్యరాగం
(అనగా మాయామాళవగౌళ రాగజన్యం)
(-కర్ణాటక సం॥)
**తాళం**: చతురశ్ర గతి(కర్ణాటక సం॥)
-కహరువా(హిందుస్తాని సం॥)
**ఆరోహణ**: సరిమపదస
**అవరోహణ**: సదపమరిస

సుప్రసిద్ధ గాయకుడు, సంగీత దర్శకుడు అయిన కీ॥శే॥ ఘంటసాల వేంకటేశ్వరరావు గారు 1940 దశకం నుండి ఆకాశవాణి మద్రాసు కేంద్రంలో తరచుగా లలిత సంగీతం పాడుతూండేవారు. ఆ కాలంలో రేడియోలో రికార్డింగ్ సౌకర్యాలు వుండేవి కావు. కాబట్టి గాయనీ గాయకులు పాడగా డైరెక్టుగా ప్రసారం చేసేవారు, అనగా లైవ్ ప్రోగ్రాములు జరిగేవన్నమాట. ఆ రోజులలో ఘంటసాల, పి.భానుమతి, ఎస్.వరలక్ష్మి,



**షడ్జము, శుద్ధ రిషభం, శుద్ధ మధ్యమం, పంచమం, శుద్ధదైవతం, యీరాగంలోని స్వరాలు**

అన్యస్వరమైన కైశికి నిషాదాన్ని కూడా ఉపయోగించి స్వరకర్త మధురమైన బాణీని కూర్చారు. గుణక్రియ అనే ఈ హిందుస్తాని రాగం బైరవ్ థాట్ యొక్క జన్యం. అనగా 15వ మేళకర్త అయిన మాయామాళవగౌళ రాగం యొక్క జన్యం కర్ణాటక సంగీతం ప్రకారం. హిందుస్తాని సంగీతంలోని 10 థాట్‌లలో (మేళకర్తరాగాలలో) బైరవ్ కూడా ఒకటి. కర్ణాటక సంగీతంలోని మాయామాళవగౌళ యొక్క జన్యాలైన భూపాలం, బౌళి,సావేరి రాగాలు బహుళ ప్రాచుర్యాన్ని పొందిన రాగాలే. సరిగపదస - సదపగరిస అనే మూర్ఛన కలిగిన భూపాలరాగాన్ని హిందుస్తానిలో "బిభాస్" అని అంటారు. సరిగపదస - సనిదపగరిస అనే మూర్ఛన కలిగిన బౌళిరాగాన్ని హిందుస్తానిలో "త్రివేణి" అని పిలుస్తారు. సరిమపదస - సనిదపమగరిస అనే మూర్ఛన కలిగిన సావేరి రాగాన్ని హిందుస్తానిలో "జోగియా" అనే పేరుతో వ్యవహరిస్తారు. భూపాలం,బౌళి రాగాలవలె హిందుస్తానిలోని బిభాస్, త్రివేణి రాగాలు కూడా ప్రాతః కాలమున గానం చేయబడేవే, ప్రస్తుతం ప్రస్తావించబడుతున్న గుణక్రియ రాగం కూడా ప్రాతః కాలమున గానం చేయబడేదే.





రాజేశ్వరరావు, రావు బాల సరస్వతీ దేవి, ఎమ్.ఎస్.రామారావు, టంగుటూరి సూర్య కుమారి, వింజమూరి అనసూయాదేవి, సీతాదేవి, పి.లీల, శాంతకుమారి మొదలగు వారంతా తరచుగా ఆకాశవాణి మద్రాసు కేంద్రం నుండి లలిత గీతాలు పాడేవారు. 1954,55 వరకూ అవన్నీ నేను వింటూండేవాడిని. 1956లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ జరిగిన తరువాత మద్రాసు కేంద్రంలో తెలుగు కార్యక్రమాలు ప్రసారం కావడం తగ్గుముఖం పట్టింది.



ఆ రోజులలో ఘంటసాలగారు పాడిన గీతాలలో కొన్ని ఆకాశవాణిలో టి.ఎస్. రికార్డులుగా (Transcription Service Records) నిక్షిప్తం చేయబడి యిప్పటికీ ప్రసారమవుతూనే వున్నాయి.వెనుకటి "హాసం" పత్రికలలో నేను ప్రస్తావించిన "పాడకనే నారాణి పాడకే పాట", "వేదంలా గోదావరిప్రవహిస్తోందే", "ఏడుకొండల సామి ఎక్కడున్నావయ్యా" మొదలగునవి ఆకాశవాణిలో భద్రపరచబడినవే.

1953,54 ప్రాంతంలో ఆరుద్ర రచించిన "సాగేను కారు రేగే హుషారు పోవాలి మది బేజారు", "తూరుపు దిక్కున అదిగో చూడు" పాటలను ఘంటసాల పాడారు మద్రాసు కేంద్రం నుండి. ఆ పాటలు నేను విని ఆ తరువాత "తూరుపు దిక్కున అదిగో" పాటను చాలా మందికి నేర్పి పాడించాను అనేక కార్యక్ర మాలలో. ఎన్నో ప్రాంతాలలో వేదికల మీద జరిపిన లలిత సంగీత కార్యక్రమాలలో ఆయన సుమారు 6 వాయిద్యాల (2 వయొలిన్లు, ఒక హార్మోనియం, ఒక క్లారినెట్, తబల, డోలక్ లేక రిథమ్స్ కలిగిన చిన్న ఆర్కెస్ట్రాతో) సహకారంతో పాడుతూం డేవారు. అలాంటి కార్యక్రమాలు నేను చాలా వినడం జరిగింది. హిందుస్తాని సంగీతంలో ఉద్దండ పండితుడు, మహా విద్వాంసుడు అయిన ఉస్తాద్ బడే గులాం అలీఖాన్‌కి తన యింట



సుమారు రెండు నెలల పాటు ఆతిథ్యమిచ్చి, ఆయన సంగీతానికి ఎంతో ప్రభావితులై, ఘంటసాల హిందుస్తాని సంగీత రీతులను బాగా ఆకళింపు చేసుకున్నారు. ఆ తరువాత ఆయన కొన్ని హిందుస్తాని రాగాలను వినియోగించి సుమధురమౌ బాణీలను సృజించి కడు హృద్యంగా గానం చేసిన గీతాలెన్నో వున్నాయి. ఇప్పుడు ప్రస్తావించబడుతున్న "తూరుపు దిక్కున అదిగో" అనే గేయం కూడా అటువంటిదే.

సత్యాహింసలే మానవాళి మనుగడకు ఆవశ్యకమని, తదను గుణంగా బుద్ధుడు, క్రీస్తు వంటి పురుషోత్తములు ఆచరించిన ఆ మార్గమును తిరిగి చూపగ "వేగుచుక్క పొడిచిందని, దేశప్రజలు సంతోషించే ఆ వార్తను తెచ్చిందని చక్కని సందేశాన్ని అందించారు కవి ఆరుద్ర ఈ గీతంలో. ఘంటసాల చక్కని బాణీని కూర్చిన ఆ గీతాన్ని ఈ మహనీయుడి వర్ధంతి సందర్భంగా మననం చేసుకుని ఆయనకు అందరం ఘనంగా నివాళులర్పిద్దాం!



ప్రముఖ దర్శకుడు
శ్రీ సింగీతం శ్రీనివాసరావు
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

కరాజు కథలు

6

# గొప్పవాడు



కొన్ని సంవత్సరాల క్రితం కరాజుకొక ఆలోచన వచ్చింది - తన రాజ్యంలో ఏ రంగం లోనైనా సరే ఉన్నత శిఖరాలను అధిరోహించిన వారిలో ప్రతియేటా ముగ్గుర్ని ఎంపికచేసి వారికి ఒక ప్రశస్తమైన బిరుదును ప్రసాదించాలని!

ఇంతవరకు ఇస్తున్న బిరుదులన్నీ ఆయా కోవలకు చెందిన ఉత్తములకు వారి వారి ప్రత్యేక ప్రతిభలకు సరిపోయేవి. అంటే సంగీతానికి కోకిల, నాట్యానికి మయూరి, కవికి శార్దూల, వీరునికి సింహ - ఇలా ఎన్నెన్నో బిరుదులు. ఈ బిరుదులు అందరికీ ఒక రీతిన సరిపోయే ఒకే బిరుదు కాదు. వీర మయూరి అని, సంగీత సింహం అని, నట కోకిల అని అనలేం కదా!

పైగా ఇంతవరకూ బిరుదులన్నీ కళాకారులకే ఇవ్వడం జరుగుతున్నది. కానీ వ్యాపారాలలో, వైద్యవృత్తిలో, పరిశోధనలలో, ఇంకా విజ్ఞానంలో కూడిన ఎన్నో ప్రక్రియల్లో గొప్పగా కృషి చేసి గొప్పగా రాణించిన వారున్నారు. మరి వారి మాటేమిటి?

అందుకని అందరికీ చెందేలాంటి ఒకే బిరుదును ఎంపికచేసి, దానిని సంవత్సరానికి ముగ్గురు గొప్పవాళ్ళకు ప్రసాదించాలనుకున్నాడు కరాజు. కానీ ప్రస్తుత సమస్య బిరుదును ప్రసాదించడమూ కాదు, దానికి అర్హులైన వారిని ఎంపిక చేయడమూ కాదు. వచ్చిన చిక్కల్లా ఆ బిరుదుకు ఒక మంచి మాటను నిర్ణయించడం. ఇందుకుగాను రాజ్యంలోని భాషా ప్రముఖులను పిలిపించమని కరాజు మంత్రిని ఆదేశించాడు. ప్రముఖులంతా రాజుగారి ఆలోచనా మందిరంలో సమావేశమయ్యారు. వారికి కరాజు తన ఉద్దేశాన్ని వివరించాడు.

"ప్రముఖులారా! మన రాజ్యంలో ఎందరో గొప్పవారున్నారు. వారిలో ముగ్గురికి ప్రతి సంవత్సరం ఒక ప్రతిష్టాత్మకమైన బిరుదు నివ్వాలనుకున్నాను. రాజ్యంలోని ఆ గొప్పవారి పేర్లకు ఈ బిరుదును జతచేసి అందరూ చెప్పుకుంటూంటే, అది వారి గొప్పతనాన్ని రాజ్యమంతా మెచ్చుకున్నట్టౌతుంది. ఇప్పుడు మీరు సూచించవలసిందల్లా ఆ గొప్పవాళ్ళకు ఇవ్వదగిన బిరుదుపేరు" అన్నాడు కరాజు.

రాజుగారి మెప్పు పొందడానికి ఎవరికి వారు ఏవేవో పేర్లను సూచించడం మొదలెట్టారు. "రాజ్య కంఠహార నాయక మణి", "అనవూన కార్యసాధక శిరోమణి" - ఇలా..

కరాజు కివేవీ నచ్చలేదు. బిరుదు చిన్నదిగా ఉండాలి, అందరికీ అర్థం అయ్యేదిగా ఉండాలి, అన్నిటికంటే ముఖ్యం అందరూ చెప్పుకో గలిగినదిగా ఉండాలన్నది కరాజు కోరిక. అలాంటిది ఎంత ఆలోచించినా ఎవ్వరికీ తట్టలేదు.

ఆ సమయంలో పెద్దగా ఆలోచనలుచేసే అలవాటు లేని ఒక ఉపమంత్రి, "మహారాజా! ఎందుకింత ఆలోచన? వీళ్ళంతా గొప్పవాళ్ళంటున్నాం. అలాంటప్పుడు ఈ బిరుదు పేరే "గొప్పవాడు" అంటే పోలా? అందరికీ అర్థం అవుతుంది. అందరూ చెప్పుకోడానికి వీలుగా ఉంటుంది." అన్నాడు.

ఆలోచించేకొద్దీ ఈ సలహా కరాజుకు బాగా నచ్చింది. ఒక సుముహూర్తాన 'గొప్పవాడు' బిరుదును ముగ్గురికి ప్రసాదించాడు. అప్పట్నుంచి సంవత్సరానికి ముగ్గురు 'గొప్పవాడు'

బిరుదాంకితులు రాజ్యంలో ఉద్భవించడం మొదలెట్టారు.

ఈ సంవత్సరం బిరుదును పొందిన ముగ్గురిలో ఒకరు అన్ని భాషల్లోని నీతులను తెలుగులోకి తర్జుమా చేసిన 'గొప్పవాడు' తర్జుమా అర్జునరాజు, మౌనవ్రత ఘనతను గూర్చి వెయ్యికి పైగా సభల్లో ఉపన్యాసాలిచ్చిన 'గొప్పవాడు' సభల సుబ్బారాయుడు, వరదల మీద పది సంవత్సరాలు పరిశోధన చేసి 'వరదల ఫలితం' అనే పుస్తకాన్ని రాసిన 'గొప్పవాడు' వరదల వరదాచారి.

'గొప్పవాడు' బిరుదు పొందిన వారంతా, సమాజంలో వారికి లభిస్తున్న గౌరవంతో, ఆనందంతో ఆకాశంలో తేలిపోతున్నట్టున్నారు. బిరుదు రాని వారు తమకది ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూసేవారు. మర్యాదలకు, నమస్కారాలకు, సభలలో ఉన్నతాసనాలకూ అలవాటు పడిన బిరుదాంకితులు ఎప్పుడైనా పొరపాటున మర్యాదలు వారికి అందకపోతే ఆగ్రహులయ్యేవారు.

అది తెలిసి ప్రజలుకూడా 'గొప్పవాడు' ఫలానా వస్తున్నారనగానే దానికి తగిన రీతిలో మసలుకునేవారు. ఈ సమయంలో 'గొప్పవాడు' అంతస్తుకు ఇబ్బందిపెట్టి ఇరకాటంలో పడేసిన ఒక అనూహ్యమయిన సంఘటన జరిగింది.

ఒకప్పుడు మంత్రిగారి ఇంట్లో భీమయ్య అనే కుర్రాడు చాలాకాలం వంటవాడుగా పనిచేసేవాడు. అతను పెద్దవాడయి, పెళ్ళి చేసుకున్నాడు. వాళ్ళకొక కొడుకు పుట్టాడు. కొడుకును తీసుకుని భీమయ్య సతీ సమేతంగా వచ్చి, మంత్రిగారికి నమస్కరించి, తన బిడ్డను ఆశీర్వదించి, అతనికొక మంచి పేరు పెట్టమని కోరాడు. మంత్రి అప్పుడే ఏదో ఒక పేరు పెట్టుంటే పోయేది. అలాకాక, బిడ్డకు పేరుపెట్టడానికి తనకు గురువయిన చమత్కారానంద స్వామి దగ్గరకు పంపించాడు.

భీమయ్య చమత్కారానంద స్వామి పాదాల దగ్గర తాంబూల దక్షిణలను పెట్టి "స్వామీ మీరు నా బిడ్డకు ఒక మంచి పేరు పెట్టాలి. అంతేకాదు లోకం అంతా అతన్ని 'గొప్పవాడు' అనాలి. అలా ఆశీర్వదించండి" అని వేడుకున్నాడు.

చమత్కారానంద స్వామి ఒక్క క్షణం ధ్యానం చేసి, "భీమయ్యా" నీ కోరిక నెరవేరేలా చేస్తాను. నేనిప్పుడు నీ బిడ్డకు 'గొప్పవాడు' అని నామకరణం చేస్తున్నా"నన్నాడు.

మొదట భీమయ్య ఇదేం పేరనుకున్నా, క్రమేణా స్వామివారి దూర దృష్టి అతని కర్థమయ్యింది. నామకరణం అయిన తర్వాత భీమయ్య మంత్రిగారి ఇల్లు వదిలి వేరే ఎక్కడో ఉద్యోగం చేసుకుంటున్నాడు. పేరే అది గనక భీమయ్య కొడుకుని ఊరివారంతా గొప్పవాడనే అంటున్నారు. భీమయ్య కొడుకునెత్తుకొని బజార్లోకెళ్తే అతనిచూసి అందరూ 'అదుగో గొప్పవాడు' అనేవారు. భీమయ్య కొడుకు పుట్టినరోజు 'గొప్పవాడి' పుట్టిన రోజయింది.

గొప్పవాడు తన పదకొండవయేట దొంగతనంగా పక్కింట్లోని జామచెట్టెక్కి జాంపండు కోసుకొని గోడ దూకి వెళ్తుండగా, ఆ ఇంటి మునలావిడ చూసి అరిచింది. ఈ విషయం అందరికీ తెలిసి గొప్పవాడు జాంపండు దొంగిలించాడని చెప్పుకున్నారు.

గొప్పవాడికి పదిహేడేళ్ళొచ్చేసరికి సంతలో, దేవాలయంలో యాత్రీకుల వస్తువులను దొంగిలించటం మొదలెట్టాడు. అప్పట్నుంచీ, ఎక్కడన్నా జనం రద్దీగా ఉన్న ప్రదేశాలలో గొప్పవాడు కనిపించాడంటే, చాలు "అదుగో, గొప్పవాడు వస్తున్నాడు. నగలు గట్రా జాగ్రత్త" అంటూ ఆడవాళ్ళను హెచ్చరిస్తూండేవారు. అనుభవం వచ్చేకొద్దీ గొప్పవాడు దొంగతనాలతో పాటు, తన తెలివి తేటలతో అందరినీ మోసం చేయటంలో చక్కటి నేర్పరితనాన్ని సంపాదించాడు.

ఇప్పుడతనికి ఇరవై రెండు సంవత్సరాలు. ఈ మధ్య అతను ఒక పట్టు చీరల వ్యాపారికి అతని చీరలను నాలుగింతల ధరకు అరబ్బీ దేశాలలో

అమ్మి పెడ్తానని బొంకి, అయిదువేల వరహాలు తీసుకున్నాడు - అందుకుగాను గొప్పవాడికి ఆరునెలలు కారాగారశిక్ష విధించారు. ఈ మధ్యనే అతనిని విడుదల చేసారు.

రాజ్యంలోని ముగ్గురు ఉత్తములకు 'గొప్పవాడు' బిరుదు బహూకరించింది కూడా ఈమధ్యనే!

ఇప్పుడీ బిరుదాంకితుల కందరికీ భీమయ్య కొడుకు ఒక పెనుభూతమయి నిలిచాడు. 'గొప్పవాడు' అనగానే మర్యాదతో చూడవలసిన జనం, భీమయ్య కొడుకు చేసే పనులవల్ల వేరే దృక్పథంతో చూస్తున్నారు. రానురాను 'గొప్పవాడు' అంటే చాలు - అందరిలో నవ్వులు, హాస్యోక్తులు. దాని ఫలితం 'గొప్పవాడు' బిరుదున్న పెద్దలు కనిపించినపుడు, జనానికి దొంగ గొప్పవాడు గుర్తుకొచ్చి, ఆపుకోలేక నవ్వేవారు. దీంతో బిరుదుల వాళ్ళకి తమకొచ్చిన ఈ గౌరవం బాధాకరంగా తయారయి మింగాలేని కక్కాలేని యిరకాటంతో ఉక్కిరిబిక్కిరి అయ్యేవారు. చివరకు వీరంతా సమావేశమయి దీనికొక పరిష్కార మార్గాన్ని చూడాలని నిర్ణయించారు.

అందరూ కట్టకట్టుకొని సరాసరి భీమయ్య ఇంటికి వెళ్ళారు. ఇందరు మహానుభావులు తన ఇంటికి రావడం భీమయ్యకు చాలా సంతోషం కలిగింది.

"ఇంతమంది గొప్పవారు నా యింటికి రావడం నా అదృష్టం" అన్నాడు.

"అది మా దురదృష్టం" అన్నారు వచ్చినవారు. భీమయ్య అర్థంకాక చూసాడు.




"భీమయ్యా, ఇప్పుడు నీ కొడుకు పేరు మార్చుకోవాలి" అన్నారు గొప్పవారు.

"అదెలా సాధ్యం? అది చమత్కారానంద స్వామి పెట్టిన పేరు" అన్నాడు భీమయ్య.

"చూడు భీమయ్యా! నీ కొడుకు అందర్నీ మోసాలు చేస్తూ, దొంగతనాలు చేస్తూంటే నీకు సిగ్గుగా లేదూ?" అన్నారు గొప్పవారు.

"సిగ్గెందుకండి? నా కొడుకేంచేసినా అందరూవాణ్ణి 'గొప్పవాడు' అంటూంటే నాకు చాలా ఆనందంగా ఉంది" అన్నాడు భీమయ్య.

సరిగ్గా ఈ సమయానికి ఎక్కడో బయట తిరుగుతూన్న గొప్పవాడు ఇంటికొచ్చాడు. అతన్ని చూడగానే గొప్పవారంతా ముఖాల్లో చిరునవ్వులు తెచ్చుకుని, అతనిచుట్టూ చేరి,

"చూడు నాయనా! మేము ఎంతో కష్టపడి మహారాజు గారి దగ్గర ఈ 'గొప్పవాడు' బిరుదును పొందాం. నువ్వు చేసే పనులవల్ల జనం 'మమ్మల్ని' చులకనగా చూస్తున్నారు. ఎందుకో తెలుసా? నీ పేరు 'గొప్పవాడు' గనక. అందుకని నీవు పేరు మార్చుకోవాలి" అన్నారు.

"నేనెందుకు పేరు మార్చుకోవాలి? మీరు నిన్నకాక మొన్న అయిన గొప్పవారు. నేను పుట్టినప్పట్నుంచే గొప్పవాడను" అన్నాడు గొప్పవాడు.

గొప్పవాడి తర్కానికి ఎదురు చెప్పలేని గొప్పవాళ్లు మళ్ళీ మంతనాలు మొదలెట్టారు. చివరకు భీమయ్య ఒకప్పుడు మంత్రిగారి వంటవాడనీ, అతన్ని చమత్కారానందస్వామి దగ్గరకు పంపించింది కూడా మంత్రేనని తెలిసి, అందరూ సరాసరి మంత్రి దగ్గరకు వెళ్ళారు.

వాళ్ళ గోడు విన్న మంత్రి ఈ పరిస్థితి రావడానికి తన బాధ్యత కూడా ఉన్నదని తెలుసుకొని ఏం చెయ్యాలా అని ఆలోచించాడు. చివరకు ఒక నిర్ణయానికి వచ్చాడు. ఇది రాజుగారిచ్చిన బిరుదులు పొందిన గొప్పవారి సమస్య. అందుకని రాజుగారితోనే మనవి చేసుకుంటే ఆయనే ఏదో పరిష్కార మార్గం చూస్తాడు.

కరాజు మంత్రి చెప్పిన గొప్పవారి బాధలను ఓపిగ్గా విన్నాడు. "మంత్రీ! దీనికొక్కటే మార్గం" అన్నాడు.

ఆతురతతో మంత్రి ఒక అడుగు ముందుకేసాడు.

"'గొప్పవాడు' నామధేయుడైన ఇతనిని వెంటనే 'గొప్పవారి గోత్ర పరిశోధనాధికారిగా' నియమించండి" అన్నాడు క రాజు.

"అదేమిటి మహారాజా? " అన్నాడు మంత్రి.

"అవును మంత్రీ! ఇక నుంచి మనం 'గొప్పవాడు' బిరుదుకి ఎవరిని ఎంపిక చెయ్యాలీ అనే విషయంలో తర్జనభర్జన పడనవసరంలేదు. అన్నీ ఈ 'గొప్పవాడే' చూసుకుంటాడు. ఎందుకంటే గొప్పవారి గోత్రాలు ఇతని కన్నా ఇంకెవరికీ తెలిసే అవకాశం లేదు. అంచేత నేటి నుంచి ఈ గొప్పవాడు......"

"......గొప్పవారి గోత్ర పరిశోధనాధికారి" అని పూర్తిచేసాడు మంత్రి.

కరాజు ముఖంలో ఒక చిరునవ్వు తొణికిసలాడింది.

"క రాజు నిజంగా గొప్పవాడు" అని మనస్సులో అనుకున్నాడు మంత్రి. ◆

ఫిబ్రవరి 3 సంగీత దర్శకుడు చక్రవర్తి వర్ధంతి సందర్భంగా...



# చక్రవర్తి తత్త్వం, వ్యక్తిత్వం



మానవుడంటే ఎవరు?
మమతల చెఱలో వేదన ఉరిలో
సతమతమయ్యే ఒక జీవి
ప్రేమికుడంటే ఎవరు?
తియ్యటి కలతో ఎగిరే అలలా
చాలని వయసున తీరని తమితో
కాల ప్రవాహంలో తీరం తెలియక
పయనించే ఒక నావికుడు -
బాధితుడంటే ఎవరు?
నీరైపోయే రక్తం విలువ
నిరంతరంగా అంకితమిచ్చే
నిరంకుశత్వపు బానిస
నిత్యం చచ్చే కార్మికుడు
స్వర్గం అంటే ఏది?
ప్రతిమనిషీ ఒక దైవం
ప్రతి హృదయం ఒక ఆలయం
ఆర్తులు లేని ధూర్తులు లేని
పండే నేల నిండే కడుపు వెలసిన స్థానం అదీ
దేవుడు అంటే ఎవరు? (ఎవడు)
నింగిని భూమిని దూరం చేసి
సమస్త జీవుల మోసం చేసి
ఎండమావుల సాగరాలలో
భక్తుల దొలగుచు
పరవశమొందే ఒక మాంత్రికుడు
అప్పటి అప్పారావు ఇప్పటి చక్రవర్తి రాసి యిచ్చినది
నిజమైన నిర్భయ నిత్యసత్య నిర్వచనాలు

ఒక గొప్పవ్యక్తిని స్మరించుకోడానికి పత్రికల వారికి ఎన్నో మార్గాలుంటాయి. ఆయనగురించి ఓ వ్యాసం రాయొచ్చు... లేదా మరొక ప్రముఖ వ్యక్తితో రాయించొచ్చు... పాత ఇంటర్వ్యూలలోని కొన్ని భాగాలను కొంత జనరేషన్ గ్యాప్ తర్వాత పునర్ముద్రించవచ్చు... లేక వారి అరుదైన ఫొటోలను అందించవచ్చు... ఇలా రకరకాల పద్ధతులుంటాయి. పైన ప్రచురించిన మనోభావాలు సంగీతదర్శకుడు చక్రవర్తి స్వయంగా రాసుకున్నవి...అది కూడా ఏ డైరీలోనో లేక నీట్‌గా ఏ వైట్ పేపర్ మీదనో రాసుకున్నవి కావు. మనసులో అలవోకగా దొర్లిన స్పందనలను పక్కనే ఓ ఫారిన్ ఎయిర్ మెయిల్ కవర్ దొరికితే ఆ కవరు వెనకభాగాన అప్పటికప్పుడు రాసుకున్నవి. వీటిని చదివిన గాయకుడు శ్రీ ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం 'ఇది నా దగ్గరుంచేసుకుంటాను' అని తీసుకున్నారు. చక్రవర్తి జ్ఞాపకార్థం తన వద్దనే ఇన్నాళ్ళూ భద్రంగా దాచుకున్నారు కూడా! 'హాసం'లో వేస్తే బావుంటుందని, మాటీవీ 'పాడాలనివుంది' కార్యక్రమం ఆగష్టు 2003లో జరిగినప్పుడు తీసుకువచ్చి స్వయంగా అందించిన శ్రీ బాలుగారికి కృతజ్ఞతలు తెలుపుకుంటూ సినీ సంగీత ప్రియులందరి తరపున చక్రవర్తిగారికి నివాళులర్పిస్తోంది - హాసం




# మిస్టర్ పెళ్ళాం



దర్శకత్వం బాపు

కథ-స్క్రీన్‌ప్లే-సంభాషణలు
ముళ్ళపూడి వెంకటరమణ

వెండితెర నవల

13

నవలీకరణ
ఇలపావులూరి మురళీమోహనరావు

**జరిగిన కథ**

బాలాజీ, ఝాన్సీ భార్యాభర్తలు. బాలాజీకి ఆడవారంటే చులకన భావం. బ్యాంకులో క్యాషియర్‌గా ప్రమోషన్ పొందిన రోజే మేనేజర్ చేసిన మోసం వల్ల క్యాష్‌లో లక్ష రూపాయలు తేడా వస్తుంది. సస్పెండ్ అవుతాడు. ఈ విషయం బయటకు పొక్కి, వేరే ఏ ఉద్యోగమూ దొరకదు. ఝాన్సీ తన కాలేజీమేట్, గోపాల్ కంపెనీలో రికమెండ్ చేస్తానంటుంది. తన కథ తెలిసాక వాళ్లూ పొమ్మంటారంటాడు బాలాజీ. అయితే తనే ఉద్యోగానికి వెళతానంటుంది ఝాన్సీ. అలా అయితే తను ఇంటిపని చూసుకుంటానంటాడు బాలాజీ. నష్టాల్లో నడుస్తున్న గోపాల్ కంపెనీ లాభాల బాటలో ప్రయాణించే సూచనలివ్వటంతో ఝాన్సీని తమ కంపెనీలో కీలకమైన స్థానానికి ఎంపికచేసుకుంటారు. ఝాన్సీ ఉద్యోగంలో చేరుతుంది. గోపాలకృష్ణ ఆహ్వానం మేరకు కృష్ణాష్టమి వేడుకలకు వెళ్లిన బాలాజీ అక్కడ జరిగిన కొన్ని సంఘటనల పట్ల కినుక వహిస్తాడు. బోనస్ డబ్బులతో ఆనందంగా ఇంటికి వచ్చిన ఝాన్సీ ఆ డబ్బుని బ్యాంక్‌కు కట్టి తిరిగి ఉద్యోగం సంపాదించుకోమంటుంది. ఆ సలహా విన్న బాలాజీ కి ఆవేశం కట్టలు తెంచుకుంటుంది. -(ఇక చదవండి)

డ్రైవర్ వెళ్ళిపోయాడు. పిల్లలు కారులో దాక్కున్న విషయం అతనికి తెలియదు.

" అబద్ధం ,అన్యాయం డబ్బు గడించి మీకిచ్చి మీ ఉద్యోగం మీకిప్పించాలనే తప్ప వేరే ఆలోచనలేదండీ. తప్పయితే క్షమించండి." తనను భర్త అపార్థం చేసుకున్నాడన్న ఆవేదన కుంగదీస్తుండగా నిస్సహాయంగా రోదించింది ఝాన్సీ.

ఆ ఏడుపుకు బాలాజీ చలించలేదు. మనసు కరగలేదు.



"క్షమించను. నేను దొంగ అని తెలిపోతే నాకీ జన్మలో పని దొరకదు. అపుడు నువ్వు పర్మనెంటుగా ఆ గోపాల్ గాడి ఆఫీసులో ఉద్యోగం చేయవచ్చు. నేను పర్మనెంటుగా వంటింటి బానిసనై కుక్కలా పడుంటాను. అదేగా నీక్కావలసింది!" భార్య తత్త్వం తెలిసి అంటున్నాడో, తెలియక అంటున్నాడో తెలియటంలేదు బాలాజీకి.

" కాదు...కాదు...కాదు..." గొంతు చించుకుంది ఝాన్సీ.

"నోర్మూయ్..." అని అరిచాడు బాలాజీ అంతకన్నా తీవ్రంగా. ఇరుగు పొరుగు అంతా చేరి చూస్తున్నారని గమనించి తమాయించుకుని వీధి తలుపు వేసేశాడు.

"నేను దొంగనైతే ఈపాటికే డిస్మిస్ చేసి జైల్లో పారేయించేవాళ్ళు. నీకీపాటి బుద్ధికూడా లేకుండా పోయింది." అంటూ కోపంగా బయటకు వెళ్ళిపోయాడు.

తాను చేసిన మంచి ప్రయత్నం వృథా అయిపోయిందనే వేదనతో కుప్పకూలిపోయింది ఝాన్సీ.

మంచితనాన్ని అర్థంచేసుకునేవారు లేకపోతే మనిషికి మిగిలేది నరకమే. త్యాగాన్ని గుర్తించలేక నిష్కారణంగా నిందలువేసే కుటుంబసభ్యులు, బంధువులు యమభటులకన్నా దుర్మార్గులు. అటువంటివారు తోడబుట్టినవారైనా, కన్నవారైనా వారిని భగవంతుడు క్షమించడు. అటువంటి వారిని వదిలెయ్యడం ఎంతో ఉత్తమం. కానీ...మూడు ముళ్ల బంధం అలాంటిది కాదు కదా!

* * *



బాలాజీ రోడ్డు వెంట నడుస్తున్నాడు. పెళ్ళాంతో పోట్లాడినా....చివరకు భార్యను ఇంట్లో వదిలేసి తాను బయటకు పోతాడెందుకో? ఆడది బయటకు వెళితే ఇక మళ్లీ రాదని భయం. తాను స్వేచ్ఛా జీవినని విర్రవీగుతుంటాడు కాబట్టి తనిష్టమైనప్పుడు ఇంట్లోంచి వెళ్లినా అడ్డుపెట్టేవారుండరని అహం! ఇల్లు విడిచిన నెలరోజుల తరువాతైనా నిస్సంకోచంగా ఇంట్లోకి వెళ్లగలడు. అదే ఆడది గడప దాటివెళ్లి ఒక్క రాత్రి ఇంటికి రాకపోతే..!? మగాళ్ల సంగతి తరువాత... సాటి స్త్రీలే ఎన్నో నిందలు వేస్తారు! అందుకే కాబోలు... పెళ్లాంతో పోట్లాడిన తరువాత మగాడు కోపంగా బయటికి వెళ్లి బీడియో, సిగిరెట్టో తాగి, మహాఅయితే మందు కొట్టి మళ్లా ఇంటికొస్తాడు. భర్త ఇంట్లోలేని సమయంలో భార్య పొందే మానసిక వ్యథ వర్ణించడం ఎవరితరం?

పిచ్చిపిచ్చిగా తిరుగుతున్నాడు బాలాజీ.

"దొంగనైతే ఈ పాటికి డిస్మిస్ చేసి జైల్లో పెట్టేవారు...దొంగనైతే ఈ పాటికి డిస్మిస్ చేసి జైల్లో పెట్టేవారు..." ఆవేశంలో తాను మాట్లాడిన మాటలు చెవుల్లో రింగుమంటున్నాయి.

అంతే!ఏదో మెరుపు లాంటి ఆలోచన వచ్చింది. పక్కనున్న పబ్లిక్ టెలిఫోన్ బూత్ లో కెళ్ళాడు. నెంబర్ డయల్ చేశాడు. బ్యాంకులో కులాసాగా కూర్చుని కారాకిళ్ళీ నములుతున్న మేనేజర్ టేబుల్‌మీది ఫోన్ మోగింది. నిర్లక్ష్యంగా ఫోన్ అందుకుని 'యస్' అన్నాడు మేనేజర్.

"గుడీవినింగ్" అన్నాడు బాలాజీ వెకిలిగా.

"ఎవరు?" అన్నాడు మేనేజర్

"నేనేరా...తీకాగాడిని..."

"అంటే..?"

"నేనేరా తీకాగాణ్ణి...అందరి ముందూ నువ్వు తీసేసి పంపిన క్యాషియర్ బాలాజీని."

మేనేజర్ గుండె అదిరింది. ఇన్నాళ్ళ తరువాత బాలాజీ నుంచి ఫోన్ రావడం, స్వరంలో ఏదో కొత్త ధీమా కనిపించడం మేనేజర్ని కొంచెం భయపెట్టాయి.



"ఆహా... నేను పంపించడమేంటి? నువ్వే వెళ్ళిపోయావ్" అన్నాడు తడబడుతూ.

"యస్...నేను కొట్టేసిన లక్షా పట్టుకొస్తే నా జాబ్ నాకిస్తానన్నావ్‌గా.. క్యాష్ రెడీ." అన్నాడు బాలాజీ.

మేనేజరులో ఖంగారు అధికమైంది.

"అ....అలాగా...ముందిక్కడకురా, మాట్లాడుకుందాం. అయినా డబ్బెలా కుదిరింది?" తడబడుతూ అన్నాడు మేనేజర్.

"డబ్బు కుదరడమేంట్రా నీ బొంద.. జబ్బు కుదిరినట్టు? నీలాగే కష్టపడి మోసం చేసి పేకాటలో గెలిచాను. పేకాట దయవల్ల మన బ్యాంకు ఛైర్మన్ గారు మనకు బడా దోస్తయిపోయాడ్లే." అన్నాడు.



చెమటలు పట్టాయి మేనేజర్‌కు. సీట్లోంచి లేచాడు. "ఛైర్మన్‌గారా? అసలు నువ్వు ముందా డబ్బు తీసుకుని బ్యాంకుకురా చెబుతాను." అని అన్నాడు.

నవ్వాడు బాలాజీ "ఏంట్రా నువ్వు చెప్పేది? ఛైర్మన్‌గారిక్కడే ఉన్నారు. నిజం చెప్పేసి ఫోన్ వారి చేతికిస్తాను. వారే నీతో ఫోన్లో మాట్లాడుతారు నా జాబ్ గురించి." అన్నాడు.

మేనేజర్ మరింత గాభరా పడ్డాడు. మేనేజర్ భయాన్ని గమనించి బాలాజీ మరికొంచెం ముందుకెళ్ళాడు. "అన్నట్టు నా జాబ్ గురించి కొండయ్యనీ, వాడి తోడుదొంగనీ కోప్పడకేం? అరిచి చచ్చినా వాళ్ళు నీకు నిజం చెప్పరు. ఎవరికి వారే...వాళ్ళూ నీలాగే నాలాగే...పిల్లల వాళ్ళు." ఫోన్ పెట్టేశాడు.

"హలో...హలో...హలో..." అంటూ అరిచాడు మేనేజరు.

* * *

గోపాలకృష్ణ తోటలో కారు ఆగింది. డ్రైవర్ డోర్ లాక్ చేసి వెళ్ళిపోయాడు. వెనక డోర్ తెరుచుకుని పిల్లలు దిగారు. అటు ఇటు చూస్తూ ఒక మూలలకు పరిగెత్తారు.

"అక్కా ఏంటిది" అడిగాడు పిల్లాడు

"నాన్న గారు పారిపోయారు కదా. మనం కూడా పారిపోదాం" అన్నది పిల్ల.



"మరి అమ్మ?" అడిగాడు పిల్లాడు.

"అమ్మ గట్టిగా అరిచింది కదా. అమ్మ కూడా పారిపోతుంది. మనం కూడా పారిపోదాం" చెప్పింది పిల్ల.

ఇద్దరూ కలిసి పరిగెత్త సాగారు.

* * *

ఝాన్సీ,గోపాల్ సీరియస్‌గా ఏదో ఆలోచనలో ఉన్నారు. జటిలమైన ఒక సమస్యకు పరిష్కార మార్గాన్ని కనుగొనేందుకు మస్తిష్కాలకు పదును పెడుతున్నారు.

అంతకు ముందు ఏమన్నాడో - "నువ్వు అలా అంటే ఎలా గోపాల్?" అన్నది ఝాన్సీ.



"ఆయన మంచికోరే నువ్వు డబ్బుతెచ్చినా, తెలియకుండా ఆయన్ని దొంగే అన్నట్టే కదా! ఆయన్ని తొందరపడి అనుమానించావు. తప్పు నీదే ఝాన్సీ." మృదువుగా మందలించాడు గోపాల్.

"ఇప్పుడేం చెయ్యను?" అంది ఝాన్సీ విచారంగా

"నీకు నేనా సలహా చెప్పేది!? ఒక్కటే నా పాయింటు. నిజంగా నీ భర్త ఆ లక్షా కాజేసుంటే ఈ పాటికే బ్యాంకు వాళ్ళు డిస్మిస్ చేసి జెయిల్లో పెట్టేవాళ్ళ కదా?"

"కరెక్టు. అంటే ఈ నేరం విషయం హెడ్డాఫీసు దాకా పోలేదన్నమాట. అంటే బ్యాంకు ఛైర్మన్‌గారికి..." సాలోచనగా అన్నది ఝాన్సీ.

"కరెక్టు... లెంపకాయలు కొట్టడంలో ఎక్స్‌పర్ట్ నువ్వు. ఆ ఛైర్మన్ గారికి గూబ అదిరేలా తగిలించు" ఉత్సాహపరిచాడు గోపాల్.



ఛైర్మన్ ఫోన్ నెంబర్ డయల్ చేసింది ఝాన్సీ. ఛైర్మన్ ఫోన్ అందుకున్నాడు.

"నమస్కారం నా పేరు ఝాన్సీ లక్ష్మి. అన్నపూర్ణ ఫుడ్ కార్పొరేషన్ కు వైస్ ప్రెసిడెంటును" చెప్పింది.

"వాటొకెన్ ఐ డూ ఫర్ యూ" అన్నాడు ఛైర్మన్

"నాకేం చెయ్యఖ్ఖర్లేదండీ... ముందు మీ బ్యాంకును కాపాడుకోండి" సీరియస్‌గా చెప్పింది ఝాన్సీ.

---

**ఘంటసాల క్విజ్ - 16 విజేతలు**

మొదటి బహుమతి
శ్రీ ఎస్.సూర్యనారాయణ,
హైదరాబాద్.

రెండవ బహుమతి
శ్రీ మద్దుల అప్పారావు, అనకాపల్లి

మూడవ బహుమతి
శ్రీ యు.విజయశేఖరరెడ్డి,
కూకట్‌పల్లి

**కరెక్టు సమాధానాలు**

1. తలత్ మెహమూద్
2. ఆహుతి
3. సంసారం
4. లక్ష్మమ్మ
5. పరోపకారం

**బహుమతులు**

మొదటి బహుమతి: ఎ) 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటలు) డబుల్ డిస్క్/ స్వరసుధ ఘంటసాల 31 గాయనీ మణులతో పాడిన సినీ గీతాల డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి. వారిది.

బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి. వారిది.

రెండవ బహుమతి: 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటలు) డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.

మూడవ బహుమతి: ఎ) ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి యుగళ గీతాల 'లవ్ మీ నెరజాణ' హెచ్.ఎం.వి. వారి సింగిల్ సి.డి.

బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి.వారిది.

చైర్మన్‌కేమీ అర్థం కాలేదు. "అదేంవిటి?"అన్నాడు.

"మీ బ్యాంకులో మా కంపెనీ డిపాజిట్లు రెండు కోట్లదాకా వున్నాయి. రేపు ఉదయం మా ఖాతాలన్నీ క్లోజ్ చేసి వేరే బ్యాంకుకిస్తున్నాం"

"అసలు కారణమేంటమ్మా?"

"మీ బ్రాంచ్ ఒక దాంట్లో పదినెలల క్రితం ఒక కాషియర్ లక్ష రూపాయలు కాజేశాడు. అతనిని సస్పెండ్ చేశామన్నారు. ఇంతవరకూ యాక్షన్ తీసుకోలేదు. వాడు ఆ లక్షా ఖర్చుపెట్టి జల్సా చేస్తూ బజార్లో తిరుగుతున్నాడు."



''నో...నో... అలాంటి కేసేమీ నా దాకా రాలేదే!?"

''అదే మా ఖర్మ. లక్షరూపాయల చోరీ మీ దాకా రాలేదంటే మీ సామర్థ్యం, అది రాకుండా దాచిన మీ మేనేజర్ల సామర్థ్యం తెలుస్తోంది. మా కంపెనీ డబ్బు గురించి మాకు భయం పట్టుకుంది. అందుకే మా ఖాతాలు ఎత్తేస్తున్నాం"

చైర్మన్లో కొంచెం కంగారు కనిపించింది. అయినా దానిని దాచుకోడానికి ప్రయత్నిస్తూ "నోనో... దట్స్ నాట్ కరెక్ట్. అయినా అకౌంట్స్ క్లోజ్ చెయ్యడం పెద్ద సంగతి. అది మీ చైర్మనో, ఎం.డి.నో చెయ్యాలి తప్ప..." అంటుండగా రిసీవర్‌ను గోపాల్ కందించింది ఝాన్సీ.

"నేనే యమ్.డి.ని... గోపాలకృష్ణ... ఈ కథ మా చైర్మన్ గారికి కూడా తెలుసు" నవ్వుతూ అన్నాడు గోపాల్.



గోపాల్ గొంతు వినగానే కొంచెం తగ్గాడు చైర్మన్.

''నమస్కారం మిస్టర్ గోపాల్.. మీరు ఒకసారి మా ఆఫీస్‌కొస్తే వియ్ విల్ సార్టిట్ అవుట్" అన్నాడు.

గోపాల్ నుంచి రిసీవర్‌ను లాక్కుంది ఝాన్సీ.

"అవసరం మీది. మాది కాదు" కటువుగా చెప్పింది

"తమరా ఝాన్సీగారూ... రేపుదయం మా ఆఫీసుకొస్తే..." ఏదో చెప్పబోయాడు చైర్మన్.

''లేదు... ఈ రాత్రి...ఇక్కడే.. మా ఇంట్లోనే తేలాలి. దారి తెలియకపోతే కారు పంపిస్తాను రండి'' కరాఖండీగా చెప్పిన ఝాన్సీని సముదాయించడం అసంభవమని నిర్ణయించు కున్నాడు చైర్మన్.



''సరే... ఈ గొడవ జరిగింది ఏ బ్రాంచిలోనమ్మా?" అడిగాడు

"రాజానగర్ బ్రాంచ్..." చెప్పి ఫోన్ పెట్టేసింది.

"దటీజ్ మై సివంగీ..." అంటూ మెచ్చుకోలుగా నవ్వాడు గోపాల్.

"చైర్మన్ గారికి కారు పంపించు గోపాల్" రిక్వెస్ట్ చేసింది ఝాన్సీ.

చాలాసేపట్నుంచీ పిల్లలు కనిపించడం లేదన్న సంగతి అపుడు గుర్తుకొచ్చిందామెకు "వీళ్ళేరీ? లీలా... ఎక్కడున్నార్రా...!?" అంటూ పిల్లలను పిలిచింది.

ఇద్దరూ కలిసి వెతుకుతుండగా నర్సయ్యా వచ్చాడు. "పిల్లలా? ఇందాక వాళ్ళిద్దరూ కారెక్కారు. కారు వెళ్ళింది. చెప్పడం మరిచాను" అన్నాడు.

గోపాల్, ఝాన్సీ కంగారుగా కారెక్కారు.

* * *

బ్యాంకులో -

స్టాఫంతా నిలబడి భయం భయంగా చూస్తున్నారు. కొండయ్య కాలర్ పట్టుకుని కోపంగా అరుస్తున్నాడు మేనేజర్. శరీరమంతా చెమటలు పోస్తున్నాయి.

"చెప్పు...నిజం చెప్పు. బాలాజీగాడికేం చెప్పావు? వాడు చైర్మన్‌గారికంతా చెప్పానన్నాడు'' ఆవేశంగా అరిచాడు.



''అదేంటి సార్... నేనెందుకు చెబుతాను?చెప్తే నేను మాత్రం దెబ్బతిననూ?" దీనంగా అన్నాడు కొండయ్య.

ఇంతలో ఫోన్ మోగింది. "నీదేముందిరా దరిద్రుడా. నీళ్ళమీద వేలు ముద్ర. కేసు గురించి పైకి రాయనందుకు నన్ను పీకేస్తారు" అని కొండయ్య కాలర్ వదలకుండా ఫోన్ వద్దకు లాక్కెళ్ళి ఫోనెత్తి గట్టిగా, చిరాగ్గా 'యస్' అన్నాడు.

అవతల చైర్మన్ గొంతు వినిపించింది. హడలిపోయి కొండయ్యను వదిలేసి రెండుచేతుల్తో ఫోన్ మూసి "అయ్యబాబోయ్ చైర్మన్ గారు..." అని 'యస్సార్... వన్ మినిట్ సార్..' మళ్ళీ ఫోన్ మూసి "కొండాయ్.. ఇవాళ నీ పచ్చి నెత్తురు కళ్ళజూస్తా..." అంటుండగా కొండయ్య జారుకోడానికి ప్రయత్నించాడు. "అరేయ్ రాస్కెల్... ఆగరా" పెద్దగా అరిచాడు మేనేజర్.



ఆ కంగారులో రిసీవర్ మీద చెయ్యి తియ్యడంతో మేనేజర్ తిట్టిన తిట్టు చైర్మన్ చెవిన చేరింది.

ఆ విషయం గ్రహించి వణికిపోయాడు మేనేజర్. ''మీరు కాదు సార్... య...స్సా...ర్...'' అంటూ నీరసంగా కూలబడిపోయాడు.

* * *

గోపాల్ తోటలో కారు ఆగగానే పిల్లలు దిగి మూలగా ఉన్న ఒక పెద్ద బండ కింద చేరారు. అక్కడో భయంకరమైన తాచుపాము కస్సునలేచి బుసకొట్టి పడగెత్తి నిలిచింది. పిల్లలు గజగజలాడుతూ శిలా ప్రతిమల్లా బిగుసుకుపోయారు.

పిల్లలను వెతుకుతూ గోపాల్, ఝాన్సీలు తోటంతా తిరుగుతున్నారు. పిల్లలు కూర్చున్న దృశ్యం చూడగానే నిశ్చేష్టులయ్యారు. దూరం నుంచి గోపాలకృష్ణ తండ్రి, మరో నలుగురు వ్యక్తులు కర్రలు చేత పుచ్చుకుని నిలబడిపోయారు. ఏం చెయ్యాలో తోచడంలేదు ఎవరికి.

మరోవంక బాలాజీ కూడా పిల్లలను వెతుక్కుంటూ వచ్చాడు. ఏడుస్తున్న ఝాన్సీ, పడగెత్తి బుసలు కొడుతున్న సర్పరాజం, వణికి పోతున్న పిల్లలు కనిపించారు.



ఎక్కడలేని ధైర్యం తెచ్చుకుని మెల్లగా బాబు వెనక వరకూ వచ్చింది ఝాన్సీ తన ప్రాణమైనా అడ్డంపెట్టి కన్న పేగును కాపాడుకోవాలనే తల్లి ఆరాటం అది!

పాము పడగ విసిరింది. కెవ్వున కేక పెట్టబోయిన బాబు నోటికి చెయ్యి అడ్డం పెట్టింది లీల. బాలాజీ మెల్లగా పాము వెనక్కు వచ్చాడు. చైర్మన్ గారి వెంట వచ్చిన వ్యక్తులు పాము దగ్గరకు రావడానికి ప్రయత్నిస్తుండగా ఆగమని సైగచేశాడు గోపాల్.

పాము మరోసారి భయంకరంగా బుస కొట్టి పడగ విసిరింది. 'అమ్మా' అని కేక పెట్టారు పిల్లలు. ఇక ఆగలేకపోయింది ఝాన్సీ. పిల్లలిద్దరినీ

వాటేసుకుని పక్కకు లాగింది. అదే సమయంలో బాలాజీ ముందుకు దూకి పామును ఒడుపుగా పట్టుకుని దూరంగా విసిరేశాడు.



గండం గడిచింది. అందరూ ఊపిరి పీల్చుకున్నారు. ఆ ఉద్వేగంలో, ఆవేశంలో చెప్పకుండా బయటకు వెళ్ళినందుకు పిల్లలను చావగొట్టింది ఝాన్సీ. వెంటనే 'డాడీ' అంటూ తండ్రిని కౌగలించుకున్నారు పిల్లలు.

అపుడే బ్యాంకు ఛైర్మన్ కూడా వచ్చారు. అతని వెనుకే బ్యాంక్ మేనేజరు, కొండయ్య దోషులుగా తేలి తలలు వంచుకుని నిలబడ్డారు.



ఝాన్సీవద్ద కెళ్ళాడు బ్యాంకు ఛైర్మన్. "అమ్మా ఝాన్సీ మీ భర్తను కాపాడుకున్నారు. మీ బిడ్డలను కాపాడుకున్నారు. దొంగలను పట్టుకుని మా బ్యాంకును కాపాడారు. హేట్సాఫ్ టూ యూ. ఆడవారైనా యూ ఆర్ రియల్లీ గ్రేట్ మేడమ్" అని అభినందించాడు.

ఈ సమయంలో కూడా తన భార్య తను పనిచేసే బ్యాంకు ఛైర్మన్ అభినందనలు పొందటం బాలాజీకి రోషాన్ని తెప్పించింది.

"వాడ్డూయూ మీన్... మేనేజర్ గాడిదను అదరగొట్టి నిజం కక్కించింది నేను." అన్నాడు.

గోపాల్ నవ్వి "వాడ్డూయూ మీన్..? బ్యాంకు ఛైర్మన్‌ను అదరగొట్టి దొంగతనం బయటపెట్టించిన హీరోయిన్ మా శివంగి" అన్నాడు.

"కాదు. నేను" పెద్దగా అన్నాడు బాలాజీ

"అవునండీ, నేను" కొంటెగా అన్నది ఝాన్సీ.

తానేం తక్కువ తినలేదన్నట్లుగా 'కాదు...నేను' అరిచాడు బాబు.

ముచ్చటైన ఆ మాటకు మురిసి మూడు ముక్కలై "అవున్రా బాబూ నువ్వేరా... అంటే మనం" తనను తనే అభినందించుకున్నాడు బాలాజీ



"మనం అంటే మనమిద్దరం" శ్రుతికలిపింది ఝాన్సీ.

"అవును నరదాగా అన్నాను కానీ పైచేయి నీదే శివంగీ" అన్నాడు బాలాజీ తన చెయ్యిని కింద పెట్టి. ఝాన్సీ చెయ్యి పైన వేసింది. చేతుల్ని అటు ఇటు తిప్పుతున్నాడు బాలాజీ... చివరకు ఎవరి చెయ్యి పైన ఉంటుందో? అంతా విష్ణుమాయ! కాదు... మగాడి మాయాజాలం!

* * *

వైకుంఠంలో -

యథాప్రకారం శేషతల్పం మీద కూర్చున్నాడు నారాయణుడు. ఎదురుగా లక్ష్మీదేవి. ఇద్దరూ చేతుల్లో చేతులు వేసుకుని పైకీ కిందికీ ఊపుతూ, తిప్పుతూ ఆడుకుంటున్నారు. ఇద్దరి మనసులలోనూ తమదే పైచేయి కావాలనే? కానీ విష్ణుమాయ ముందు లక్ష్మి ప్రభావం పని చెయ్యలేదు. నారాయణుడిదే పైచేయి అయింది.

ఇరువురి అన్యోన్యత చూసి నారదుడి కడుపు నకనక లాడింది. ఎలాగైనా కలహం పెట్టి కడుపు నింపుకోవాలని తలచాడు. "స్వామీ... మీ చెయ్యి పైన పెట్టి చమత్కారం చేశారు కానీ... నిజాయితీతో ఒక్కసారి ఒక్కసారి ఆ పాదాలు.." గొణిగాడు.

నారాయణుడి చేత ఒక్కసారైనా లక్ష్మి పాదాలు పట్టించాలని నారదుడి పంతం.

చతుర్భుజుడు అంత చేతకాని వాడుకాదుగా? నారదుడి అభిమతం గ్రహించాడు. "ఓహో! అటులనే నారదా" అన్నాడు చిద్విలాసంగా నవ్వి.

లక్ష్మీదేవి బోలెడు ఆశ్చర్య పోయింది. యుగ యుగాలు గా తనతో పాదసేవ చేయించుకుంటున్న పతి దేవుడు నేడు తన పాదాలు పట్టుకోబో తున్నాడు. ఆహా! ఎంతటి సుదినం! ఆనందంలో వళ్ళు తెలియలేదు లక్ష్మీదేవికి. నిస్సంకోచంగా కాళ్ళను ముందుకు జాపింది.



మగాళ్ళ మాయ మాటలను నమ్మితే ఏమౌతుందో చూద్దాం.

భూలోకంలో ఇలాగే మొగుళ్ళ మాటలకు మోసపోయిన పదిమంది పడతులు భర్తలు తమకు లొంగబోతున్నారని భావించి వారు తమ పాదాలు పట్టుకోవడానికి వీలుగా చీరెలను కొంచెం పైకెత్తారు.

పతులంతా సతుల ముందు వంగారు.



"ఆడవాళ్ళకు జై!

స్త్రీ శక్తికి జై!" అంటూ నినాదాలు చేశారు. భార్యామణులంతా గర్వంగా నవ్వారు. భర్తలు మూకుమ్మడిగా సతుల పాదాలు పట్టుకున్నారు. స్త్రీలు మీనం(?) మెలేద్దామనుకున్నంతలోనే ఊహించని ఘోరం జరిగింది. భర్తలంతా భార్యల పాదాలను ముందుకు లాగడం, భార్యలంతా వెనక్కు పడడం జరిగిపోయింది. ఆ దృశ్యం కళ్ళకు కట్టినట్లు కనిపించడంతో ఉలిక్కిపడిన శ్రీ మహాలక్ష్మి తనకూ ఆ గతి పట్టకుండా ముందుగానే తన పాదాలను వెనక్కు తీసుకుని పతి పాద సేవలో మునిగిపోయింది. అర్ధనిమీలిత నేత్రుడయ్యాడు శ్రీహరి.

విష్ణుమాయను ఛేదించడం తనవల్ల కాదనుకుని నమస్కారం పెట్టి వెళ్ళిపోయాడు నారదుడు.

* * *

బాలాజీ ఇంట్లో - మళ్ళీ యథాస్థితి. బాలాజీ పడక కుర్చీలో చేరగిలి పడి విసనకర్రతో విసురుకుంటున్నాడు.

కొంచెం దూరంలో కూర్చుని తిరగలిలో పిండి విసురుతున్నది ఝాన్సీ.

నర్సయ్య వచ్చాడు.

"అదీ కరెక్టు. భార్యా భర్తలిద్దరు ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ అని భేదం లేకుండా విసురుతున్నారు. ఆవిడ తిరగలి. ఈయన విసనకర్ర. శభాష్" చమత్కరించాడు.



ఎంత ఎలిజబెత్ మహారాణి అయినా ఓ మగాడికి భార్యేకదా! అందుకే అన్నాడు ఆత్రేయ - 'ఏ పురానికి రాణులైనా కాపురానికి పెళ్లాలేనయ్యా!!' అని.

ఎన్ని యుగాలు గడిచినా స్త్రీ తలరాత ఇంతే కాబోలని మనసు సరిపెట్టుకుని 'రాదే చెలీ.. నమ్మరాదే చెలీ' అని విషాదంగా పాడుకుంటూ భర్త పాదాలను మర్దిస్తున్నది శ్రీలక్ష్మి.

నారదుడొచ్చి మళ్ళీ ఏదో చెప్పబోతుండగా అతని చేతిలోని చిరతల్ని లాక్కుని చిద్విలాసంగా తాళం వెయ్యసాగాడు నారాయణుడు.

భార్య మాటలకు తాన తందాన అంటున్నట్లు పైకి నటిస్తున్నా చివరికి మగాళ్ళు తమ మాటే నెగ్గించుకుంటారన్న సత్యం ముల్లోకాలకు మరోసారి విదితమైంది.

నారాయణ నారాయణ (సత్తిరాజు లక్ష్మీనారాయణ)

శ్రీమత్‌రమా 'రమణ' గోవిందో హరి!

-----శుభం-------

ఫిబ్రవరి 11 ఘంటసాల వర్ధంతి సందర్భంగా...

# ఘంటసాల జ్ఞాపకాలు

- బాలాంత్రపు రజనీకాంతరావు



"వెండి యిసుకలలోన తళుకులో నీవు
పండబారిన సంజ పసిమిలో నీవు
సన్నసౌ నెలవంక మిసిమిలో నీవు
మంచులో కడువిచ్చు మధుర మధురమ్మైన
లే గులాబీపూవు నవ్వులో నీవు
ఇంచుకించుకలుగా హృదయమ్ము నలరించు
ఖర్జూరమారుతము నీవు లైలా
ఎందు చూచినగాని నీవు లైలా
మృతిలేదు ప్రేమకంటావూ"



అకాలంలో మృతిచెందిన ఘంటసాల జ్ఞాపకాలను ఆ ఖర్జూర మారుతాలు మోసుకవచ్చి హృదయాన్ని తాకుతున్నాయి అదేపనిగా!

"వీణా, ప్రియవీణా! అఅఅ.. అఅఆఅ
వీణా .. సారింపుము
నీ తంత్రుల తేలింపుము
వినువీథులలో వీణా"

అరవై యేళ్ళక్రితం మాట. ఒక కాలేజిలో నా లలితసంగీత సభ పూర్తిచేసి బైటకి వస్తున్నాను. నా పాట విన్న జనం నన్ను చుట్టవేసుకుని వాళ్లూ బైటికి వస్తున్నారు.

'అచ్చం ఘంటసాలలాగే..'' ఎవరో ఒకాయన "వీణా అఅఅ అఅఆఅ" అని అచ్చంగా ఘంటసాలలాగ పాడాడు.'' అని అన్నాడు ఒకాయన. మరొకరు "ఈ పాట ఈయన రచనే- ఇది ఈయన సంగీతం. ఘంటసాలే ఈయనలాగ పాడేడు" అని సర్దాడు. మొదటాయన "అది నాకేం తెలుసు? అది ఈవేళ ఈయన పాడుతూ ఉంటే అచ్చం ఘంటసాల పాడినట్టే వుందంటున్నాను" అన్నాడు.

1947లో ఘంటసాల 'లక్ష్మమ్మ' సినీమాలో- నేను రానిన ఈ పాటని కృష్ణవేణి చేత పాడించారు.

'ఏమని-ఏమేమని-ఏమేమని
నా హృదిలోపల కోరిక యేదో
నాట్యము సేయును తీయని పాటై
కమ్మకమ్మని పూవుల తావులు
పలుకరించు పూరేకుల చాటై
హృదిలో కోరిక - ఏమేమని".......

విజయా వారి 'షావుకారు' చిత్రంలో (1950) ఘంటసాల సంగీతంలో వచ్చిన సముద్రాల రచన-

"ఏమనెనే చిన్నారి ఏమనెనే
వన్నెల సిగపూవా, కనుసన్నలలో భావమేమి
ఏమనెనే... చిన్నారి ఏమనెనే"

చిత్రం ఏమిటంటే రచనలోనేకాదు. సంగీత వరుసలో కూడా కొంచెం పోలిక కనబడుతుంది.

## రేడియో ప్రవేశం

అఖిలాంధ్ర సినీమాశ్రోతల, ఆంధ్ర రేడియో శ్రోతల హృదయాలలో నాటుకుపోయిన యీ ఘంటసాలను అప్పటికి సుమారు 5,6 ఏళ్ళ క్రితం హెచ్.ఎమ్.వి. వాళ్ళు "నీ గొంతు రికార్డింగుకూ, మైకుకూ పనికిరాదని"- అన్నారు.

వాళ్ళ నిర్ణయం సంగతి ఏమైనా సముద్రాల, మల్లాది రామకృష్ణశాస్త్రి గారల ప్రోత్సాహంతో అతను వాహినీ లోను, చిత్తూరు నాగయ్య వెనుకాల - త్యాగయ్య సినిమాలో త్యాగరాజు శిష్యుడు వేషంలో కనబడతాడు- కాలక్షేపం చేస్తూ ఒకరోజున - సముద్రాల వారి శిఫారిష్ ఉత్తరంతో నా వద్దకు వచ్చాడు. అప్పుడు నేను మద్రాసు ఆల్ ఇండియా రేడియోలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా శాస్త్రీయ సంగీత శాఖనూ, లలిత సంగీత శాఖనూ, సంగీత నాటక శాఖనూ నిర్వహిస్తున్నాను. శాస్త్రీయ సంగీతంలోనూ, లలితసంగీతంలోనూ, రేడియో సంగీతం నాటకాలలోనూ పాల్గొనడానికి ఘంటసాలకి ఒప్పిదమైన గ్రేడింగ్స్‌కి నేను రికమెండ్ చెయ్యడమూ, తక్కినవారి ఆమోదం లభించడమూ జరిగిపోయాయి. ఆ విధంగా ఆంధ్ర రేడియో శ్రోతల హృదయాలలో ఘంటసాల కళాంకురాలు చిరస్థాయిగా నాటుకుపోయాయి.

అది మొదలు నెలా నెలన్నరకు రేడియో శ్రోతలు రోజూ పొద్దుటో అరగంట మధ్యాహ్నమో లేదా సాయంత్రమో అరగంటా వచ్చే శాస్త్రీయ సంగీత కార్యక్రమంలో, నెలకొకసారి వచ్చే గీతావళి కార్యక్రమంలోను ఒక్కోసారి సంగీత నాటకాలలోను ఆయన గొంతు వింటూండేవారు. అంతవరకూ సంగీత నాటకాలలో ప్రధాన పాత్రలు - రాజుపాత్రల వంటివి - ధరించే ఎమ్.ఎస్.రామారావు, అవసరాల శేషగిరిరావులతో పాటు ఘంటసాల కూడా ప్రసిద్ధి పొందసాగాడు.

## ప్రోగ్రాం మిస్సయిన వేళ...

నెలకి ఒకసారిగాని, ఒకటిన్నర నెలకొకసారిగాని ఘంటసాల గీతావళి కార్యక్రమం తప్పక వచ్చేది. అటువంటి కార్యక్రమానికి 1949 మార్చిలో ఒకసారి ఘంటసాల పేరు ప్రోగ్రాం పత్రికలో అచ్చయిందిగాని కార్యక్రమంలో పాల్గొనడానికి రేడియో కేంద్రానికి ఘంటసాల రాలేకపోయారు. అప్పుడు ఘంటసాల అంతశ్శుద్ధితో క్షమాపణ కోరుతూ నా (రజని) పేర వ్రాసిన ఉత్తరం యీ దిగువన యిస్తున్నాను.





G.V.Rao.
3/3/47

ఈ ఉత్తరంలో ఘంటసాల వినయమూ, నిగర్వతా, సజ్జనతా, అమాయకత్వమూ వెల్లడి అవుతాయి.

నెమ్మదిగా రేడియోలోగాని, సినిమాలోగాని తన పాటకి సహకరించడానికి ఒక వాద్యబృందాన్ని( ఆర్కెస్ట్రాని) ఏర్పాటు చేసుకున్నాడు ఘంటసాల. 15-20 నుంచి 25 మందిదాకా వేరు వేరు వాద్యాలపై ఏ పాటకి ఎక్కడ ఎలాగ 'బిట్లు' ద్వారా గాని, బ్యాగ్రౌండ్స్ ద్వారాగాని సహకరించాలో ఒక్కొక్క అంశమూ వాళ్లతో కలిసి పాడి, వాయింపించి పెర్ఫెక్ట్ చేసుకునేవాడు. అదే ఉత్తరంలో కూడా రాశాడు.

వాళ్లందరిని ఎంతో ఆప్యాయంగా పలకరించేవాడు, బుజ్జగించేవాడు. వాళ్ళు కూడా అతన్ని 'మాస్టారూ' అంటూ అభిమాన గౌరవంతో చూసుకునేవారు. సినీమాలలో నాయక పాత్రలకు తను పాడుతుంటే పక్క హాస్య పాత్రలకీ వాటికీ పాడడానికి 5,6 గురు కళాకారుల శిష్యబృందం తన వాద్యబృందంలో చిల్లర పనులకు సహకారం చేసేవారు.

**మా ఇంటి ఫంక్షన్‌లో..**

1951లో జనవరిలో మా యింట్లో మా పెద్ద అమ్మాయి పుట్టి, ఆ అమ్మాయికి మే నెలలో బారసాల చేస్తూంటే ఘంటసాల తన వాద్య బృందంతో మైలాపూరు సంస్కృత కళాశాలకి ఎదురుగా నేను కాపురం ఉండే టి.ఆర్.వేంకట రామశాస్త్రి గారి ఇంటి హాలులో కచేరీ చేశాడు. (ఆంధ్ర మహిళా సభ కొంతకాలం క్రితంవరకూ ఆ యింట్లో ఉండేది.)

'తాథిమ్మి తకధిమ్మి తాథిమ్మి తకధిమ్మి' అని ఒక ముక్తాయి వేసి తన నోటితో కూడా అని, 'ఓహో భారత పౌరులారా!' అని ప్రజలను పిలిచి, "పెళ్లి చేసుకుని ఇల్లు కట్టుకుని చల్లగ కాలం గడపాలోయ్" అని ఒక పాటతో మొదలుపెట్టి మొత్తం గంటాగంటన్నర కచేరీ చేశాడు మా యింట్లో! మా మేనల్లుడు చి॥సుబ్బారావూ మొదలైన పిల్లలంతా ఎంతో సంతోషించారు.

**మ్యూజికల్ రౌండప్**

ఆకాశవాణి ఢిల్లీ కేంద్రం నుంచి ఆనాడు వారానికి ఒకసారి ప్రసారం అవుతూండే, "మ్యూజికల్ రౌండప్" అనే కార్యక్రమంలో ఘంటసాల చేత నేను పాడించిన ఒక విశిష్ట గేయం నాకు ఏనాటికీ గర్వకారణం. 1945 ప్రాంతాల్లో అనుకుంటా - ఒక వారంలో ప్రసారం అయిన కార్యక్రమాలలోనుంచి 5 నిమిషాలకు మించని ఒక విశిష్టాంశాన్ని రాగం, రచయిత మొదలైన వివరాలతో ఢిల్లీ పంపుతే ఆదివారం రాత్రి 8.30 ని॥లకు, 9.15 ని॥లకు మధ్య ఢిల్లీ నుంచి ప్రసారం అయే కార్యక్రమాన్ని ప్రతీకేంద్రమూ రిలే చేసేది. ఆ కార్యక్రమానికి "ఘనాఘనా ఘనాఘనా గర్జింపవో ఘనాశని" అనే పల్లవితో మేఘరంజని రాగంలో ఘంటసాల చేత నేను పాడించిన గేయం- రచన, సంగీతం గాయకుడూ మొదలైన వివరాలతో ఢిల్లీ నుంచి ప్రసారమయి అన్నికేంద్రాలు రిలే చేశాయి.

**వెలుగు వెల్లువ**

నలభైలలో ఒక దీపావళినాడు వెలుగు వెల్లువ అనే సంగీత నాటకం ప్రసారం అయింది. నాటక రచన సముద్రాల వారిది. వాహినీ స్టూడియోలో పనిచేసే హేమాహేమీలంతా రేడియోకి వచ్చారు. సంగీతం ఘంటసాల. అది ఒక గంట సంగీతనాటకం, ఇందులో ఘంటసాల వరుసపెట్టిన 'ఘూర్జరీ తోడి' మరిచిపోడానికి వీలులేని రాగం.

**సంక్రాంతి కార్నివాల్**

ఒక సంక్రాంతికి విజయవాహినీ స్టూడియోస్ స్టాఫ్ మెంబర్లు వారి స్టూడియో ఆవరణలో విచిత్ర వినోద వేషాలువేసి మద్రాసు నగరవాసులందరినీ ఆహ్వానించారు. వినోదవేషాలు వేసినవారిలో



దప్పుకొట్టేవాని వేషంలో ఘంటసాల

భానుమతి, ఘంటసాల, పేకేటి, పద్మనాభం, రేలంగి, నల్లరామమూర్తి, రమణారెడ్డి మున్నగువారంతా ఉన్నారు. ఘంటసాల ఆ వేళ ముఖానికి నల్లరంగు పూసుకుని దప్పుకొట్టేవాని వేషం వేశాడు. నేనూ మా ఆవిడ మా పిల్లల్ని ఎత్తుకుని వెడితే వాళ్లని ఎత్తుకుని ఆయనా, ఆ పక్కనున్న భానుమతీ పిల్లలకి చాక్లెట్లు పంచారు.

**ప్లేబాక్, సినీమాగానం**

ఘంటసాల పాడిన మొదటి సినీమా పాట స్వర్గసీమలోని 'గాజులపిల్ల' దృశ్యంలోనిది. భానుమతీ, సి.హెచ్. నారాయణరావుల ఆ యుగళగీతంలో నారాయణరావుకు ఘంటసాల పాడారు. ఆ తర్వాత పాట నేను సంగీతం పాటలూ ఇచ్చిన గృహప్రవేశం(1946) చిత్రంలో ఒక శ్మశాన దృశ్యంలో 'మారుతుందోయ్ ధర్మమూ' అనే బైరాగి వేషం పాడిన పాట.

క్రమంగా ఘంటసాల ఎన్.టి.ఆర్, అక్కినేని కథానాయకులుగా వేసిన చిత్రాలలో వారి పాత్రలకి పాడడమూ, తక్కిన రెండవ, మూడవ, నాల్గవ రకం పాత్రలకి తాను పాడకుండా తన శిష్యబృందంలోని పిఠాపురం నాగేశ్వరరావు, మాధవపెద్ది సత్యం, సావిత్రి, పామర్తి, రాఘవులూ వంటి గాయకులకు అవకాశాలిచ్చి ప్రోత్సహించేవాడు.

**శోభనాచల వారి లక్ష్మమ్మ**

'గృహప్రవేశం' (1945)కు పాటలూ సంగీతమూ చేసిన నేను గోపిచంద్ గారి తరువాతి చిత్రాలకు మరి కొన్నిటికి పనిచేశాను. అవి- పేరంటాలు, లక్ష్మమ్మ.

1947లో మహతీవారు ప్రకటించిన లక్ష్మమ్మ 1950 నాటికి చేతులు మారి శోభనాచల చేతికి వచ్చింది. కృష్ణవేణి, నారాయణరావులు దానిలోని నాయికా నాయకులు.

సంగీతమూ, పాటలు చేయడానికి ఒప్పుకున్న నేను ప్లూరసీ వచ్చి సెలవుమీద ఉండడం జరిగింది. 'తారానాథ్' అనే కలం పేరుతో నేను పాటలు రాసి 'సిక్ బెడ్'నుండే వాటికి సంగీతపు వరుసలు పెట్టడమూ, వాటిని వింటూ ఘంటసాల ఆ వరుసల స్వరాలు తీసుకుని మొదటిసారిగా సినిమా చేయడమూ జరిగింది. సంగీతం ఘంటసాల అని ప్రకటించడం జరిగింది.

నాన్నగారూ నాన్నగారూ అంటూ ఘంటసాల చాల ఆప్యాయంగా నా జబ్బు మంచం దగ్గరకి వచ్చి నే రాసిన పాటలకి నేను పాడే స్వరాలు తీసుకునేవారు. పాటల రికార్డింగు తనే చేయించేవాడు. తిల్లాన వంటి ప్రాచీన (మధ్యయుగ) వాగ్గేయకారుల రచనలకు తానే విజయనగరం సంగీత కళాశాలలో తాను నేర్చుకున్న ఒకటి రెండు అంశాల ఆధారంగా తనకి తెలిసిన స్వరాలు ఇచ్చాడు. ఆ విషయంలో మిత్రులు వి.ఎ.కె.రంగారావు 'ఆలాపన'లో వ్రాసిన సంగతులు సరయినవే.

'లక్ష్మమ్మ' చిత్రంలో నాయక పాత్ర ధరించిన నారాయణరావు రెండు దారుల చీలికలో మూడు లాంతరుల స్తంభం కింద 'ఇటో అటో ఎటు పోవుటో' అనే పాట- నేను చేసినదే! ఘంటసాలే, ఎమ్.ఎస్.రామారావు చేత పాడించాడు.

'జనరంజకమయిన నూతనపద్ధతిలో ఘంటసాల తన గాత్రంతో ప్రజలను ఉర్రూతలూగించా'రని ఇప్పటికీ నేను భావిస్తూ వుంటాను. ఘంటసాల కంఠబలాన్ని మొదటిసారిగా ఆకాశవాణిల ద్వారా వినిపించినది నేనే అయినా తన స్వశక్తితో అఖండమైన కీర్తి సంపాదించటం నా కనులారా చూశాను. తర్వాత ఘంటసాల సాధించిన అభివృద్ధి నాకెప్పుడూ ఆనందాన్నిస్తూ వుండేది.

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు



పి.వి.ఎస్.ఎస్.పద్మకుమారి,గచ్చిబౌలి,హైదరాబాద్

ప్ర॥ కుక్కకాటుకి చెప్పుదెబ్బ అంటే?
జ॥ కల్తీ సరుకులు అమ్మేవాడికి దొంగనోట్లు ఇవ్వడం
ప్ర॥ హైటెక్ పురోహితుడంటే?
జ॥ ఇంట్లో కూర్చుని ఇంటర్నెట్ ద్వారా ఒకే ముహూర్తానికి వంద పెళ్ళిళ్ళు జరిపించేవాడు
ప్ర॥ కంసుడికి ఇష్టంలేని జిల్లా? దుర్యోధనుడికి ఇష్టంలేని ఊరు?
జ॥ కృష్ణాజిల్లా, భీమవరం
ప్ర॥ కొంపలంటుకున్నప్పుడు దొరికేనీళ్ళు , ఉపయోగపడని నీళ్ళు?
జ॥ కన్నీళ్ళు

## ఈ రూటేవేరు




ఆదిరాజు, చందానగర్

| | | |
|---|---|---|
| 'మీటు'ట | = | కలుసుకొనుట |
| ' లో 'గిలి | = | తక్కువ గిలి |

ఎం.డి.ముస్తఖీమ్,కొల్లాపూర్

| | | |
|---|---|---|
| కమ్ ఆన్ | = | పైకిరా |



## చిలిపి లిపి




| | |
|---|---|
| శ్రీ RAW GUM | - శ్రీరాగం |
| అSAW WAY రి | - అసావేరి |
| THEY వ GONE ధారి | - దేవగాంధారి |
| CALM భో G | - కాంభోజి |
| చారు KC | - చారుకేశి |
| BAY హాగ్ | - బేహాగ్ |
| నాట కు RUN G | - నాటకురంజి |

-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్,విశాఖపట్నం

ఏమండీ ఆవిడొచ్చింది - ఉండమ్మా బొట్టుపెడతా

-డి.బెనర్జి,శ్రీకాకుళం

ఇద్దరు మిత్రులు - మంచిమిత్రులు - ఒకరికి ఒకరు - ఆత్మబంధువులు

-మేడా మస్తాన్ రెడ్డి, విశాఖపట్నం

ఠాగూర్ - నీ మనసు నాకు తెలుసు - ఐతే - నిజం - ఎలాచెప్పను

-జి.ఎన్.వాణి,సరిపల్లె

## పేరు - రిపేరు



## చిలిపి కవిత



"భగ్గు మంటున్నాయి బజారు లో సరుకుల రేట్లు!
తగ్గించుకోవాలి దుబారాలూ, అలవాట్లు
పిల్లలకు కొనకు చాక్లెట్లు
పండగ లొచ్చినా చేయకు స్వీట్లు
మీ నాన్న కట్నంగా యివ్వలేదు - లక్షలూ కోట్లూ
మా నాన్నకొనిపెట్టలేదు నాకు హైటెక్‌సిటీలో ప్లాట్లు
గుర్తుంచుకో ?! మధ్యతరగతి కుటుంబాల పాట్లు
లేదంటే తప్పవు అగచాట్లు"
అంటూ మా వారు నాకు వింత బోధ చేశారు,
కాలుస్తూ 'త్రిబుల్ ఫైవ్' సిగిరెట్లు,
లాగించాక 'బావర్చీ బిర్యానీ' రెండు ప్లేట్లు !!
ఏం చేయను? ఎదురు చెప్తే తిట్లు,
'కామ్'గా వున్నా, తప్పవు చీవాట్లు,
ఇట్లు...పేరురాయను...ఆయన చదివితే యిక్కట్లు !!!

**-డా॥నెల్లుట్ల.వెంకటేశ్వరరావు,సికింద్రాబాద్**

## డబుల్ రోల్



ఏ **మోడల్** చూసినా ఏమో **డల్**గా అనిపిస్తోంది
**ఇదా? నిమ్మ**చెట్టు, ఇది **దానిమ్మ** కదూ...!?
**మీ మాంస** కృత్తులు అసలు బలమిస్తాయా అన్నదే మా **మీమాంస**

**-టి.దీప్తి,పూణె**

**కప్పు** దొంగతనం చేసినా లా**కప్పు** తప్పదు
**కరువు** గురించి ప్రొద్దుటనుండి ఏ**కరువు** పెడుతూనే వున్నాడు
**ఉన్న**స్థితి నుండి **ఉన్న**త స్థితికి పోవాలి

**-ఎం.వీరేశ్వర రావు,హైదరాబాద్**

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| కూరెళ్ల రమణమ్మ | = | కూర |
| చామర్తి రుక్మిణి | = | చారు |
| పోలవరపు పుణ్యవతి | = | పోపు |

**-టి.యల్.ప్రసాద్,విశాఖపట్నం**

## పేరడీ పెరేడ్



అ : నీవేనా...
నీవేనా నను లేపినది - నీవేనా నను కుదిపినది
నీవేనా నా కాలును గోకీ -
కమ్మని నిద్దుర చెరిపినది - నీవేనా
ఆ: నేనేలే నిను తాకినది - నేనేలే నిను కుదిపినది
నేనేలే నీ కాలుగోకి - నిద్దుర నుండి లేపినది-నేనేలే
అ: దుప్పటి కప్పును తొలగించి
నా రెప్పలు చప్పున తెరిపించి
చలి'లోగిలి'లో - వణుకుల వలలో
గిజగిజ లాడెడి - విషోదయంలో
నీవేనా నను లేపినది - నీవేనా నను కుదిపినది
నీవేనా నా కాలును గోకీ -
కమ్మని నిద్దుర చెరిపినది - నీవేనా
ఆ: నీళ్లను బాగా మరిగించి
బాత్రూమ్లో సిద్ధంగా వుంచీ
టవలును పక్కనే తగిలించి
సరి గావించి నేనేతించీ -
నేనేలే నిను తాకినది - నేనేలే నిను కుదిపినది
నేనేలే నీ కాలుగోకి - నిద్దుర నుండి లేపినది-నేనేలే
అ: నీవేనా...
ఆ: నేనేలే....

**మాయాబజార్ చిత్రంలోని "నీవేనా నను తలచినది" పాటకు పేరడీగా**

-దేవరం సతీష్ కుమార్, జగిత్యాల, కరీంనగర్

**ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన దేవరం సతీష్‌కుమార్ (జగిత్యాల) గారికి సోహన్ మ్యూజిక్ వారు 'నిజం' ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**






నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

## రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



ఎన్.టి.రామారావు "వేములవాడ భీమకవి" తీశారు. డి.యోగానంద్ దర్శకుడు. దర్శకుడెవరైనా సరే, రామారావే అన్నీ చూసుకుంటారు. యాక్షను, డైలాగూ అయనే చెప్పేవారు. షాటు "ఓకే" చెప్పినప్పుడు మాత్రం దర్శకుడూ, ఆయనా అనుకుని "ఓకే" అనుకుంటారు.

'భీమకవి'లోని ఒక దృశ్యంలో భోజనాలు తినే వ్యవహారం ఉంది. అక్కడేదో వ్యవహారం



ముదిరి, భీమకవి (బాలకృష్ణ) "అప్పాలన్నీ కప్పలవుగాక" అన్నట్టుగా శపిస్తాడు. విస్తళ్ళలో వున్న అప్పాలన్నీ కప్పలుగా మారిపోవాలి. సినిమాలో బాగా కనిపించాలని, రామారావు గారు పెద్దపెద్ద కప్పల్ని హైద్రాబాదు నుంచి మద్రాసు తెప్పించారు. దాదాపు పదిహేను కప్పలు ఒక పంజరంలో బంధింపబడి బెకబెకలాడుతూ షాటు కోనం ఎదురు చూస్తున్నాయి. ఆ షాటు రాగానే, "స్టాప్‌బ్లాక్"లో షాట్ కట్‌చేసి, విస్తళ్ళలోని అప్పాలు తీసేసి, ఆ స్థానంలో కప్పలు తెచ్చి పెట్టారు. అవి నిలబడగానే షాటు తియ్యాలి.

అయితే, ఆ మండూకాల్ని తెచ్చి పెట్టి, 'స్టార్ట్' అనే లోపలే పారిపోతున్నాయి! దిక్కులు చూడకుండా తలో దిక్కూ కప్పదాట్లు వేసుకుంటూ పరుగులు తీస్తున్నాయి. పైగా సెట్లో మూలమూలకీ పారిపోతూవుంటే, పరివారం అంతా వెతికి మళ్ళా తీసుకొస్తున్నారు; మళ్లీ నిలబెడుతున్నారు. రామారావు గారితో సహా అందరూ నవ్వులే! "ఇదెక్కడి గొడవండీ బాబూ! "కప్పల తక్కెడ" వ్యవహారం అంటే ఏమిటో అనుకున్నాను గాని, ఇవాళ అర్థమైంది" అన్నారు రామారావుగారు నవ్వుతూ.

"ఇంతకీ ఏమిటిది?" అన్నారెవరో.

"కప్పల్ని త్రాసువేసి తూచడం. ఒక కప్పని త్రాసులో వేసి, రెండో దాంట్లో గుండు పెట్టే లోపల, కప్ప దూకేస్తుంది. ఒక పళ్లెంలో ఒక కప్పనీ, ఇంకో దాంట్లో ఇంకో కప్పనీ పెట్టడం అంత సాధ్యమా? దాన్నే కప్పల తక్కెడ వ్యవహారం అంటారు" అని వివరించారు రామారావు గారు.

కాల్షీటు టైము గడిచి పోతోంది. కప్పలు నిలబడడం లేదు. దీపాలు వెలిగించి స్టార్ట్ అనగానే, కప్పలు స్టార్ట్ అయిపోతున్నాయి!

రామారావుగారికి విసుగొచ్చేసింది. "ఓసి వీటి దుంప తెగ! హైద్రాబాదునుంచి విమానంలో తీసుకొచ్చాం అని కాబోలు పొగరుగా వున్నాయి. ఒక్కక్షణం నిలబడితేచాలు - షాటు తీసుకోవచ్చుననుకుంటే - మన ప్రాణం తీస్తున్నాయే" అని మొహం తుడుచుకుంటున్నారు. అందరికీ చిరాకు ఒకవేపు, నవ్వు ఒకవేపూ.

ఆఖరికి ఒక ఐడియా వేశారు. కప్పల కాళ్ళకి దారాలు కట్టి, విస్తళ్లతో కలిపి కుట్టేస్తే పారిపోలేవు కదా! కొంతవరకూ బాగానేవుంది. పరివారంలో భయంలేనివాళ్లు, కప్పల్ని ఒళ్లో పెట్టుకుని కాళ్లకి దారాలు కట్టడంలో వున్నారు. అది మాత్రం అంత సులభమా! బాగా టైము పట్టింది.

ఆలోగా భోజనాల వేళయింది. అవి అయిన తర్వాత మళ్లీ కప్పల షాటు. దారాలు కట్టిన కప్పల కాళ్లకీ విస్తళ్లకీ లంకెలు వేశారు. "అమ్మయ్య" అనుకుని షాటుకి సిద్ధమై, కప్పల మీదనుంచి చేతులు తీసే సరికి - కప్పలు సామాన్యమైనవా! విస్తళ్లతో సహా పరుగెత్తాయి! మళ్లీ నవ్వులు, విసుగులూ!

విస్తళ్లు కదలకుండా వాటిని నేలకి అతికించే ఏర్పాటు చేశారు. అప్పుడు విస్తళ్లు నాన్ కోపరేట్ చేశాయి - చిరిగిపోవడం మొదలెట్టాయి కప్పల కదలికలకి. విస్తళ్లు మార్చారు. మళ్లీ విస్తళ్లకీ, కప్పలకీ కుట్లు!... కుట్లు, కుస్తీ పట్లతో అలాగే, సాయంకాలం దాకా సాగి సాగి, కొనసాగి - ఏదోరకంగా షాటు ఓకే అయింది. "అమ్మయ్య! ముప్పుతిప్పలూ పెట్టి మూడు చెరువుల నీళ్లూ తాగించాయి - వీటికి చెరువులే గతి! అదే శిక్ష" అని పకపకానవ్వారు రామారావు బెకబెకలాడుతూ కవ్విస్తూ చూస్తున్న కప్పలవంక చూస్తూ.

## ద్విచక్రపాణి

ఎవరు డైరక్టరయినా సరే, తనే షాటు చెప్పి, ఓకే చేసేవారు చక్రపాణి గారు (కె.వి.రెడ్డి గారు తప్ప!) ఈ అలవాటు ఆయనకి 'షావుకారు' నుంచీ వుంది. పెళ్లి చేసి చూడు, మిస్సమ్మ సినిమాలకీ ఎల్.వి.ప్రసాద్ డైరక్టరు. ఆయన, చక్రపాణీ అనుకునే షాట్స్ తీసేవారు. "సి.ఐ.డి" సినిమాకి చాణక్య దర్శకుడు. అది, తమిళ చిత్రానికి రీమేక్. నరసరాజుగారు స్క్రిప్టు రాశారు.

ఒకరోజు షూటింగులో రమణారెడ్డికి క్లోజ్‌షాటు. ఆయనకి వెనకాల కిటికీ వుంది. కిటికీ మీద ఏదో పటం వుండాలి. ఒక యాంగిల్‌లో ఆ పటం ఫీల్డ్‌లోకి రాలేదని, దాన్ని తీసేసి ఇంకో వేపు పెట్టినట్టున్నారు; ఇప్పుడు రమణారెడ్డి వెనకాల అది కనిపించాలి గనక, సహాయ దర్శకుడు ఆ పటం అక్కడ పెట్టిస్తున్నాడు. "ఎందుకది?" అన్నారు చక్రపాణి. "కంటిన్యుటీ సార్" అన్నాడు అసిస్టెంట్.

"ఏం కంటిన్యుటీ - ముందు రమణారెడ్డి నిలబడి డైలాగు చెబుతుంటే వెనకాల పటం వుందా లేదా అని ఎవ్వరు చూస్తాడూ? ఆ పటాన్నే చూస్తే, రమణారెడ్డి ఎందుకూ - వేస్టకదా... సరే పెట్టు" అన్నారు చక్రపాణి. తెలివైన ఆయన పాయింటుకి, రమణారెడ్డి "పాయింటే" అన్నట్టు నవ్వారు.

చక్రపాణి గారి అయిడియాలు ఎప్పటికప్పుడు మారిపోతూ వుంటాయి. ఆయన చెప్పింది ఆయనే కాదనడం కూడా వుంది.



'సి.ఐ.డి.' లో నేనో వేషం వేశాను. విలన్ రాజనాల దగ్గర అసిస్టెంటు. వేషాలు మార్చుకుంటూ తిరుగుతూ వుంటాడు.

నాకు మొదటిరోజు షూటింగు. వేషం వేసి, మీసం అదీ పెట్టి - కోటు వేసి టోపి పెట్టారు. ఆ గెటప్ తమిళ సినిమాలో - అలాగే వుంది. అందుకని, అన్నీ అలాగే ఫాలో అవుతున్నారు. నేను సెట్లోకి వెళ్లాను - గెటప్ చూపించాలని. డైరక్టరు చాణక్య చూసి "ఓకే. ఓసారి, ఆయనకి కూడా చూపించు" అన్నారని - నేను చక్రపాణి గారి దగ్గరికి వెళ్లాను.

చక్రపాణిగారు ఎగాదిగా చూసి, "ఎందుకీ టోపీ, కోటు?" అని అడిగారు. "ఒరిజినల్ సినిమాలో వేసిన గెటప్పేసార్ ఇది" అన్నాడు అసిస్టెంటు. చక్రపాణిగారికి చిర్రెత్తింది. "ఐతే? - వాడు వేస్తే మనమూ అదే వెయ్యాలని వుందా - మారిస్తే, వాడొచ్చి రైట్స్ వెనక్కి లాగేసుకుంటాడా?... ఆ టోపీ, ఆ కోటూ మార్చండి. మామూలు డ్రస్ వెయ్యండి" అన్నారు చక్రపాణిగారు - కాస్ట్యూమ్ రూముకి వెళ్లి మార్చుకుని వచ్చాను. "ఆఁ - ఇది చాలు" అన్నారాయన.

ఇంకోరోజు షూటింగ్‌లో నేను ఇంకోరకం వేషం వేసుకోవాలి. ఒరిజినల్ సినిమాలో లాగే వేస్తే వద్దంటారని, వేరే డ్రస్సు వేసి, మీసం అదీ పెట్టారు. మళ్లీ చక్రపాణి గారు చూశారు. "ఏందిదీ - మీసం అదీ" అని అడిగారాయన. "ఒరిజినల్‌లో వున్నట్టు ఫాలో కాకుండా, తెలుగుదనం వుంటుందని పంచె జుబ్బా వేశారు" అన్నాన్నేను.

"వాడేం వేశాడూ?"

"పాంటు, గళ్ల గళ్ల చొక్కా..." అని చెబుతూ వుంటే -

"బాగానే వుంటుంది కదా.ఎందుకు మార్చడం! వాడేసుకుందే వేసుకుంటే పోలా? మార్చాలని రూలేంవుంది? అలాంటిదే వేస్కో" అన్నారు చక్రపాణి.

ఆవేళ అలా అన్నారు, ఇవాళ ఇలా అన్నారని- నేను చాణక్యగారికీ, రమణారెడ్డిగారికీ చెబితే - "అదేనయ్యా మరి - చక్రన్నంటే" అని నవ్వారు.

"ఆయనవి రెండు విధానాలు. ద్వంద్వ ప్రవృత్తి. అంచేత "ద్విచక్రపాణి" అందామా?" అని అడిగాను . "బావుందయ్యా" అన్నారు ఇద్దరూ.

## ఘంటసాల కంఠశోష!

ఒకసారి కొడవటిగంటి కుటుంబరావు గారు చెప్పారు :

"పెళ్లిచేసి చూడు" సినిమా శతదినోత్సవం బెజవాడలో జరిగితే ఆయన కూడా అందరితో వెళ్లారట. కాల్షీట్ల వత్తిడిలో ఎన్.టి.రామారావు మాత్రం రాలేదుట. సావిత్రి, సూర్యకాంతం, దొరస్వామి, శివరామకృష్ణయ్య - వీళ్లంతా రైల్లో ఒక



పెట్టెలోనూ, నాగిరెడ్డి, చక్రపాణి, బార్ట్‌లీ, ఎల్.వి.ప్రసాద్ ఇంకో పెట్టెలోనూ కూచున్నారుట.

నేను (కొడవటిగంటి కుటుంబరావు), పింగళి నాగేంద్రరావు, ఘంటసాల, గోఖలే, యస్.వి.రంగారావు ఇంకో పెట్టెలోనూ వున్నాం. బండి బయల్దేరే వేళకి ముగ్గురు పోలీసువాళ్లు మా పెట్టెలో ఎక్కారు. "ఏం?" అని అడిగితే, ఎవరో మంత్రిగారు ఒకటో తరగతిలో ప్రయాణిస్తున్నారట - పేరువాళ్లకి తెలీదట - ఆయనకి కాపలా కాయడానికి వాళ్లు ఇందులో ఎక్కారు!

బండి బయల్దేరాక, వాళ్లు మమ్మల్ని పరిచయం చేసుకున్నారు. వాళ్లకి సరిగా తెలుగు రాదు గాని, ఘంటసాల పేరు విన్నారుట. అందుకని ఆయన వాళ్లకోసం "పంచదార వంటి పోలీసెంకటసామి" పాడి వినిపించారు. వాళ్లకి ఒక్క ముక్క అర్థం కాలేదు!

వాళ్లు మలయాళం వాళ్లని తెలిసి, ఘంటసాల ఒక మలయాళం పాట పాడారు. అదీ వాళ్లకి అర్థం కాలేదు. ఎంచేతంటే దాన్నిండా సంస్కృత పదాలున్నాయి - భక్తిగీతం.

"మిమ్మల్ని ఆ దేవుడే కాపాడాలి బాబూ, మీరు మంత్రిగారిని ఏం కాపాడుతారోగాని - నేను మాత్రం ఇంక నా గొంతు పాడుచేసుకోలేను" అని తానూ నవ్వి వాళ్లనీ నవ్వించారు ఘంటసాల".

## హాస్యం కాని హాస్యం

తెలుగు సినిమా పుట్టిన ఐదారేళ్లకే "పెద్ద తారాగణంతో తొలిచిత్రం" అనిపించుకున్న సినిమా "ద్రౌపదీ వస్త్రాపహరణం". మాటలు, పాటలూ అన్నీ అక్కడికక్కడే రికార్డింగు. సాధ్యమైనంత వరకూ అన్నీ పెద్దపెద్ద షాటులే. ఒక దృశ్యంలో ధృతరాష్ట్రుడు సింహాసనం మీద కూచుని పద్యం చదువుతాడు. ఆయనకి కుడి ఎడమల పక్కగా ఇద్దరు వనితామణులు నిలబడి, వింజామరలు వీస్తూ వుంటారు.

పద్యం అంతా ఒకే షాటులో తీసినట్టున్నారు - చాలా సేపు వుంటుంది. విసురుతున్న వనితల్లో ఒకామె కళ్లల్లో దోమ దూరినట్టుంది - విసరడం ఆపేసి, కళ్లు ఒత్తుకుంటుంది. మళ్లీ సర్దుకుని విసురుతుంది. ఇంకొక ఆమె, అది చూసి, ఆమెను చూసి నవ్వుతుంది. ఈమె కూడా నవ్వుతుంది. ఉండి ఉండి 'విసరడాలు' నిదానం అయిపోతూ వుంటాయి, స్పీడెక్కిపోతూ ఉంటాయి.

దర్శకుడు, తక్కినవారు పద్యం గమనించడంలో వుండిపోయి వుంటారు - వింజామర వీవనామణులు యాక్షన్‌లు గమనించలేదు. చూసి వుంటే షాటు కట్‌చేసి, మళ్లీ తీసేవారేమో! లేదా పర్వాలేదనుకున్నారేమో! ఆ సినిమా పెద్ద హిట్టయింది. అప్పట్లో ప్రేక్షకులు ఇలాంటి 'రిలాక్స్‌డ్ రియాక్షన్స్' పట్టించుకోలేదనుకుంటాను - డైరక్టరులాగే.

ఆ సినిమాని కొన్నేళ్ల క్రితం మళ్లీ మద్రాసులోని ఒక థియేటర్లో - ఉదయం ఆట వేస్తే వెళ్లి చూశాను. ధృతరాష్ట్రుడి పద్యం వినిపించనివ్వకుండా - ఆ చెలియల నీరసానికీ, చిరునవ్వుకీ హాలంతా ఒకటే నవ్వులు! 'అప్పుడు రాని హాస్యం ఇప్పుడొచ్చి వుంటుంది' అనుకున్నాను. ఇలాంటి పొరపాట్లు, లేక తప్పుల్లాంటివి - వెతికేవాళ్లకి - ఇంకా కనిపిస్తూనే వుంటాయి. 'వినాయక చవితి'లో టెలిగ్రాఫ్ స్తంభాలు, ఎప్పుడో వచ్చిన 'సంపూర్ణ రామాయణం'లో రైలు వెళ్లడం, 'సీతారామజననం'లో - జనంలో పాంట్లు వేసుకున్నవాళ్లూ - లాంటివి కావాలని చేసినవి కావనీ, పొరపాట్లనీ తెలుసుకున్నవాళ్లకి నవ్వులు రావుగాని, తక్కినవాళ్లకి అది హాస్యం కాకపోగా - నవ్వుతెప్పిస్తుంది.

ఫిబ్రవరి 14 ప్రేమికుల దినోత్సవం సందర్భంగా...



# జిందాబాద్! జిందాబాద్! ఐ మొహబ్బత్ హై జిందాబాద్



'ప్యాసా' చిత్రంలో వహీదా రెహమాన్, గురుదత్

ఈ ప్రపంచంలో ప్రేమిస్తున్నామనుకునే వాళ్ళు ఎక్కువ; ప్రేమించే వాళ్ళు తక్కువ. జీవితంలో ప్రేమలు మారిపోతుంటాయి. జీవితాంతం ఒక్కరినే ప్రేమించడం అనేది అరుదుగా జరుగుతూంటుంది. ప్రేమ లేనిదే బతకలేమనీ, ఒకవేళ ఆ ప్రేమ దక్కకపోతే, వాటి జ్ఞాపకాల్లో బతుకుతామనీ అనుకునేవాళ్లు వాస్తవ జీవితంలో చాలా అరుదు. అలా అనుకునేవాళ్ళు సినిమాలు ఎక్కువగా చూసేవాళ్ళు అయివుంటారు.



అదే సినిమా మహిమ. ఇక్కడ - వేగంగా ప్రేమించేయడం, ఒక్కరినే ప్రేమించడం, ఆ ప్రేమ ఎంతకి అరగక,తరగక పోవడం ఒకవేళ దక్కకపోయినా, ఆ ప్రేమనే తలుచుకుంటూ జీవితాన్ని నాశనం చేసుకోవడం -చాలా మామూలు. అది అసహజమనీ, అవాస్తవికమనీ తిట్టుకునేవాళ్ళు కూడా ఇలాంటి గొప్ప ప్రేమల్ని సినిమాల్లో చూసి ఆనందిస్తారు. దానికి అనేకానేక కారణాలుండవచ్చు; వాటిలో అతి ముఖ్యమైనది ఈ ప్రేమ అనే వస్తువులోని శక్తి. ఆకర్షణ. అదే లేకపోతే చలనచిత్రాల్లో అన్ని గొప్ప పాటలు ఉండేవి కావు; 50 ఏళ్ళ క్రితం పాటలు కూడా నిత్య నూతనంగా ఉండడానికీ, అన్ని వయస్సులవారూ అన్ని కాలాల పాటల్ని విని ఆనందించడానికి మూలకారణం ఆ పాటల వస్తువు ప్రేమ కావడమే. అంతేకాదు, జీవితంలో ప్రేమించిన ప్రతి ఒక్కరూ ప్రతి సందర్భంలోనూ పాడుకోడానికి వీలైన అన్ని భావాల పాటలను సినిమాలు మనకు అందించాయి. ఇంకా అందిస్తున్నాయి.



స్త్రీ పురుషులమధ్య ప్రేమ ఎప్పుడూ ఒకటే విధంగా ఉండనట్టె, సినిమా ప్రేమల్లో కూడా తేడాలున్నాయి. కాలం జరిగే కొద్దీ, ప్రేమ స్వరూపం మారుతూ వచ్చింది. ఆ ప్రేమప్రకటనా రీతులు కూడా మారుతూ వచ్చాయి. ప్రేమకు పూర్వదశ తొలి చూపు. ఆ చూపులో నాయిక సౌందర్యం పట్ల కలిగే ఆకర్షణ. హిందీ సినిమా పాటల్ని అలా అలా విహంగవీక్షణంలో పరిశీలించి చూస్తే, కథానాయిక వర్ణన సైగల్ కాలంనుంచి కుమార్‌సాను వరకూ, షకీల్ బదాయూనీ నుంచి జావేద్ అఖ్తర్ వరకూ ఎలా ఉందో, ఎన్ని వయ్యారాలు పోయిందో, ఎన్ని సొగసులు అందించిందో అర్థమై, ఆ వైవిధ్యానికీ, సౌందర్యానికీ, అనుభూతి సాంద్రతకూ, అభివ్యక్తి వైచిత్రికీ అబ్బురం, ఆనందం కలుగుతాయి. 1940లలో కథానాయిక వర్ణన కొద్దో,గొప్పో ఉంది. కానీ చాలా సంయమనంతో, పరిమితంగా మాత్రమే ఉంటుంది.

'దోనైనా మత్‌వాలే తిహారే, హమ్ పర్ జుల్మ్ కరే' (మైసిస్టర్ - 1944)అనీ,

మై క్యా జానూ క్యా జాదూ హై - ఇన్ దో మత్ వాలే నైనోమే'(జిందగీ -1940)

అంటూ ఆమె కళ్ళలోని మార్మికతను, మైమరపును, అవి తనపై జరిపే పెత్తనాన్ని వర్ణించాడు సైగల్. ఇక్కడ ప్రియురాలి వర్ణన ఆమె కళ్ళ దగ్గరే ఆగిపోయింది. మొత్తం హిందీ సినీ గీతాలను చూస్తే, నయనాల సౌందర్యానికే పెద్దపీట. కానీ, తొలి రోజుల్లో, ప్రేమ గురించి, భగ్న హృదయం గురించి రాసినంతగా ప్రియురాలి సౌందర్య వర్ణన చేయలేదు.

1952లో దీవానా సినిమాలో షకీల్ బదయూనీ, తన రక్తంతో ప్రియురాలి చిత్రపటం గీచే కథానాయకుడిని మనకు చూపాడు.

'తస్‌వీర్ బనాతా హు తేరి ఖూన్ - ఏ జిగర్ సే, దేఖా హై తుఝే మైనే మొహబ్బత్ కీ నజర్ సే'

అనడంలో, ప్రేమించే పురుషుడు తన ప్రియురాలి సౌందర్యాన్ని ఎలా చిత్రించగలడో అద్భుతభావన చేసాడు. 'వర్షం నీ కేశాలను బతిమాలి మేఘాలను తెచ్చుకుంది - విద్యుత్తు నీ చూపుల నుంచి తన మెరుపులను అందుకుంది' అంటూ వర్ణించి, చివరకు ప్రేమికుడికి ప్రియురాలి సౌందర్యంలో అన్నిటికంటే ముఖ్యమైన అంశాన్ని చెప్పాడు.

**'జిత్ నే భీ మిలే రంగ్ వో సబ్ భర్ దియే తుఝుమే - ఎక్ రంగె వఫా ఔర్ హై, లావూ వో కిధర్ సే'** ('సృష్టిలో ఎన్ని రంగులున్నాయో అన్ని నీలో నింపాను; ఇంకా ఒకటుంది. విశ్వాసం. దాన్ని ఎక్కడి నుంచి తీసుకురాగలను')

ప్రియురాలి బాహ్య సౌందర్యాన్ని అమితంగా మెచ్చుకుంటూనే, ఆమెలో ఉండాల్సిన గుణాలను ప్రస్తావించిన అతి చక్కని పాట ఇది.



1942 ఎ లవ్‌స్టోరీ చిత్రంలో అనిల్‌కపూర్, మనీషాకోయిరాలా

1955 తర్వాత నాయిక సౌందర్య వర్ణన చాలా సినిమాల్లో ప్రముఖ పాత్ర వహించింది.

**'యూ తో హమ్ నే లాఖ్ హసీ దేఖీ హై - తుమ్ సా నహీ దేఖా'**(తుమ్‌సా నహీ దేఖా - 1957)

నీ అంతటి సౌందర్య వతిని చూడలేదు అని హీరో ఒక్క మాటలో సరిపెట్టినా, తర్వాత తర్వాత దాని పొడిగింపులు చాలా వచ్చాయి.

**'తెరీ ప్యారీ ప్యారీ సూరత్ కొ కిసీకి నజర్ న లగే'** (ససురాల్ - 1961) నీ అందానికి దిష్టి తగులుతుంది జాగ్రత్త అని హెచ్చరించాడు.

**'హుస్న్ వాలే తేరా జవాబ్ నహీ'** అని ఆమెకు తిరుగే లేదనడం,

**'తారీఫ్ కరూ క్యా ఉస్ కీ, జిస్ నే తుమ్హే బనాయా'** (కశ్మీర్ కీ కలీ - 1964)అని, ఆమెను సృష్టించిన భగవంతుడిని మెచ్చుకోవడం,

**'యే ఆంఖే ఉఫ్ యూమా, యె సూరత్ ఉఫ్ యూమా, ప్యార్ క్యూ న హోగా'** (జబ్ ప్యార్ కిసీసేహోతా హై-1961 ) ఆవిడంత అందంగా ఉంటే ప్రేమించక ఏం చేయాలి అని సమర్థించుకోవడం,

**'తుమ్ కమ్‌సిన్ హో, నాదాన్ హో, భోలి హో'**(అయీ మిలన్ కీ బేటా - 1964)అని అమాయకత్వం కూడా అందానికి అదనపు అర్హతేనని చెప్పడం ...ఇలా ఒక మూసలో సాగిన పాటలు చాలా ఉన్నాయి.

మరోవైపు తను కలలు కన్న సౌందర్యం తన కళ్ల ముందు సాక్షాత్కరించింది అని చెప్పే పాటలు కొన్ని,

**'చాంద్ సి మెహబూబా హో మెరి కబ్ ఐసా మైనే సోచా థా, హా తుమ్ బిల్‌కుల్ వైసీ హో, జైసా మైనే సోచాథా'**(హిమాలయ్‌కి గోద్‌మె - 1965)చందమామ లాంటి ప్రియురాలు కావాలనుకున్నాను; నువ్వు అచ్చం నేను ఊహించినట్టే ఉన్నావు.

ఇలా చందమామ, ప్రాచీన తెలుగు కవులకే కాక, ఈ శతాబ్దపు హిందీ సినీ రచయితలకు కూడా స్త్రీ సౌందర్య వర్ణనకు ఫేవరెట్ ఉపమ అయింది. సునీల్ గవాస్కర్ తన భార్యను చూసి పాడుకొనే పాట వీటిలో తలమానికమైనది.

**'చౌదవీ కా చాంద్ హో - యా ఆఫ్‌తాబ్ హో - జోభీ హో తుమ్ ఖుదా కీ కసమ్ - లాజవాబ్ హో'** (చౌద్‌వీ కా చాంద్ - 1960)

ఇందులోని మూడు చరణాల్లోనూ స్త్రీ సౌందర్యాతిశయాన్ని వర్ణించిన తీరు అసామాన్యమైనది.

**'చెహరా హై జైసే ఝీల్ మే హస్తా హువా కమల్**
**యా జిందగీ కె సాజ్ పే ఛేడీ హుయీ గజల్**
**జానే బహార్ తుమ్ కిసీ శాయర్ కా ఖ్వాబ్ హో'** సరస్సులో వికసించిన పద్మంలాంటిదా, లేక జీవితమనే రాగంపై పాడిన గజల్ లాంటిదా ఆ వదనం అని ఆశ్చర్యపోతూ, నువ్వు ఏ కవి కన్న స్వప్నానివో అనడంలోని భావుకత అపురూపమైనది.

నాయిక సౌందర్యాన్ని వర్ణించడంలో హిందీ గీతాల్లో అపారమైన వైవిధ్యం కనిపిస్తుంది.

**'ఖుదా భీ ఆసమా సె, జబ్ జమీ పర్ దేఖ్‌తా హోగా, మేరే మొహబూబ్ కో కిస్ నే బనాయా సోచ్ తా హోగా'** (ధర్తీ - 1970) భగవంతుడు ఆకాశం నుంచి భూమి మీదికి చూస్తూ నా ప్రియురాలిని చూసి, ఈమెను ఎవరు సృష్టించారా అని ఆశ్చర్యపోయివుంటాడు అనీ,

**'బహారో ఫూల్ బర్‌సావో మేరా మెహబూబ్ ఆయాహై, హవావో రాగినీ గావో, మేరా మెహబూబ్ ఆయా హై'** (సూరజ్ - 1966) వసంతమా పూలు వర్షించు - నా ప్రియురాలు వచ్చింది, మలయ పవనమా, రాగాలు ఆలపించు, నా ప్రియురాలు వచ్చింది అనీ,

అనేక రకాలుగా, తనపైనే కాక, భగవంతుడి పైనా,యావత్తు ప్రకృతీ ఆమె సౌందర్యం గురించే ఊహిస్తుందని కూడా అంటాడు ప్రేమికుడు.

**'హై కలీ కలీ కె లబ్ పర్ - తెరె హుస్న్ కా ఫసానా - మేరే గుల్ సితా కా సబ్ కుచ్ తేరా సిర్ఫ్ ముస్కరానా'** (లాల్‌రుఖ్ - 1958)లో ఇదే భావం.

ఈ ధోరణికి పరాకాష్టగా **'ఎక్ లడ్‌కీ కో దేఖాతో ఐసా లగా - జై సే ఖిల్ తా గులాబ్...'**(1942,ఎ లవ్ స్టోరీ - 1994)అంటూ సుదీర్ఘంగా సాగే అపూర్వ వర్ణన జావేద్ అఖ్తర్ చేసాడు .

అయితే, కాలంతో పాటు, కథానాయికా నాయకుల అభిరుచులతో పాటు, అభివ్యక్తి కూడా మారింది. అంతకు పూర్వం హుస్న్,అదా,అందాజ్ వంటి పదాలు వాడుతూ, కళ్లను, శిరోజాలను, చిరునవ్వును మాత్రమే వర్ణించిన హిందీ కవులు, క్రమేపీ

**'కాన్ మే ఝుమ్ కా...రంగ్ హై నషిలా, అంగ్ అంగ్ హై నషీలా'**(సావన్ బాదో‹ - 1970),

**'బదన్ పె సితారే లపేటే హువే'** (ప్రిన్స్ - 1969)

వంటి పాటల్లో మరి కొంత వాచ్యతకు పాల్పడ్డారు. వీటిలో కూడా **'చందన్ సా బదన్'** వంటి పాటల్లో వాచ్యతతో పాటు భావుకతను సాధించారు.

**'జానే బహార్ హుస్న్ తేరా బేమిసాల్ హై'**(ప్యార్ కియాతో డర్నాక్యా - 1963)

అని పాత కాలం హీరో, ఆమెను 'జానే బహార్,జానే వఫా, మెహబూబా, హుస్న్ వాలే' అని సంబోధిస్తే, క్రమంగా అది

**'లడ్‌కీ, హై క్యా రె బాబా, ఉస్ కీ అదా రె బాబా'** (లాడ్లా - 1994) ఇత్యాదిగా మారిపోయింది. పాత చిత్రాల నాయకుడు -

'కౌన్ హో తుమ్ కౌన్ హో - కౌన్ హో తుమ్ కౌన్ హో

కవికీ మధుర్ కల్పనా హోతుమ్ - యా గాయక్ కీ మధురిమ్ తాన్

యా సరితా జల్ కీ తరంగ్ హో - అరుణ్ కమల్ కీ మధు ముస్కాన్' (స్త్రీ - 1961) అని ప్రబంధ రీతిలో కవితాత్మకంగా ఆమెను ప్రశ్నిస్తే, నేటి హీరో -

'తూ చీజ్ బడీ హై మస్త్ మస్త్ - తూ చీజ్ బడి హై మస్త్

నహీ తుఝ్ కో కోయి హోష్ - ఉస్ పర్ జో బన్ కా జోష్ జోష్

నహీ తేరా కోయి దోష్ దోష్ - మద్ హోష్ హై తు హర్ వక్త్ వక్త్' (మొహరా - 1994) అని ఆమె ఎవరో, ఎలాంటిదో ఆమెకే చెప్పాడు.



'చౌదవీఁ కా చాంద్' చిత్రంలో గురుదత్,వహీదారెహమాన్

మరోవైపు, ప్రియురాలికి సౌందర్యమన్నది అలంకరణ వల్ల రాదనీ, సహజంగా ఉండడమే అందమనీ, ఆమెని వర్ణించడానికి పాత ఉపమానాలేవీ సరిపోవనీ సున్నితంగా, సుందరంగా చెప్పిన

'చాంద్ సితారే, ఫూల్ ఔర్ ఖుష్‌బూ, యే తో సారే పురానే హై, తాజా తాజా కలీ ఖిలీ హై - హమ్ ఉస్ కే దీవానే హై' (కహోనా ప్యార్‌హై - 2000) అని పాడిన కొత్త నాయకుడు కూడా ఉన్నాడు.

ప్రియురాలి సౌందర్య వర్ణనలో రెండో దశ - తన మనస్థితిపై, జీవితంపై దాని ప్రభావాన్ని మరీమరీ చెప్పడం.

'గోరీ తెరె చల్ నే పే, మేరా దిల్ కురుబాన్ - తెరా చల్ నా, తెరా రుక్ నా, తెరా ముడ్ నా తౌబా' (ఫైసలా - 1955) అని ఆమె నడక తనలో ఎంత విహ్వలత కలిగిస్తుందో చెప్తాడు ఒక ప్రియుడు. మరో ప్రేమికుడు,

'జరా సున్ హసీనా యే నాజనీ - మేరా దిల్ తుఝీ పె నిసార్ హై

తెరే దమ్‌సె హీ మేరే దిల్‌రుబా - మేరీ జిందగీ మే బహార్ హై

హుయి జబ్ సే ముఝ్ పే తేరీ నజర్ - మై హు అప్‌నీ ఆప్ సే బేఖబర్

హువా జబ్ సే దిల్ మే తేరా గుజర్ - ముఝే చైన్ హైన కరార్ హై' (కౌన్ అప్‌నా కౌన్ పరాయా - 1963)

ఆమె వల్లే అతని జీవితంలో వసంతం; ఆమె చూపు తనపై పడేసరికి, అతను తన ఉనికిని విస్మరించాడు; మనశ్శాంతిని కోల్పోయాడు. ఆమె సౌందర్యం ఎంత శక్తివంతమైందో అద్భుతంగా చెప్పిన పాట ఇది. అలాగే

తేరీ ఆంఖోంకే సివా దునియామే రఖ్ఖా క్యా హై

యే ఉఠే సుబహ్ చలే - యే ఝుకే శామ్ ఢలే

మేరా జీనా మేరా మర్నా ఇన్హీ పల్‌కోంకే తలే' (చిరాగ్ - 1969) ఆమె కళ్లెత్తితే తెలవారుతుంది; ఆమె కళ్ళు దించితే పొద్దు పొడుస్తుంది; అతని జీవితం, మరణం ఆమె కనురెప్పల కదలికపై ఆధారపడివుంటాయి. అంటే ఆమె కళ్ళెత్తితే అతనికి జీవితం; కళ్లు దించితే అతనికి మరణం.ఇంత అద్భుతమైన ప్రేమగీతం ఏ భాషలోనైనా చాలా అరుదే. అలాంటిదే,

'జీవన్‌సె భరీ తేరీ ఆంఖే - మజ్‌బూర్ కరే జీనే కేలియే' (సఫర్ - 1970)చావు తప్పదని తెలిసినా, జీవచైతన్యంతో తొణికిసలాడే ఆమె కళ్లు అతనికి జీవితంపై మళ్ళీ ఆశను కలిగిస్తున్నాయి.

ప్రియురాలి సౌందర్యం మరణశయ్యపై ఉన్న వ్యక్తిలో ఆశలు చిగురింపజేయడం కంటే పరమార్థం ఆ అందానికి ఏం ఉంటుంది? ఇంత గొప్పగా హిందీ సినీ గీత రచయితలు స్త్రీ సౌందర్యాన్ని ఊహించారు. ఆమె కళ్ళను వర్ణించడం ఒక ఎత్తయితే, ఆమె తనకేసి చూసిన చూపుల వల్ల ప్రకృతి స్తంభించిపోయిందనడం గొప్ప భావన.

'తుమ్ నే ముఝే దేఖా హోకర్ మెహర్‌బా - రుక్ గయీ యే జమీ, థమ్ గయా ఆస్‌మా - జానే మన్ జానే జా' (తీస్రీ మంజిల్ - 1966)అన్నాడు ఓ నాయకుడు.

నాయికలు నాయకుల సౌందర్యాన్ని వర్ణించడం అరుదే అయినా, బొత్తిగా లేకపోలేదు.

'మేరే మహబూబ్ కే క్యా నహీ, వోతో లాఖోంమే హై ఎక్ హసీ'అని ఒకామె పొగిడితే, నాయికా నాయకులు ఒకర్నొకరు పొగుడుకున్న సందర్భాలు కూడా ఉన్నాయి.

'చాంద్ జానే కహా ఖోగయా - తుమ్ కో చెహరే సే పరదా హటానథా' (మైఁ ఛుప్ రహూంగీ - 1962)అని అతనంటే, 'చాందనీకో యె క్యా హోగయా - తుమ్ కో భీ ఇస్ తర్హా ముస్కరానా న థా' అని ఆమె అంటుంది. 'చంద్రుడు చూడు ఎటు పోయాడో - నువ్వు ముఖం మీదినుంచి మేలి ముసుగు తీయకుండా ఉండాల్సింది', ఈ వెన్నెలకేమైందో - నువ్వు ముఖం మీద నుంచి మందహాసం చేయకుండా ఉండాల్సింది'.

ఇలా ప్రేమించుకున్న యువతీ యువకులు, పరస్పర సౌందర్య వర్ణన చేయడం, ముఖ్యంగా పురుషులైతే, తమ పై ఆ అందం ప్రభావాన్ని మరీ మరీ గుర్తు చేసుకోవడం, ప్రేమించే క్రమంలో మొదటి దశ.

ప్రేమించారు సరే. ఆ సౌందర్యానికి ముగ్ధులైపోయి, పదే పదే తలుచుకున్నారు.సరే. ఇక ప్రేమను ప్రకటించుకోవాలి. అక్కడే చాలా ఇబ్బందులు వస్తాయి. హిందీ సినిమాల్లో తొలి నాటి ప్రేమికులు తమ ప్రేమను ప్రకటించుకోవడానికి చాలా తంటాలు పడ్డారు. చాలా అందంగా చెప్పారు. ప్రేమ ప్రకటించడం కూడా ఒక కళే అని పాత పాటలు వింటే అర్థమవుతుంది.

'మై దిల్ హూ ఎక్ అర్‌మాన్ భరా - తూ ఆకే ముఝే పెహచాన్ జరా' అని పాడాడు తలత్. ఆమెనే వచ్చి తన హృదయాన్ని గుర్తించమని ఈ నాయకుడంటే, అసలు నువ్వు నాకెందుకు కలిసావని ప్రశ్నించాడు మరో నాయకుడు.

'ముఝే దర్దె దిల్ కా పతా నథా - ముఝే ఆప్ కిస్ లియే మిల్‌గయే

మై అకేలే యూహీ కా పతా నథా - ముఝే ఆప్ కిస్ లియే మిల్‌గయే

మై అకేలే యూహీ మజే మె థా - ముఝే ఆప్ కిస్ లియే మిల్‌గయే' (ఆకాశ్‌దీప్-1965) నాకు మనోవ్యథ అంటే ఏమో తెలీదు - నువ్వెందుకు కలిసావు' అని అన్యాపదేశంగా చెప్తాడు ఈ నాయకుడు.

మరో ప్రేమికుడు, 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను' అని చెప్పక,

'జిసనమ్ జిస్ నే తుఝే చాంద్ సీ సూరత్ దీ హై

ఉసీ మాలిక్ నే ముఝే భీ తో ముహబ్బత్ దీ హై' (దీవానా - 1967) అంటూ, నీకు చందమామ వంటి సౌందర్యం ఇచ్చిన ఆ దేవుడే నాకూ ప్రేమించే హృదయాన్ని ఇచ్చాడు' అన్నాడు.

ఆమె తనను పెట్టే బాధ తనకెంతో ఇష్టమని చెప్పడం ద్వారా తన ప్రేమను అభివ్యక్తం చేసాడు మరో నాయకుడు.

"పల్ పల్ దిల్ కే పాస్ తుమ్ రెహతీ హో" (బ్లాక్‌మెయిల్ - 1973) అంటూ,

"తుమ్ సోచోగీ క్యూ ఇత్ నా - మై తుమ్ సే ప్యార్ కరూ

తుమ్ సమ్‌ఝోగీ దీవానా - మై భీ ఇకరార్ కరూ

దీవానోంకి యే బాతే - దీవానే జాన్‌తే హై

జల్ నే మే క్యా మజా హై - పర్‌వానే జాన్ తీ హై

తుమ్ యూహీ జలాతే రెహనా - ఆ ఆకర్ కాభోమే' అంటాడు.

కాలిపోవడంలోని అనందం దీపంపురుగుకే తెలుసుట; అందుకే నువ్వు ఇలాగే నా కలల్లోకి వస్తూ, నన్ను దహిస్తూ ఉండు అని కోరుకుంటాడు ఈ ప్రేమికుడు.

ఒకప్పుడు కథానాయకుడు, నాయిక ఇద్దరూ, తమ ప్రేమను ప్రకటించుకోవడానికి సిగ్గుపడేవారు.

**'ముఝె తుమ్ సే మొహబ్బత్ హై**
**మగర్ మై కెహనహీ సక్‌తా,**
**మగర్ మై క్యాకరూ బోలో**
**బినా భీ రెహ నహీ సక్ తా'** (బచ్‌పన్ - 1963)అని అతను అంటాడు. ఆమె

**'కైసేకహూ, కైసే కహూ, తోసే జియా కి బై బతియా'** అని,

**'శర్మ్ ఆతీ హై మగర్ ఆజ్ యే కెహనా హోగా - అబ్ హమే ఆప్ కి కదమో హి మే రెహనా హోగా'** (పడోసన్ -1968)అనీ,

సిగ్గుపడుతూనే ఆంతర్యాన్ని బయట పెట్టేవాళ్ళు. ప్రేమ అంటే ప్రేమే కాదు, నమ్మకం కూడా అని ప్రకటించిన ప్రియురాళ్ళు ఉన్నారు.

**'మై తుమ్హీ సే పూచ్ తీ హూ - ముఝె తుమ్ సే ప్యార్ క్యూ హై**
**కభీ తుమ్ దగా నదోగే - ముఝె ఐత్ బార్ క్యూ హై'** (బ్లాక్ క్యాట్ - 1959) నాకు నీ మీద ఇంత ప్రేమ ఎందుకుంది? నువ్వు నన్ను ఎప్పటికీ మోసం చేయవనీ నీపై నమ్మకం ఎందుకుంది?'అని తన ప్రేమ బలానికి తనే ఆశ్చర్య పోయింది ఈ నాయకురాలు.

వాచ్యంగా కాక, ప్రేమను ఉపమ ల వెనక దాచి చెప్పిన నాయకులున్నారు.

**'ఐ హుస్న్ జరా జాగ్ తుఝె ఇష్క్ జగాయే - బద్ లే మేరి తక్‌దీర్ జో తూ హోశ్ మే ఆయే'** ప్రేమ నిన్ను మేల్కొలుపుతోంది. సౌందర్యమా, లే. నువ్వు స్పృహలోకి వస్తే, నా భవిష్యం మారిపోతుంది'.

ప్రేమే జీవితమని ఎంత అందంగా చెప్పాడో ఈ నాయకుడు.

**'హమ్ తుమ్హే చాహతే హై ఐ సే - మర్‌నేవాలా కోయీ జిందగీ చాహతాహో జైసే'** నేను నిన్ను ఎలా ప్రేమిస్తానంటే - మృత్యువు సమీపిస్తున్న వ్యక్తి జీవితాన్ని ప్రేమించినట్టు.

ప్రేమించడం మాటెలా ఉన్నా, ప్రేమను ప్రకటించడం అంత సులభం కాదని ఈ నాయకురాలు అంటుంది.

**'ఇన్‌కార్ కర్నా ముశ్కిల్ హై - ఇకరార్ కర్‌న ముశ్కిల్ హై**
**మెహబూబ్ సే మెహబ్బత్ కా - ఇజహార్ కర్ నా ముశ్కిల్ హై'**

అని ప్రేమను తిరస్కరించడమూ, అంగీకరించడమూ కష్టమే, ప్రియుడి పట్ల ప్రేమను వ్యక్తీకరించడమూ కష్టమే' అని ప్రేమలో ఎన్ని కష్టాలున్నాయో చెప్పింది.

కానీ, అందరూ ఇంత భయం, మొహమాటం చూపలేదు. ధైర్యంగా, స్పష్టంగా ప్రేమను ప్రకటించిన వాళ్ళు చాలా మందే ఉన్నారు.

**'ముఝె కిత్‌నా ప్యార్ హై తుమ్ సే - అప్ నే హీ దిల్ సే పూఛో తుమ్**
**జిసే దిల్ దియా హై వో తుమ్ హో - మేరి జిందగీ తుమారీ హై'** (దిల్‌తెరా దీవానా - 1962)

అని ఎన్నిరకాలుగా చెప్పవచ్చో అన్ని రకాలుగాను చెప్పుకున్నారు ఇద్దరూ. అలాగే, ఈ తరం నాయికా నాయకులు

**'మైనే ప్యార్ తుమ్హీ సే కియా హై - మైనే దిల్ భీ తుమ్హీ కో దియా హై'** ఫూల్ ఔర్ కాంటే - 1991) అని ఖచ్చితంగానే చెప్పుకున్నారు. ఇంకా బండగా చెప్పుకున్న ప్రేమికులు కూడా ఉన్నారు.

**'అంగ్రేజీ మే కెహతే హై కీ ఐ లవ్ యూ'** అని అన్ని భాషల్లోనూ ప్రేమను ప్రకటించుకున్నారు. ఈ తరం యువతీ యువకులు **'ఈలూ,ఈలూ'** (సౌదాగర్ - 1991)అని కొత్త పదాలను కనిపెట్టిన ప్రేమికులూ ఉన్నారు.



'సూరజ్' చిత్రంలో రాజేంద్రకుమార్, వైజయంతిమాల

ప్రేమలో ఎంత వైచిత్రి ఉందంటే, ప్రతిస్పందన లభించకపోయినా, తనుమాత్రం ప్రేమించడం మాననని అంటుంది ఓ ప్రేమికురాలు.

**'తూ ప్యార్ కరే యా ఠుక్ రాయే**
**హమ్ తో హై తేరే దీవానోమె**
**చాహే తు హమే అప్‌నా నబనా**
**లేకిన్ న నమఝ్ బేగానోమే'** (దేఖ్ కబీరారోయా - 1957)నువ్వు ప్రేమించినా, తిరస్కరించినా నేను నీ ప్రేమలో పిచ్చిదాన్నే. నన్ను నీదాన్ని చేసుకోక పోయినా ఫర్వాలేదు; పరాయిదాన్నని మాత్రం అనుకోకు

అయితే , నాయకుల్లో అంత నిదానం, త్యాగం కనిపించవు.

**'తుమ్ అగర్ ముఝ్ కో న చాహో తో కో యి బాత్ నహీ**
**తుమ్ కిసీ ఔర్ కో చాహోగీ తో ముశ్కిల్ హోగీ'** (దిల్ హీ తో హై - 1963) నువ్వు నన్ను ఇష్టపడకపోతే ఫరవాలేదు కానీ, మరొకరిని ఇష్టపడితే మాత్రం కష్టం

హిందీ సినిమాల్లో ప్రేమ వ్యక్తీకరణ ఇలా అనేక రూపాలు దాల్చింది. వాలంటీన్‌డే జరుపుకునే నేటి యువతరానికి ఏ సందర్భంలోనైనా పాడుకోవడానికి, తాము ప్రేమించేవారికి వినిపించడానికి కావలసినన్ని మధురమైన గీతాలు అందించింది.

ప్రేమనేది ఓ సముద్రమైతే ఆ భావాన్ని వ్యక్తీకరించే పద్ధతులు నిరంతరం ఎగసిపడే అలల్లాంటివి. ఓ వ్యాసం ద్వారా వాటిని అందించాలనుకోవడం శ్రీశ్రీ అన్నట్టు 'చెమ్చాతో సముద్రాన్ని తోడశక్యమా' లాంటిదే.

**-మృణాళిని**

# ఎంతటి ప్రేమయో...!







### ఆత్రేయ

నన్నిడిచి నువ్వెళితే నీ వెంట నేనుంట
నిన్నిడిచి నే వెళితే నువ్ బ్రతకలేవంట
ఇది నీ గొప్పా నా గొప్పా కాదు పిల్లోడా
ప్రేమంటే అంతేరా పిచ్చివాడా

చిత్రం : ఆత్మబలం
పాట పల్లవి : ఎక్కడికి పోతావు చిన్నవాడా

---

ప్రేమంటే అదో రకం పిచ్చన్నమాట
ఆ పిచ్చిలోనె వెచ్చదనం వున్నదన్నమాట
మనసిస్తే మతిపోయిందన్నమాట
మతిపోయే మత్తేదో కమ్మనన్నమాట

చిత్రం : కొడుకు-కోడలు
పాట పల్లవి : ఇదేనన్నమాట ఇది అదేనన్నమాట

---

మొదట మొదట కళ్లతోటి మొదలు పెట్టి లడాయి
హృదయమంత పాకుతుంది హుషారైన హాయి

చిత్రం : ఆత్మబలం
పాట పల్లవి : గిల్లికజ్జాలు తెచ్చుకునే అమ్మాయి

---

తొలికోడి కూతల్లె వినిపించి
తొలిపొద్దు వెలుగల్లె కనిపించి
తొలిజన్మ ఋణమేదో అనిపించి
తెరవని తలుపులు తెరిపించి

చిత్రం : మనసు-మాంగల్యం
పాట పల్లవి : ఎందుకు వచ్చావో

---

ప్రేమనేది ఉన్నదా
అది మానవులకే ఉన్నదా
హృదయముంటే తప్పదా
అది బ్రతుకు కన్నా గొప్పదా

చిత్రం : ప్రేమలు-పెళ్లిళ్లు
పాట పల్లవి : మనసులేని దేవుడు

### కులశేఖర్

గోరంత ప్రేమ కొండంత బలమిస్తుంది
నీ కంట నీరు చిటికేసి తుడిచేస్తుంది
గాయాలను మాన్పే మందే కద ప్రేమ
ప్రాణాలను పోసే సంజీవని ప్రేమ

చిత్రం : జయం

### చంద్రబోస్

పరువాలతో కరచాలనం చేసేది కాదు ప్రేమ
ప్రాణాలతో స్థిరబంధనం నెలకొల్పుతుంది ప్రేమ
మమతల అమృత వర్షిణీ ప్రేమ
కోర్కెల అలజడి కాదు సుమా
నిశీధిలోను వీడిపోని నీడ ప్రేమా.... ప్రేమా..

చిత్రం : ఈ అబ్బాయి చాలా మంచోడు
పాట పల్లవి : ఒక మనసుతో మనసుకి

### రాజశ్రీ

ప్రేమ ఎపుడు ముహూర్తాలు చూసుకోదులే
రాహుకాలం కూడా కలిసివచ్చులే

చిత్రం : ప్రేమికుడు
పాట పల్లవి : అందమైన ప్రేమరాణి చేయి తగిలితే

### భువనచంద్ర

కళ్లూ కళ్లూ మూసుకున్నా హృదయంతో మాట్లాడునమ్మా ప్రేమ
నిద్దుర చెదిరి పోయేనమ్మా నేస్తంకోసం వెతికేనమ్మా ప్రేమ
ఆడించి పాడించి అనురాగం కురిపించి అలరించేది ప్రేమ
రమ్మంటే పొమ్మంటు పొమ్మంటే రమ్మంటు కవ్వించేది ప్రేమ
ప్రేమలకు హద్దు లేదులే, దాన్ని ఎవ్వరైనా ఆపలేరులే

చిత్రం : ప్రేమలేఖ
పాట పల్లవి : నీ పిలుపే ప్రేమగీతం

### సిరివెన్నెల సీతారామశాస్త్రి

మరణాన్ని ఎదిరించి మరుజన్మగా వచ్చి
కరుణించు వరమే ప్రేమ

చిత్రం : పెళ్లిసందడి
పాట పల్లవి : హృదయమనే కోవెల తలపులు తెరిచే తాళం

---

ఏ నిముషం ఇది మొదలౌతుందో తెలియదు
గుండెల్లో చేరేముందు అనుమతి అడగదు
మనసుంటే ప్రేమించక మానదు
ప్రేమిస్తే మనకంటూ మనసే మిగలదు

చిత్రం : రంగేళి
పాట పల్లవి : ఏమిటో ఏమో ఈ ప్రేమ

---

ఎవ్వరినెప్పుడు తన వలలో బంధిస్తుందో ఈ ప్రేమ
ఏ మదినెప్పుడు మబ్బులలో ఎగరేస్తుందో ఈ ప్రేమ
అర్థంకాని పుస్తకమే అయినా గాని ఈ ప్రేమ
జీవిత పరమార్థం తానే అనిపిస్తుంది ఈ ప్రేమ
ప్రేమ ప్రేమ ప్రేమ ఇంతేగా ప్రేమ

చిత్రం : మనసంతానువ్వే

---

ప్రేమా నీతో పరిచయమే ఏదో పాపమా
అమృతమనుకొని నమ్మటమే ఒక శాపమా
నీ ఒడి చేరిన ప్రతి మదికి బాధే ఫలితమా
తీయని రుచిగల కటిక విషం నువ్వే సుమా
పెదవులపై చిరునవ్వుల దగా...
కనబడనీయవు నిప్పులసెగ
నీటికి ఆరని మంటల రూపమా
నీ ఆటేమిటో ఏ నాటికి ఆపవు కదా...
నీ బాటేమిటో ఏ జంటకి చూపవు కదా
తెంచుకోనీవు పంచుకోనీవు ఇంత చెలగాటమా
చెప్పుకోనీవు తప్పుకోనీవు నీకు ఇది న్యాయమా
పేరులో ప్రణయమా...తీరులో ప్రళయమా
పంతమా....బంధమా..

చిత్రం : సంతోషం
పాట పల్లవి : నే తొలిసారిగా కలగన్నదీ నిన్నేకదా

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు



**23**

### హెచ్చరిక

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





## జరిగినకథ

వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లీ కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పాలెక్కువై పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో ప్రాయశ్చిత్తం చేయించాలన్న పక్కింటి అండాళ్ళమ్మ సలహా విని వెంకట్రావు పురోహితుడు శాస్త్రిని కలుస్తాడు. శాస్త్రి వెంకట్రావు ఇంటికి వచ్చి నరకబాధల బూచిచూపి ఇరవై వేల రూపాయల ఖర్చుతో శాంతి చేయించాలంటాడు. గత్యంతరం లేక ఒప్పుకున్న వెంకట్రావు దంపతులచేత తూతూ మంత్రాలతో పూజలు చేయించి దోచుకుంటాడు. జరిగిన తతంగమంతా తన కొలీగ్ నారాయణకు చెప్తాడు వెంకట్రావు. ఇదంతా మీ ఇంటి వాస్తు బాగా లేకపోవటం వల్లే జరిగిందని, వాస్తుభూషణరావుని కలిస్తే ఫలితం ఉంటుందన్న నారాయణ సలహా మేరకు వాస్తు భూషణరావు ఇంటికి వచ్చి లైనులో నిలబడతాడు వెంకట్రావు. ఎంతసేపటికి లైను కదలదు. అక్కడకు వచ్చిన వారందరికి ఆకలి దహించి వేస్తూ వుంటుంది. అయినా పెసర్దోస్ గ్రూపు వారు చెప్పిన ధరలు విని కొనటానికి ఎవరూ సాహిసించరు. (ఇక చదవండి)

"హెడ్డాఫీసునుంచే"
"అక్కడినుంచే"
"అయ్యో"
"హు.. ఇలాగైతే ఇహ మనం అడుక్కు తిని పోవల్సిందే"

ఇలా కామెంట్లు చేస్తున్నారు వాళ్ళు. వినే వాళ్ళకేమీ అర్థం కావడంలేదు.

మెసేజ్ రావడం పూర్తయింది.

ఆ మెసేజ్ చదివిన మేనేజర్ 'ఛీ' అని నలిపి అవతల పడేసి ముఖం గంటు పెట్టుకున్నాడు.

"ఏమైంది బాబూ" అడిగాడొకాయన.

"ఏముంది! దరిద్రం. షేర్ ఇండెక్స్ బాగా పెరిగిందట. భారత్ నుంచి ప్రతి రోజూ పది లక్షల కోళ్ళు, బంగ్లాదేశ్ నుండి ఐదులక్షల మేకలు, పాకిస్తాన్ నుండి రెండులక్షల పందులు, చైనా నుండి లక్ష కిలోల చేపలు, జపాన్ నుండి రెండు లక్షల కిలోల ఎండ్రకాయలు, సింగపూర్ నుంచి రెండు టన్నుల ఎర్రచీమలు, రష్యా నుంచి పన్నెండు టన్నుల కప్పలు దిగుమతి చేసుకోవడానికి జర్మన్ ప్రభుత్వం ఆ దేశాలతో ఒప్పందాలు కుదుర్చుకుందట. అరగంట క్రితమే అగ్రి మెంట్ల మీద అందరు విదేశాంగ మంత్రులు సంతకాలు చేశారట. అందువలన జర్మనీలో కోళ్ళ రేటు బాగా పడిపోయిందట. ప్రతి చికెన్ అయిటమ్ మీద టూ పర్సెంట్ డిస్కౌంట్ ఇమ్మని మెసేజ్ వచ్చింది." చెప్పాడు మేనేజర్.

ఏదో మహాద్భుతం కళ్ళముందు జరుగు తున్నట్లు వింత పడుతున్నారందరూ.

"జర్మనీలో కోళ్ళరేట్లు తగ్గడమేంటో, దానికి హైదరాబాద్‌లో డిస్కౌంట్ ఇవ్వడమేంటో నాకు అంత అయోమయంగా ఉన్నది. నాబుర్ర తిరిగి పోతున్నది. ఇక నేను మరణిస్తే బాగుంటుంది." బుర్ర తిరిగి పడిపోయాడొకాయన.

"ఇలా డిస్కౌంట్లిస్తే మా గతేం కాను?" దీన వదనంతో అన్నాడు మేనేజర్.

'డిస్కౌంట్' అన్నమాట వినిపించగానే అందరికీ పూనకం వచ్చేసింది.

"ఒక ప్లెయిన్ రైస్" అందరి కంటే ముందు అరిచాడు వృద్ధుడు.




"ఒక చికెన్ బిర్యానీ"
"వన్ మటన్ పలావ్"
"వన్ కర్డ్ రైస్"

కేకలు పెట్టసాగారు అందరూ.

వెంకట్రావు అవాక్కయ్యాడు.

గాంధీని, పొట్టిశ్రీరాములును స్మరించిన వారు, ఐకమత్యమే మహాబలమని, మన ఐక్యత చూసి పారిపోతున్నారు అని అందరికీ సలహా ఇచ్చి రెచ్చగొట్టిన వృద్ధుడే మొదటి ఆర్డరు ఇవ్వడం వెంకట్రావుకు కోపాన్ని తెప్పించింది.

"ఏవండీ.... ఐకమత్యమే మహాబలం అని చెప్పిన మీరే ఇలా ఆర్డరివ్వడం బాగుందా" కోపంగా అన్నాడు వృద్ధుడితో.

"అవును నాయనా ఐకమత్యమే మహా బలమన్న పెద్దలే బతికుంటే బలుసాకు తిన వచ్చని కూడా చెప్పారు. పెద్దలు చెప్పిన మాటలు మనకెల్లప్పుడు శిరోధార్యాలే. ఇందాక టిఫిన్ చేశాం కాబట్టి ఐకమత్యమే మహాబలం సూత్రం వర్తిస్తుంది. ఇపుడు ఆకలికి తాళలేక ప్రాణం పోయే పరిస్థితుంది కాన బతికుంటే బలుసాకు తినవచ్చనే సామెత వర్తిస్తుంది. సమయానుకూలంగా సామెతలను అన్వయించుకునే వాడే బుద్ధిమంతుడు" చల్లగా చెప్పాడు వృద్ధుడు.

గాంధీ, నెహ్రూ, పొట్టిశ్రీరాములు లాంటి వారు ఎందుకు మహాత్ములయ్యారో, ప్రాతః స్మరణీయులుగా ఎందుకు మిగిలి పోయారో స్పష్టంగా అర్థమైంది వెంకట్రావుకు.

అలా అనుకుంటుండగానే వెంకట్రావు ఆత్మారాముడు చిందులెయ్యసాగాడు. తానింకా కేకలు వెయ్యనందుకు తిట్టిపోయ సాగాడు యజమానిని. తానేమీ మహాత్ముడిని కానని గుర్తించిన వెంకట్రావు 'వెజిటబుల్ బిర్యానీ' అని పెద్దగా అరిచాడు.

క్షణాలలో బండిలోని గిన్నెలు ఖాళీ అయ్యాయి జనం జేబులు కూడా ఖాళీ అయ్యాయి.

"సాయంత్రం అయిదు గంటలకు స్నాక్స్ ఉంటాయి సార్" వార్నింగిచ్చి వెళ్ళిపోయారు బండివాళ్ళు.

ఆమాట వినగానే దడువు జ్వరాలొచ్చాయి అందరికీ.

"ఇక మనమేమీ ఆర్డరివ్వకూడదు" త్రేన్పుతూ అన్నాడు వృద్ధుడు.

"సాయంత్రం అయిదు గంటలదాకా" వ్యంగంగా అన్నాడు వెంకట్రావు.

వృద్ధుడి ముఖం మాడింది.

క్యూలో మరో నూటేభైమంది దాకా ఉన్నారు.

సాయంత్రం అయిదైంది.

గంటలు మోగించుకుంటూ బండివాళ్ళు వచ్చారు.

నిమ్మకాయ సైజులో ఉన్న మైసూర్ బజ్జీలు, రెండంగుళాల పొడవున్న మిర్చి బజ్జీలు, రేగిపళ్ళ సైజు పునుగులు ఉన్నాయి.

"ఎంత బాబూ" అడిగాడు వెంకట్రావు.

"మైసూర్ బజ్జీ ప్లేట్‌కు నాలుగు సార్. ప్లేట్ అరవై రుపాయలు, మిర్చి బజ్జీ రెండు నలభై రూపాయలు. పునుగులు ప్లేట్‌కు మూడుంటాయి. ముప్పై ఆరు రూపాయలు. ఆనియన్స్ కావాలనుకుంటే ప్లేట్ ఇరవై రూపాయలు." చెప్పారు వాళ్ళు.

నాకో ప్లేట్ మైసూర్ బజ్జీలివ్వు" అన్నాడు వెంకట్రావు.

"నాకు మిర్చి"
"నాకు పునుగులు"

మిగిలిన వారంతా కోరస్ పాడారు.

పదిహేను నిముషాలలో బండి ఖాళీ అయింది.

* * * *

తెల్లవారు జామున మూడున్నర గంటలకు వాస్తుభూషణం రూమ్‌లోకి ప్రవేశించే అవకాశం దొరికింది వెంకట్రావుకు.

వెంకట్రావు ముందు టైపిస్తున్నాడు.

చెప్పు నాయనా, ఏమిటి నీ సమస్య?"



టైపిస్టునడిగాడు వాస్తుభూషణం.

"స్వామీ... నాకు పెళ్ళై పదిహేనేళ్ళ యింది."

"అందుకు నా బాధ్యతేమైనా ఉందా నాయనా? అది నీ ఖర్మ"

"లేదు స్వామీ.."

"మరి నీ సమస్య?"

"ఇంత వరకూ పిల్లలు లేరు."

"నీ ఇంటికి ఈశాన్య వాస్తు దోషముంది నాయనా."

"నాకంటే ముందు ఆ ఇంట్లో ఉన్నాయనకు పన్నెండు మంది పిల్లలున్నారు స్వామీ."

"ఒక్క సంతానం కూడా ఉండకూడని ఇంట్లో పన్నెండు మంది పుట్టారంటే అదీ వాస్తుదోషమే నాయనా."

"నా ఇంటి ప్లాను చూసి ఏంచేయాలో చెప్పండి."

"ఈశాన్యం వైపు గోడ ఎత్తైంది నాయనా దాన్ని రెండంగుళాలు ఎత్తు తగ్గించు సంతానం కలుగుతుంది."

"థాంక్సండీ. ఫీజు......"

"ఐదువేలు కౌంటర్లో కట్టి వెళ్ళు నాయనా, రసీదు మెయిన్ గేట్లో చూపిస్తే బయటకు వెళ్ళనిస్తారు."

ముఖం మాడ్చుకుని బయట పడ్డాడు టైపిస్టు.

వెంకట్రావు వంతు వచ్చింది.

చెప్పు నాయనా ఏమిటి నీ సమస్య." అడిగాడు. వాస్తుభూషణం.

స్వామీ.. ఈ మధ్యనే పదిలక్షలు పోసి ఇల్లు కొన్నాను.

"శుభం."

ఏం శుభమో ఏమో.. ఇల్లు కొన్నప్పటి నుంచీ అన్నీ అశుభాలే."

"ఇంట్లోకి ఒక ఎలుక వచ్చింది."

"ఇల్లన్న తరువాత ఎలుకలు, బొద్దింకలు రాకుండా ఉంటాయా నాయనా? అవేమైనా కాకులా పిచ్చుకలా గూళ్ళు కట్టుకుని ఉండటానికి? వాటికి ఒక ఇల్లు ఉండాలి కదా?"

"అది కాదు స్వామీ... ఆ ఎలుక ఇంట్లో గుడ్డలన్నీ కొరికేసింది."

"అందులో విచిత్రం ఏముంది నాయనా? ఎలుకలు గుడ్డలు కొరకక కుర్చీలు బీరువాలు




కొరుకుతాయా? అది వాటి సహజగుణం ఏదైనా మందు పెడితే పోయేది."

"పెట్టాం స్వామీ. కానీ...."

"ఎలుక ఆ మందు తిన్నా చావలేదా?"

"మందు తిన్నదో లేదో కానీ ఆ మందును మాపాప తిన్నది వెంటనే వాంతులు, విరేచనాల య్యాయి."

"మరి ఎలుకల మందు తింటే వాంతులు విరేచనాలు కాక గర్భాలు, ప్రసవాలు వస్తాయా నాయనా?" హాస్పటల్‌కు తీసుకెళ్తే సరి పోయేది."

"తీసుకెళ్ళాం స్వామీ. మందులు ఖర్చు పధ్నాలుగువేలైంది."

"ఆ డాక్టర్ చాలా మంచి వాడులా ఉన్నాడు. అదే ఎన్నారైలు కట్టించిన హాస్పిటల్‌కు వెళ్ళుంటే మీ ఇల్లు అమ్మేయాల్సివచ్చేది. తరువాత?"

"ఎలుక నివారణ కోసం పిల్లిని పెంచా మండీ. అది ఆడపిల్లి."

"ఏ పిల్లయినా ఎలుకను తింటుంది నాయనా , అది వాటి సహజగుణం. మరి అది ఎలుకను చంపిందా?"

"చంపింది స్వామీ. కానీ అది కడుపుతో ఉన్న పిల్లి."

"సృష్టిలో స్త్రీ లింగానికే కడుపొస్తుంది నాయనా. అందులో వింతేముంది? అది సహజం దాన్ని ఎక్కడైనా వదిలి పెట్టివస్తే సరిపోయేది. అది కుక్కలా విశ్వాసమున్న జంతువు కాదు కదా తిరిగి రావడానికి!"

వదిలేసొద్దామనే అనుకున్నాను. కానీ అది ఈ లోపలే ఆరు కూనలను ఈనింది."

"కడుపుతో ఉన్నమ్మ కనక మానుతుందా నాయనా! అందులో వింతే ముంది?"

"కంటే కన్నది.. కానీ వాటిలో ఒక కూన చచ్చింది స్వామీ."

"అదే సృష్టి విలాసం నాయనా. పిల్లులు, కుక్కలు, పందులు ఈనిన పిల్లలన్నీ బతికితే అవి ఉండటానికి ఈభూగోళం సరి పోదు నాయనా. ఏ ఒకటో రెండో బ్రతుకుతాయంతే."

"పిల్లిని చంపితే లేదా ఇంట్లో చచ్చి పోతే మహాపాపం అని ఇరుగుపొరుగు చెప్పారు స్వామీ."

"జీవహింస మహాపాపమని బుద్ధ భగవానుడు మొదలగు వారు చెప్పింది వినలేదా నాయనా?" ఏదైనా శాంతి చేయిస్తే పోయేది కదా."

"అదే చేయించాం స్వామీ. అదే మా పాలిట పెద్ద అశాంతై పోయింది. మా కొంప గుల్ల చేసింది. శాంతి ఖర్చు ముప్పై వేలైంది. ఇలా ఖర్చు మీద ఖర్చు వచ్చి అల్లాడి పోతున్నాను స్వామీ."

"ఏదైనా వాస్తులోపం ఉంటేనే ఇలా ధన నష్టాలు వస్తుంటాయి. ఎవరికైనా వాస్తు చూపిస్తే పోయేది."

"అందుకే మీ దగ్గరకొచ్చాను స్వామీ."

ఇప్పుడు దార్లోకి వచ్చావు. మనదేశంలో చాలా మందికి ఇల్లు కట్టుకునేటపుడు వాస్తు చూపించాలంటే నిర్లక్ష్యం. ఇలా నష్టాలొచ్చి నపుడు మాత్రమే వాస్తు పండితుల వద్దకు వెళ్తారు.

"రోగం వచ్చినపుడే కదా స్వామీ డాక్టరు దగ్గరకు వెళ్ళేది?"

"నిజం నాయనా.. రోగం వచ్చినపుడు డాక్టరు వద్దకు వెళ్ళడానికీ రోగం ముదిరిన తరువాత వెళ్ళడానికి చాలా తేడా ఉంది నాయనా. నువ్వు చెప్పిన దాన్ని విన్న తరువాత రోగం చాలా ముదిరిందని అర్ధమౌతున్నది. ఇంటి ప్లాను తెచ్చావా నాయనా?"

**-(ఇంకావుంది)**






## 'తన్హాదిల్...'తో శ్రోతలకు దగ్గరయిన

# షాన్

| | | |
|---|---|---|
| **అసలు పేరు** | : | శాంతనూ ముఖర్జీ |
| **ముద్దు పేర్లు** | : | ఇంట్లోను, చిన్నప్పటి స్నేహితులకు'రాజా', స్కూల్‌లో స్నేహితులకు 'శాంతనూ', ఇప్పటి సంగీత ప్రపంచానికి 'షాన్'. |
| **పుట్టిన తేది** | : | 30 సెప్టెంబర్, 1972 |
| **రాశి** | : | లిబ్ర (తుల) |
| **జన్మస్థలం** | : | ముంబాయి (బాంద్రా) |
| **చదువు** | : | బాంద్రా హైస్కూల్ చదువు, నేషనల్ కాలేజీ బాంద్రాలో ఇంటర్, చర్చ్‌గేట్ జైహింద్ కాలేజీలో డిగ్రీ చదువు. |

**గాయకుడు కాకముందు:** ఎన్నో ఎన్నెన్నో....

**ఉదాహరణకు :**

ఒకటి నుండి ఎనిమిదో తరగతి వరకూ ప్రైవేట్ ట్యూషన్స్
కేబుల్ టీవీ కనెక్షన్స్ ఇప్పించటం
'ఎక్స్' అనే రెడీమేడ్ బట్టల దుకాణంలో సేల్స్‌మెన్
విజయ్‌ముఖీ కంప్యూటర్ ఇన్‌స్టిట్యూట్ కోసం 'లోటస్ 123 3:1 పుస్తక రచన.
స్నేహితులతో కలిసి 'పేజ్ ప్లానర్స్' పేరుతో డిటిపి యూనిట్ ప్రారంభించి ప్రింటింగ్, గ్రాఫిక్స్, పేజ్ డిజైన్ వర్క్స్ చేపట్టడం...

**పాటలు, లైవ్‌షోలతో పాటుగా నిర్వహించిన టెలివిజన్ కార్యక్రమాలు :**

ద మస్ట్ మస్త్ షో ఇఎల్‌టీవీ (జీ)లో 68 ఎపిసోడ్స్, బిపిఎల్ ఓయే - ఛానల్ 'వి' కోసం 7 ఎపిసోడ్స్
టెలీ -హౌజీ -ఇన్ ముంబాయ్ కోసం 9 ఎపిసోడ్స్, తాల్ మాల్ కా సవాల్ డి.డి. కోసం 21 ఎపిసోడ్స్
స రి గ మ ప షో జీటీవీ కోసం...

**నటనలో :** 'సప్నో' అనే బెంగాలీ టెలీఫిలిమ్‌లో వర్ధమాన కళాకారుడి పాత్రను పోషించాడు. సవ్యసాచిరాయ్ దర్శకత్వంలో రూపొందిన టెలీఫిల్మ్ 'ఆల్ఫా బంగ్లా' ఛానల్‌లో ప్రసారమైంది. కల్పనా లాజ్మీ రూపొందించిన 'దమన్' చిత్రంలో ఓ చిన్న పాత్ర పోషించాడు.

కొన్ని కళలు పుట్టుకతోనే అబ్బుతాయంటే కొందరు అంగీకరించరు కానీ ఇందులో వాస్తవం ఉందనే అనిపిస్తుంది. బహుశా తల్లిదండ్రుల జీన్స్ నుండి అవి పిల్లలకు చేరతాయేమో! 'తన్హాదిల్' ఇండీపాప్ ఆల్బమ్‌తో పాపులర్ అయిన షాన్‌ను చూస్తే ఇది నిజం అనిపిస్తుంది. మనిషి శరీరంలో రక్తంతో కలిసి సంగీతం ప్రవహిస్తున్నపుడు అతను పాడకుండా ఎలా ఉండగలడు! పైగా తండ్రి నుండి ఆ సంగీతాన్ని వారసత్వంగా పుచ్చుకున్నప్పుడు వేరే పనిమాత్రం ఎలా చేయగలడు! ఇది షాన్ విషయంలోజరిగింది. సంగీతంతో చిన్నతనం నుండి పరిచయం ఉన్నా షాన్ యుక్త వయసులో 'ఇది' తప్ప అన్నీ చేశాడు. ట్యూషన్లు చెప్పాడు, కేబుల్ టీవీ కనెక్షన్లు ఇచ్చే పనిచేశాడు. చివరకు రెడీమేడ్ షాప్‌లో బట్టల్ని విక్రయించాడు, స్నేహితులతో కలిసి డి.టి.పి. (డస్క్ టాప్ పబ్లిషింగ్) వర్క్ చేశాడు. కానీ అతని హృదయాంతరాలలో సంగీతం ప్రతిధ్వనిస్తుంటే... దానికి స్పందించకుండా ఎలా ఉంచగలడు! చివరకు వీటన్నింటినీ కట్టిపెట్టి సంగీతం వైపే దృష్టి సారించాడు. ఈ ప్రయాణంలో ఎత్తుపల్లాలను చవిచూసినా 'తన్హాదిల్' ఆల్బమ్ తర్వాత అతను ఇండీపాప్‌లో 'షాన్'గా నిలిచాడు.



భార్య రాధికతో షాన్

అతని గతంలోకి ఓసారి తొంగిచూస్తే - షాన్ అసలు పేరు శాంతనూ ముఖర్జీ. తల్లి సోనాలీ ముఖర్జీ, చక్కగా పాటలు పాడుతుండేది. తండ్రి మానస్ ముఖర్జీ సంగీత దర్శకుడు. 'షాయద్', 'అల్బర్ట్ పింటో కో గుస్సా క్యోఁ ఆతా హై' చిత్రాలకు సంగీతాన్ని సమకూర్చారాయన. అందువల్ల షాన్‌కు చిన్నతనం నుండే సంగీత ప్రపంచంతో పరిచయం ఉంది. కానీ శాస్త్రీయ సంగీతాన్ని ఎవరి దగ్గరా నేర్చుకోలేదు. కాస్త ఎదిగాక వాణిజ్య ప్రకటనలలో జింగిల్స్ పాడడం మొదలుపెట్టాడు. అలానే రీ-మిక్స్ పాటల్ని పాడాడు. షాన్ చెల్లెలు సాగరిక కూడామంచి గాయని. దాంతో ఇద్దరు కలిసే పాటల్ని పాడసాగారు. ఈ ప్రయాణంలో వారి తొలి ఆల్బమ్ 'ఊర్జా'. 1995లో షాన్, సాగరిక మరి కొందరు స్నేహితులతో కలిసి విడుదల చేసిన ఆల్బమ్ ఇది. అదే సంవత్సరం రీ-మిక్స్ ఆల్బమ్ 'రూప్ ఇన్‌కా మస్తానా' అనే ఆల్బమ్‌ను విడుదల చేశారు. ఆర్.డి.బర్మన్ పాటల రీ-మిక్స్ బాగానే పేరు తెచ్చింది. రీమిక్స్ గురుగా పేర్గాంచిన బిడ్డూ ఆధ్వర్యంలో ఈ ఆల్బమ్ రూపుదిద్దుకుంది. ఈ విజయోత్సాహంతో షాన్ - సాగరిక 1996లో 'నవజవాన్' ఆల్బమ్ విడుదల చేశారు. కానీ దీనికి సంగీత ప్రపంచం నుండి సరైన స్పందన లభించలేదు. 1997లో షాన్ తన సోలో ఆల్బమ్ 'లవాలజీ' విడుదల చేశాడు. దీనికి స్పందన కరువైంది. ఇండీపాప్‌లో ఇతనూ నలుగురిలో ఒకడే అనే విమర్శలు వచ్చాయి. అదే సంవత్సరం 'రీజన్ టు స్మైల్', 1998లో 'డాన్స్ మస్తీ' ఆల్బమ్స్‌లో షాన్ పాటలు పాడాడు. కానీ పేరైతే పెద్దగా రాలేదు. ఇలా కెరీర్ అవరోహణ క్రమంలో నడుస్తున్న సమయంలోనూ షాన్ నిరుత్సాహానికి గురికాలేదు. తనలోని సత్తానుచాటుకునే ఆల్బమ్‌ని రూపొందించే పనిలో నిమగ్నమయ్యాడు. ఆ ఫలితమే 'తన్హాదిల్' ఆల్బమ్. 2000వ సంవత్సరంలో విడుదలైన ఈ ఆల్బమ్‌తో షాన్ ఘన విజయాన్ని సొంతం చేసుకున్నారు. అప్పటివరకూ అతనితో దోబూచులాడిన విజయలక్ష్మి అతన్ని వరించింది. ఎనిమిది పాటల ఈ ఆల్బమ్‌లోని అన్ని పాటలనూ షాన్ తనే రాసుకుని, పాడారు. చాలా వారాల పాటు ఎంటీవీ మ్యూజిక్ ఛార్ట్‌లో 'తన్హాదిల్' ఆల్బమ్ చోటు చేసుకుంది. అంతేకాదు ఎంటీవీ ఏషియన్ అవార్డులలో పాప్ కేటగిరిలో ఫేవరెట్ ఇండియన్ ఆర్టిస్ట్‌గా షాన్



ఎంపికయ్యారు. స్క్రీన్ వీడియోకాన్ బెస్ట్ పాప్ ఆల్బమ్ అవార్డునూ 'తన్హాదిల్'తో షాన్ గెలుచుకున్నాడు. ఈ విజయంతో షాన్ సీనియర్ గాయనీ గాయకుల జాబితాలోకి చేరిపోయాడు. ఆ తర్వాత షాన్ 'దేసీ బోయ్జ్', 'భూల్ జా', 'హమ్ బేవఫా' ఆల్బమ్స్ విడుదల చేశాడు. అతని తాజా ఆల్బమ్ 'అక్సర్ షాన్'కూ చక్కటి స్పందన లభించింది. దీనిలోని పాటల్ని సొంతంగా కంపోజ్ చేసుకున్న షాన్ తన భార్య రాధికకు ఈ ఆల్బమ్‌ను అంకితమిచ్చాడు. అనుకోకుండా డిస్కోథెక్‌లో కలుసుకున్న షాన్, రాధికలు దాదాపు నాలుగేళ్ళ ప్రేమాయణం తర్వాత పెద్దల అంగీకారంతో వివాహం చేసుకున్నారు. రాధిక రాకతో తన జీవితంలో ఎన్నో మార్పులు వచ్చాయని, ఓ పద్ధతిగా జీవించడం మొదలు పెట్టానని షాన్ చెబుతుంటాడు. ఇప్పుడు వాళ్ళకి సోహం అనేక కొడుకూ ఉన్నాడు.

## నేపథ్య గాయకుడిగా...

పాప్, రీమిక్స్ పాటలతో పాటుగా షాన్ సినీ నేపథ్య గాయకుడిగానూ రాణించాడు. 'ప్యార్ మే కభీ కభీ' చిత్రం ద్వారా సినీ నేపథ్య గాయకుడిగా షాన్ అరంగేట్రం చేశాడు. ఆ సినిమా 'ముసు ముసు...', 'వాహ్... పెహలీబార్...' అనే పాటల్ని పాడాడు. ఆ తర్వాత అజయ్ దేవగన్ సొంత చిత్రం 'రాజు చాచా'లోనూ పాడే అవకాశం వచ్చింది. అయితే తొలిసారిగా అదేష్ శ్రీవాస్తవ సంగీత దర్శకత్వంలో 'బస్ ఇత్నాసా ఖ్వాబ్ హై' చిత్రంలో అయిదు పాటలు పాడాడు షాన్. సినిమా పరాజయం పాలైనా, షాన్‌కు నేపథ్య గాయకుడిగా చక్కటి గుర్తింపే వచ్చింది. ఆ తర్వాత 'అశోక', 'దిల్ చాహ్‌తా హై', 'లగాన్', 'ఇండియన్' 'రెహనా హై తేరే దిల్ మే', 'వన్ టు కా ఫోర్', 'దిల్‌నాపన్' తదితర చిత్రాలలో షాన్ పాటలు పాడాడు. తెలుగులోనూ కీరవాణి సంగీత దర్శకత్వంలో 'యువరత్న' చిత్రంలోని 'టేకిట్ ఔట్ టేకిట్ ఔట్ నీది 98480 నాది 98490' అనే పాటను, దేవిశ్రీ ప్రసాద్ సంగీత దర్శకత్వంలో 'మన్మథుడు' చిత్రంలోని 'చెలియా చెలియా చెయిజారి వెళ్ళకే... సఖియా సఖియా ఒంటరిని చేయకే' పాటలను పాడాడు. అంతేకాదు కన్నడ, తమిళ, మలయాళ సినిమాల్లోనూ పాటలు పాడినా, తెలిసిన బాషలో పాటలు పాడటమే తనకిష్టమని చెబుతున్నాడు.

నేపథ్య గానానికి, పాప్ ఆల్బమ్‌లో పాడటానికి తేడాను షాన్ చెబుతూ, "నేపథ్య గీతమనేసరికి అది వేరొకరి కోసం పాడుతున్నట్టు. కాబట్టి ఆ పాటను అభినయించే నటుడిని దృష్టిలో పెట్టుకుని పాడాల్సి ఉంటుంది. పైగా సంగీత దర్శకుడి సలహాలు, సూచనలతో పాడాలి. అదే పాప్ గీతమైతే కాస్త స్వేచ్ఛ ఎక్కువగా లభిస్తుంది. అందువల్ల నేను నేపథ్య గీతాలు పాడటానికంటే ప్రైవేట్ పాటలు, పాప్ గీతాలు పాడటానికి ఎక్కువ ఆసక్తి చూపిస్తాను" అని అన్నాడు.

పాటలు రాసుకోవడం, కంపోజ్ చేసుకుని సొంతంగా పాడటం, వాటిని తనమీదనే చిత్రీకరించుకోవడమే కాదు ఇటు సినిమాలకు నేపథ్య గీతాలను ఆలపిస్తూ, మరోవైపు టీవీలో మ్యూజికల్ షోలను, దేశ విదేశాలలో లైవ్ మ్యూజిక్ షోలను నిర్వహిస్తూ షాన్ బిజీ బిజీగా ఉన్నాడు. త్వరలోనే అతని నుండి మరో మంచి పాప్ ఆల్బమ్‌ను మనం ఆశించవచ్చు.

**- వి.అరుణ సత్యవతి**

ఫిబ్రవరి 1 బ్రహ్మానందం పుట్టినరోజు సందర్భంగా...

# కళ్ళతో కామెడీ
# ఉత్తమ హాస్యానికి కొత్త ఒరవడి





'అతడే ఒక సైన్యం' చిత్రంలో ఆలీ, శివారెడ్డి, జగపతిబాబు, బ్రహ్మానందం

**ఆంగికం, వాచకం, సాత్వికం, ఆహార్యం ఈ నాలుగూ మంచి నటనకు సహకరిస్తాయని చెప్పారు పెద్దలు. వీటిలో ప్రస్తుతం నటనకు ఎక్కువగా ఉపయోగపడే ఆంగిక, వాచకాలకు సహకరించే చేతుల్ని బాండేజిలతో కట్టేసి, నోటికి ప్లాస్టరేసేస్తే నటించడానికి ఆ నటుడికి ఇంకేం వుంటాయి కళ్ళు తప్ప!!! ఆ పరిస్థితి ఒక హాస్యనటుడికి ఎదురైతే...కేవలం కళ్ళతోనే కామెడీని పలికించడం సాధ్యమా...!? సాధ్యమేనని నిరూపించాడు బ్రహ్మానందం - 'అతడే ఒక సైన్యం' సినిమాలో...!**

సాధారణంగా హీరోకి ప్రతికూలంగా పనిచేసే కమెడియన్ పాత్రకి - అనుకూలంగా ఉండే కమెడియన్ పాత్ర కన్నా ప్రేక్షకాదరణ తక్కువగా వుంటుంది. అటువంటి నెగిటివ్ షేడ్ పాత్రలో కళ్ళతో ఒప్పించడం, ప్రేక్షకుల్ని మెప్పించడం అంత సులువైన విషయమేం కాదు. అసలు పాతికేళ్ళుగా నంబర్‌వన్ కమెడియన్‌గా ఉండటమే మామూలు విషయం కాదు. ఇప్పటికే అరువందల సినిమాల్లో హాస్యపాత్రలు వేసీవేసీ ఉన్న ఓ నటుడికి తనలోని కళాకారుణ్ణి సవాల్ చేసే పాత్ర లభిస్తే ఎలావుంటుంది...!? తపన విజృంభిస్తుంది!! అదే జరిగింది బ్రహ్మానందం విషయంలో....

'అతడే ఒకసైన్యం' సినిమాలోని కామెడీకి జనం ఎంతగా పడిపడి నవ్వుతున్నారో - బైటికొచ్చాక బ్రహ్మానందం నటన గురించి పదేపదే చెప్పుకుంటున్నారు. 'ఈ సంవత్సరం నంది అవార్డు డెఫినిట్'అని నిర్ధారించేస్తున్నారు కూడా!

"మేం తీసిన సినిమాల్లో 'వినోదం' బ్రహ్మానందం గారికి మంచిపేరు తెచ్చింది, అందులో అస్సలు మాటలు లేకుండా ఆయన చేశారు. ఇక 'బావగారు బాగున్నారా' సినిమాకి చిరంజీవిగారు ఎంత ఎస్సెటో బ్రహ్మానందం కామెడీ అంత హెల్ప్ అయింది. ఈ 'అతడే ఒక సైన్యం' సినిమాలో బ్రహ్మానందం క్యారెక్టరు అనుకున్నప్పుడు పైన చెప్పిన రెండు పాత్రలూ మా మనసుల్లో మెదిలాయి. అంత రేంజ్‌కి వెళ్ళదగ్గ క్యారెక్టర్‌గా బ్రహ్మానందం పాత్ర రూపుదిద్దుకుంది. ఈ క్యారెక్టర్ గురించి బ్రహ్మానందంకి చెప్పగానే ఆయన కూడా తెగ ఇన్‌స్పైర్ అయ్యాడు. అలా ఇన్‌స్పైర్ అయితే నూటికి రెండు వందల పర్సంట్ న్యాయం చెయ్యగల టాలెంట్ అతనిది. అలాగే చేశాడు కూడా"అన్నారు 'అతడే ఒకసైన్యం' చిత్ర నిర్మాత శ్రీ కె.అచ్చిరెడ్డి, దర్శకుడు శ్రీ ఎస్.వి.కృష్ణారెడ్డి ముక్త కంఠంతో - ఏకగ్రీవంగా...!!

"నిజం చెప్పాలంటే - నేను చేసిన ఏ పాత్రకి మంచి పేరొచ్చినా - నాలో ఇంత టాలెంటుందా అని నాకే అనిపించేటంతగా - నాలో నటుణ్ణి మొట్టమొదట గుర్తించిన జంధ్యాలగారు గుర్తొస్తారు. ఆయనకి, ఆయన భవిష్యద్దృష్టికి ఎన్నిసార్లు నమస్కరించుకుంటానో ఆ దేవుడికే తెలుసు" అన్నారు బ్రహ్మానందం. 'అతడే ఒకసైన్యం'లో తన నటనకొస్తున్న రెస్పాన్స్ గురించి మాట్లాడుతూ

"ఈలెక్కన మీ నటజీవితంలో 'స్మైలురాయి'వంటి ఈ పాత్రని అభినందించడానికి వచ్చేవాళ్ళకి షేక్‌హ్యాండ్సులు ఇచ్చీఇచ్చీ మీ రెండు చేతులకీ కట్లుకట్టించుకుని, థేంక్సులు చెప్పలేక నోటికో ప్లాస్టరు అతికించుకుని కనిపించాల్సివస్తుందేమో!? అంది 'హాసం' సరదాగా

"నిజమేనండోయ్..." అన్నట్టుగా జవాబిచ్చారు బ్రహ్మానందం... కళ్ళతోనే !! ◆

(బ్రహ్మానందం నటించిన చిత్రాల వివరాలు లోపలి పేజీల్లో...)

రచన: సిరివెన్నెల (1) గానం : శంకర్ మహదేవన్, కల్పన

ఆ: చికుబుక్ పోరి చికుబుక్ పోరి
చిక్‌బుక్ పోరీ... చికుబుక్ పోరీ ఎవరే అతను...
చూపులు చూసి చిరుతపులేమో అనుకున్నాను
చిటికెలువేస్తే చుక్కలు రాలే సూపర్‌మేన్ ఇతను...
సూపర్‌మేన్‌కి ట్యూషన్ చెప్పిన మాష్టర్ వీరేను...
ఛాంఛాంఛాంకుఛక్కుఛాంఛాంఛా... ॥2॥

అ: అరెరే లేదంత సీను... నే సూపర్‌మేన్‌ని కాను...
అతిగా బడాయిపోను...సింపుల్‌గా బతికేస్తాను...
జిందగీ అన్నది బొత్తిగా చిన్నది
ఒక్కటే ఛాన్సిది...ఒదిలితే రాదిది
హాయిగా ఉండక దేనికి టెన్షన్...నో నో నో నో
లైట్‌గా లాగించేయ్ బేటా... లైఫ్‌లో ప్రతిపూటా
సీరియస్‌గా ఫీలయ్యేంత సీను ఏంవుందంటా...

కో: లైట్‌గా లాగించేయ్ బేటా... లైఫ్‌లో ప్రతిపూట
యమ సీరియస్‌గా ఫీలయ్యేంత సీను ఏం వుందంటా...

చ :కష్టాలొస్తే ఏడుపువల్ల జరిగేదేముంది
మొహంలో గ్లామర్ పోతుంది తలంతా భారం అవుతుంది
ఆకాశం తెగిపడిపోతే ఏంచేయాలన్నట్టు
అలా తెగ ఆలోచించొద్దు నువ్వేదో ఆపేసేటట్టు
హ్యాపీగా...తాపీగా... ॥2॥ నువ్వాడిందే ఆటనుకుంటూ
నువ్ పాడిందే పాటనుకుంటూ హోయ్
లైట్‌గా లాగించేయ్ బేటా లైఫ్‌లో ప్రతి పూటా...
సీరియస్‌గా ఫీలయ్యేంత సీను ఏంవుందటా కో॥లైట్‌గా॥

ఆ: ఓహో ఓఓహో ఓహో ఓఓహో ఓహ్ ॥2॥

అ: సీతాకోక చిలకా వామ్మో ఏంటీ ఈ సర్కస్సు
అదంతా డ్యాన్సేకాబోసు...వారేవా అందామాబాసూ
ఎల్కేజీలో కుట్టించావా పాపా ఈ డ్రస్సు
మతోయిందంటే ప్రామిస్సు చిరుగ్గా లేదా ఓమిస్సూ...
తాతయ్యో...తకతయ్యో...॥2॥
తేరగచూస్తే సరిపోదయ్యో బీపి పెరిగి పడతావయ్యో హో...
లైట్‌గా లాగించేయ్ బేటా లైఫ్‌లో ప్రతిపూట సీరియస్‌గా
ఫీలయ్యేంత సీను ఏంవుందటా... కో॥లైట్‌గా॥

రచన: భువనచంద్ర (3) గానం : ఎస్.పి.బాలు.కల్పన

అ: అబ్బో నీ అమ్మ గొప్పదే అందం పోగేసి కన్నదే... ॥2॥
పరువాలు పొదిగిన చిలకా చలిజోరువున్నది కనక
జతగా శృతిగా ఇక నువ్వునేను ఒకటైపోయి పాడేద్దామా సరిగమపా

ఆ: అమ్మో ఏరాణి కన్నదో ఎదలో ఏ మొక్కుకున్నదో ॥2॥
జగదేకవీర కుమారా... వలచాను నిను మనసారా
కనరా కనరా నా వన్నె చిన్నెలన్నీ నీవే కన్నె చేయి విడవకురా...

అ: పూల బుతువిదే కోమలీ తీర్చమన్నదే ఆకలి

ఆ: ఆశ ముదిరిన వేళలో శ్వాస పరుగులు తీయదా

అ: తనువింతై అంతై తెర దించై దించైమంటే విడువగ నాతరమా

ఆ: సొగసింతై అంతై దారికొచ్చై వచ్చైమంటే నిలువగ నాతరమా

అ: తమకాలు విడువవు గనుక తడి చీర బిగిసెను గనుక
చెలియా చెలియాఇక ఉల్లాసంగ ఆడేద్దామా ఉయ్యాలాట కేమొలకా.

ఆ: అమ్మో ఏం కొంటెపిల్లడో... ఏమా సన్నాయి నొక్కుడో ॥2॥
కసిమీద ఉన్నడు గనుక పస చూడమన్నడు గనుక
ముడిలా ఒదిగి ఇక చూపిస్తాలే
వయ్యారాల ఆటుపోటు తడబడక

ఆ: భారమైనది నా యెద - జారుతున్నది పయ్యెద

అ: చేరుకున్నదే తుమ్మెద - దోచి పెట్టవె సంపదా

ఆ: ఒళ్లు తుళ్లి తుళ్లి ఆగి మళ్లీ మళ్లీ సరసానికి త్వరపెడితే

అ: ఒసే బుల్లి బుచ్చీ... నిన్ను గిల్లీ గిచ్చీ ఒడిదాటికి ఎగబడితే

ఆ: హృదయాలు కలిసెను గనుక సుఖమేదో కలిగెను గనుక
ప్రియుడా... ప్రియుడా... అరె మళ్లీ మళ్లీ సాగించేస్తా ఏం
సందిట్లోన సరిగమపా

అ: అబ్బో నీ అమ్మ గొప్పదే అందం పోగేసి కన్నదే... ॥2॥

రచన: సిరివెన్నెల (2) గానం : కార్తిక్.షాలినీ సింగ్

కో: షలలాయ్ షలలాయ్ లాయ్ లాయ్ ॥2॥

అ: గుమ్మా గులాబీ కొమ్మా...బంగారు బుట్ట బొమ్మా
నాజూకు నడుమా నీ సోకు తడిమా
చూసావా నా మహిమ ఇంక ఈపైన సుఖపడుమా

ఆ: లేలేత పూలకొమ్మా...నీ చేత వాలినమ్మా నిన్నాపతరమా...
సుడిగాని గుర్రమా... మనసైన మగతనమా...
ఇంక మొహమాట పడకమ్మా...

అ: కొంటె ఆపదా...నిన్ను ఆపెదా

ఆ: గండు తుమ్మెద...అంత నెమ్మదా

అ: చూడచక్కనమ్మా...వేడి చెక్కిలమ్మా...
వచ్చి నా ముద్దులందుకోమ్మా...

ఆ: నిన్ను చూడగానే భలే బీమా నా వెన్ను మీదపాకే చలిచీమా...

అ: జున్ను ముక్కలాంటి కన్నె భామా
నీ సున్నితాలు కన్నుకొట్టెనమ్మా...

అ: సూర్యుడైనా చూడనట్టి సోకా చూపుదాటలేదే నిన్నదాకా
ఇంతలోనే ఎందుకే ఇలాగ పెరిగిందే ఇంక తుంటరి కాక

ఆ: రాసిపెట్టివున్న వాడి రాక రాచలీవి తోటి చేరుకోక
ఆశపుట్టి ఆగలేక దూకా లారిలల్లాలల్లాలాయ్ లాయ్

అ: బరువా...ఈ కాస్తకోక బిగువా ఈ చిట్టిరైక పరువా...
నీ పరుగులింకా ఒడిదుడుకా

ఆ: నడిపే ఓ తోడు లేక నడుమే అల్లాడిపోగా
నడిపే నా వయసు నన్ను నీవెనుకా

అ: అల్లరెందుకు...నన్ను అల్లుకో...

ఆ: వేలుపట్టుకో కన్నెలేలుకో

అ: ఉన్నదిచ్చుకోగా విన్నవిచ్చుకోగా ఇంతహంగామా అవసరమా...

ఆ: ॥ఏయ్ నిన్ను॥ ॥లేలేత॥

కో: ఊ ఊ అ: అయ్యాయే ॥3॥

ఆ: జాణ జంటలేని బ్రహ్మచారి వానజాడలేని గాఢదారి
నన్ను చుట్టుకుంటే ఒక్కసారి చూపిస్తా నీకు పువ్వుల దారి

అ: ఒంటితోడు ఓపలేని నారి అగ్గిమీద గుగ్గిలంలా చేరి
కమ్ముకుంటే కందిపోవ పోరి ఏయ్ లారిలల్లాలల్లాలలాయ్

ఆ: ఇంద్ర శ్రీ రంగనాథ... అంటూ
నీ గుండెమీద వాలి పూదండ కానా ఇకమీద

అ: పొంగే ఓ గంగ వరద ఏదే
నీ సిగ్గు పరద చిందే నీ చెంగు సరదా తీర్చేదా...

ఆ: ఈడు పంచుకో... వాడి దించుకో

అ: ప్రాయమిచ్చుకో...హాయి పుచ్చుకో

ఆ: బాధ మర్చిపోగా ఆదరించు బాగా
ఆదుకోరాదా చందమామా

అ: జున్ను ముక్కలాంటి కన్నె భామా నీ సున్నితాలు కన్నుకొట్టెనమ్మా...

ఆ: నిన్ను చూడగానే భలే బీమా నా వెన్ను మీదపాకే చలిచీమా...



రచన: చంద్రబోస్ **4** గానం : శంకర్ మహదేవన్,గంగ

కో: ఓం శాంతి ఓం ఓం శాంతి ఓం
ఓం శాంతి ఓం ఓం శాంతి ఓం ॥3॥
ఆ: ఏడుకోట్ల ఈ ఆంధ్రుల్లో మూడుకోట్ల ముద్దాటల్లో
ఈడు కోరినది నిన్నే ఆలిన్ వన్
అ: ఏడు గంటలకు చీకట్లో వేడి కోరికల బ్రాకెట్లో
జోడి కట్టినది నువ్వే బంపర్ క్వీన్
కో : ఓ.. ఓ... ఆ: వెంటతిప్పిస్తాన్...
కో : ఓ.. ఓ... ఆ: వణుకు తెప్పిస్తాన్...
కో : ఓ.. ఓ... ఆ: వయసు నీకై అర్పిస్తాన్
కో : ఓ.. ఓ... అ: మొదలు కొప్పిస్తాన్...
కో : ఓ.. ఓ... అ: ముడులు విప్పిస్తాన్...
కో : ఓ.. ఓ... అ: పెదవ నిన్నేమెప్పిస్తాన్
ఆ: సోకిస్తాన్...రేకిస్తాన్..నువ్ లేకపోతే ఛస్తాన్ ॥ఏడు కోట్ల॥
కో: ఆవ్...ఆవ్...ఓ...హోయ్యా...ఓ...హోయ్యా...ఓ...హోయ్యా...తాతతరయ్యా
తా తక్కుమ్ తక్కుమ్ తక్కుమ్ తుంగా తుంగా..॥3॥
ఆ: స్టయిల్ చూస్తే యమా పవర్‌ఫుల్...
కండ చూస్తే యమా వండర్‌ఫుల్
కులుకులన్నీ చేస్తాడే కాకెంగిల్...
అ: పిల్లచూస్తే యమ కల్లర్‌ఫుల్...
ఒళ్ళు చూస్తే యమా ఒంపుల్‌ఫుల్
చూపుతోటి పెడ్తుందే చక్కిల్‌గిల్ గిల్ గిల్
ఆ: మాటతోటి చేసేస్తాడమ్మో మాయ మంత్రజాలం
కన్నుతోటి కొట్టేస్తాడమ్మో కాముడి పాలింగల్
అ: చూపులేసి రేపేసిందమ్మో కొత్త గందరగోళా
ఉడుకుమాని కూసేసిందమ్మో కసి కసి కొక్కోరొకో
కో ॥ఓం శాంతి॥ ఓహో హో హో హో హో హో హో హో హో
తోం తజిక్కు తోంతోం తరరంతం ॥3॥
అ: వయసు చూస్తే ఇక ట్వంటీ ఒన్
బరువు చూస్తే ఒక ఫిఫ్టీ ఒన్
పనులు మాని చేస్తా లే నీతో ఫన్...ఫన్...
ఆ: స్పీడు చూస్తే ఇక ఫైటింజన్ వేడిచూస్తే ఇక ఫైరింజన్
అందువల్లే అయ్యాలే నీకే ఫాన్..ఫాన్..ఫాన్..
అ: చెంతకొస్తే ఇక వేసేస్తాలే చాకులాంటి ఓ ప్లాన్
సోకులన్నీ ఇక తీసేస్తాలే చక చక సిటీస్కాన్
ఆ: రాతిరైతే ఇక తప్పకనీకే రాణివాసమిస్తా
రాజిలేక ఇక చూపిస్తాలే గజిబిజిగా చూస్తా ॥ఏడు కోట్ల॥

రచన: సిరివెన్నెల **5** గానం : టిప్పు,సునీత

ఆ: మానవా మానవా ఏమి కోరికా...
చెప్పవా చెప్పవా జాగుచేయక
కో: సింగు సింగు సియ్య సింగు సింగు సియ్య ॥2॥ ఆ: ॥మానవా॥
విన్నపాలెనే ఆలకించినా అప్సర నేనేరా
స్వర్గ భోగమే నేలదించిన కిన్నెర నేనేరా
ఇంద్రలోకమొచ్చి కళ్లముందు వాలినా
ఎందుకంట ఇంత యోచన
ఇంత దూరమొచ్చినాక ఇంకా అందుకోవా స్వర్గ సూచన
అ: అమ్మకచెల్ల ఏముందిరో...సొంపుల ఖిల్లా అదిరిందిరో
కో: సింగు సింగు సియ్య సింగు సింగు సియ్య ॥2॥ అ:॥అమ్మక॥
కో: నాదిరదింతానాన నాదిరదింతానాన దినన దినన నాదిరదినన ॥4॥
అ: పక్క కొచ్చెనే...తిక్కపెంచెనే ॥2॥ వయ్యారి నీ వాలకం
ఆ: దిగ్గజాలనే...ధిక్కరించెనే ॥2॥ నరుడా నీలో సాహసం
అ: మైకంలో ముంచుతున్నది పాపా నీ పనితనం
ఆ: మోహంలో ముంచుతున్నది నరుడా నీ మగతనం
అ: కొంటె కోరిక రెచ్చగొట్టక చుక్కా చాలింక
ఆ: వేడివేడిగా జోడు కూడగా వచ్చా నీవంక
అ: చేయ్యేస్తే కందేలా వున్నావే బొమ్మా
సందేహిస్తే ఎల్లా... ముందుకురావమ్మా ఆ: ॥మానవా॥
కో: నాదిరదింతానాన నాదిరదింతానాన దినన దినన నాదిరదినన ॥2॥
ఆ: తీయ తీయగా అందజేయనా ॥2॥ పెదవుల్లోని అమృతం
అ: మత్తుమత్తుగా ఊపుతున్నదే ॥2॥ పిల్లో నన్నే నీ నడుం...
ఆ: కౌగిళ్లో వాలమన్నది ఊరించే ఉత్సవం
అ: తందాన తాళమైనది చిందాడే యవ్వనం
ఆ: సుందరాంగితో సంబరాలలో రాజ్యం నీదే దొరా
అ: ముద్దలాలిలో ముద్దులాటలో మోక్షం పొందేలా
ఆ: అనందం ఈపైనా నీదే అంటున్నా...
అ: ఏదేమైనా మైనా నీతో నేరానా

రచన: భువనచంద్ర **6** గానం : ఎస్.పి.బాలు,రాధిక

ఆ: చిరుగాలి వీచింది చివురాకు ఒణికింది...
నీమీద మనసైంది నిదరరానంటింది...
తిరణాల కెళ్దాము...తెల్లార్లు వుందాము వస్తవా...హోయ్
హోయ్ హోయ్ నాతో వస్తవా...
అ: మిరపకాయ బజ్జిలిస్తవా నా సోళ్ళ రాణి సత్తుపల్లి సంతకొస్తవా॥2॥
కొర్రమీనులొండి పెడతవా నా సోకురాణి తాటికల్లు ముందు పెడతవా
ఆ: ఏదడిగితే అది ఇవ్వనా నడుఒంపునే ముడిపివ్వనా ॥2॥
అ: పంచమంటే పంచుకుంటా దంచమంటే దంచుకుంటాలే....
ఆ: మజాలే
అ: సుఖాలే
ఆ: మజాలే
అ: పచ్చిమిర్చి బజ్జిలిస్తవా నా సోళ్ళరాణి పంచదార చిలకలిస్తవా
ఆ: కోరుకుంది ముందు పెడ్తలే
ఓరయ్యో నువ్వు ఏడికంటే ఆడికొస్తలే...
కో: ఏలో ఏలో ఏలోలో... ॥2॥
అ: ఏ కొట్లో కొంటివే బియ్యం నువ్వూ
మా బాగా పెంచావే బాడీ నువ్వూ...

ఆ: దానిమ్మ తోటలో పెరిగానయ్యో
సుష్టుగా సూపరేసి పెంచానయ్యో
అ: నవ్వా ధగాధగా నడుమా నిగానిగా
నడిచే నెమలివి నువ్వా హోయ్...హోయ్...
ఆ: చూపా చురాచురా ఊపా హరోంహర
రతికే పతివే నువ్వా హోయ్...హోయ్...
ఆశతో వస్తిరో మస్తుగా హత్తుకుపోరా...
ఇలారా...అహోహో ఊహు...హు...
అ: పచ్చిమిర్చి బజ్జిలిస్తవ...నా సోళ్లరాణి పైటలాగ కప్పుకుంటవా...
ఆ: కైపురెచ్చి రేగుతున్నదోయ్...
ఓరయ్యో సన్న రైక బిగిసి రొప్పుతున్నదోయ్
ఆ: సైతుగా దోచుకో ఓరబ్బయ్యో సైజులో రంభకి చెల్లిని బాయ్యో
అ: ఓసి నా ఒంటరి దాసించెక్క వెయ్యనా మెత్తని ముఖమల్ పక్క
ఆ: ఓర్నీ బండబడ అంతటి హడావిడా
నలగదూ నైసు పావడా హోయ్...హోయ్...
అ: ఓసి నా ఎంకాయమ్మ ముందే చెప్తాలమ్మా
ఆపినా ఆగను లేమ్మా....
అమ్మనీ పొంగునీ దొంగలా దోచుకుంటాలే
సవాలే...ఇవాళే... ఇవ్వాళే
ఆ: పచ్చిమిర్చి బజ్జిలిస్తలే... ఓరందగాడా గుడిసెకొస్తె గుట్టుగుంటలే...
పంచుకోను మంచముందిలే
ఆరేసుకోను అచ్చమైన అందముందిలే
అ: కసి మూడహో రెచ్చిందిలే కదనానికే సై అందిలే
ఆ: కథకంచికే వచ్చిందిలే ఒడిదొడికే పదమందిలే
అ: ఇంకొంచెమంటె పంచమంట కంచమంటే మంచమంటలే
ఆ: ఆహాహో... అ: ఖుషిలే ఆ: ఆహాహో
కో: తందనాన తందానసే తందనాన తందానసే తందనాన తందానసే

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

# MEGASTAR CHIRANJEEVI


యం.శ్యాంప్రసాద్ రెడ్డి


కోడి రామకృష్ణ


మణిశర్మ


భువనచంద్ర


సీతారామశాస్త్రి


చంద్రబోస్




## తారాగణం

మెగాస్టార్ చిరంజీవి,
నమ్రతా శిరోద్కర్, టీనూ ఆనంద్,
రామిరెడ్డి, భూపేందర్,
యం.యస్.నారాయణ, రామ్మూర్తి,
పి.టి.రాజ్, సరస్వతమ్మ, బేబి కీర్తన,
బేబి మేఘన, బేబి నిత్య, మాస్టర్ వంశీ,
మాస్టర్ భరత్, మాస్టర్ అక్షయ్,
అతిథి పాత్రల్లో
రమ్యకృష్ణ
రీమాసేన్, రాణి రాజ్యలక్ష్మి

కథ, స్క్రీన్‌ప్లే
యం.యస్.ఆర్ట్ మూవీస్ యూనిట్

మాటలు
సత్యానంద్

పాటలు
సిరివెన్నెల, భువనచంద్ర, చంద్రబోస్

ఫోటోగ్రఫీ
ఛోటా కె. నాయుడు

ఎడిటింగ్
కె.వి.కృష్ణారెడ్డి

ఆర్ట్
అశోక్

ఫైట్స్
కనల్ కణ్ణన్, పీటర్

మేకప్
ఎం.చంద్రరావు

కాస్ట్యూమ్స్
శ్రీను

డ్యాన్స్
లారెన్స్, రాజుసుందరం, రాజశేఖర్, రాబర్ట్

స్టిల్స్
అల్లు తాతాజీ

పబ్లిసిటి
సురేష్ బుజ్జి

పి.ఆర్.ఓ.
అండా రామారావు

ప్రొడక్షన్
వీరబాబు, ఏడుకొండలు

అసిస్టెంట్
ప్రకాష్

కో-డైరెక్టర్
యం.సర్వేశ్వరరావు

సంగీతం
మణిశర్మ

నిర్మాత
యం.శ్యామ్‌ప్రసాద్‌రెడ్డి

దర్శకత్వం
కోడి రామకృష్ణ



## కొమ్మ కొమ్మకో సన్నాయి...



# కథానాయకుడి కథ కరిగిపోని కల

(గత సంచిక తరువాయి)

నేను సినీరంగంలో రచయితను కావాలని నా జర్నలిజం రోజులలోనే ప్రోత్సహించినవారు ఎన్.టి.ఆర్. నిర్మామకర్మగా తొలుత ప్రారంభించిన ఆ వ్యాసంగం విశ్వనాథుడి ఆశీస్సులతో, అండతో వెలుగు చూసింది. ఇహపరాలకు విశ్వనాథుడు వృత్తి మార్గం చూపితే వాణి పరంగాను, వాణిజ్య పరంగాను ఎన్.టి.ఆర్. చిత్రాలు నాకు చేయూతనిచ్చాయి. ఈ భిన్నధ్రువాలమధ్య భువనమై గగనమై ఎదిగింది నా సినీసాహితీజీవితం.

‘దస్తూరి గుణాల కస్తూరి’ అనే వాక్యం రమణాత్మకం. రమణగారు పదేపదే అనేవారు. ఎన్.టి.ఆర్. దస్తూరి చూస్తే ‘ఆంధ్రాక్షరంబు మురువులొలుకు గుండ్రముత్తియములు’ అన్న మాట కన్నుల కట్టినట్లు వుండేది. ఆయన తీసిన చాలా పౌరాణిక చిత్రాల ‘స్క్రిప్టు’గ్రంథాలు ఆయనే స్వయంగా ప్రియంగా రాసుకుని బైండు చేయించుకొని పెట్టుకునేవారు. వృత్తి మీద, ప్రవృత్తి మీద అటువంటి క్రమశిక్షణ సాధించిన కళాకారులు అరుదు.

ఒకసారి ఆయన అలా రాసుకున్న స్క్రిప్టులో ‘నిర్విక్రపరాక్రమం’ అనే నెరసు దొర్లింది. ‘ఇక్కడ తప్పుంది. దీనిని నిర్వక్ర అని మార్చాలి’ అన్నాను. దానికి ఆయన చకితులై ‘అది సముద్రాల గారు రాసింది - అందులో తప్పెలా వుంటుంది?’ అన్నారు. ‘ప్రమాదో ధీమతా మపి’ అన్నారు కదా అలా జరిగిందేమో అన్నాను. ఆయన ఎక్కడో ఆలోచిస్తూ ఒక్కొక్కప్పుడు మాట్లాడేవారు. కాపీ చేయడంలో కూడా తప్పు జరిగే అవకాశం ఉంది’ అన్నాను. వెంటనే మూల ప్రతి తెప్పించి చూశారు. అందులోనూ అలాగే వుంది. ‘అయితే ఆచార్యులవారు చెబితే రాసినవారు - లేఖకులు - చేసిన పొరబాటు ఇది’ అన్నాను. ‘కాదు అది రైటే’ అన్నారు రామారావుగారు. ఇక లాగడం మంచిది కాదని మౌనం వహించాను. ఆయనకు ఎవరియందైనా గురి ఏర్పడితే అంతే! దానిని ఎవరూ చెదరగొట్టలేరు.

‘అడవిరాముడు’ చిత్రంలో తొలిసారి నేను ఆయనకు పాటలు రాశాను. అంతకుముందు ‘సిరిసిరిమువ్వ’ చిత్రంలో పాటలు,... ముఖ్యంగా ‘రా దిగిరా దివినించి భువికి దిగిరా’ అన్న పాటను విని ఆయన మా గురువు విశ్వనాథ్ గారితో తన ఆనందం వెల్లడించారట.

ఘంటసాల నా పాట ఒక్కటి కూడా పాడకపోవడం నా జీవితానికి పెద్దలోటుగా భావిస్తాను. ‘దీక్ష’ (కోగంటి కుటుంబరావు - ప్రత్యగాత్మ) చిత్రంలో తనకు, జమునతో భామాకృష్ణులుగా ఒక పాటవుంటే అది కలర్‌లో తీస్తే బాగుంటుందని రామారావుగారు భావించారు. అప్పటికే ఆ చిత్రం పూర్తికావచ్చింది. అది నిర్మాతకు అదనపుభారం. అయినా అది వుంటే చిత్రవిజయానికి మరింత దోహదం అవుతుందని ఎన్.టి.ఆర్ భావించి 1971 సంక్రాంతి నాడు ఆ పాట నాచేత రాయించారు.

ఆ క్రితం రోజు భోగిపండుగ నాడు ప్రాతఃకాలంలో పూజచేసి హారతి పళ్లెంలో 501 రూపాయలు పెట్టి తొలి సినిమా పాట అడ్వాన్సుగా నాకు తమ చేతులమీదుగా యిచ్చిన శ్రీ కోగంటి దంపతులను నేను మర్చిపోలేను. పాట రాయడం, పెండ్యాలగారు తిలక్ కామోద్ రాగంలో ప్రారంభించి రాగమాలికగా దానిని ట్యూను చేయడం కూడా జరిగాయి. అది ఘంటసాల సుశీల పాడవలసిన ఒక గేయ రూపకం.

‘నిన్న రాతిరి కలలో
సన్న చేసి సరసకు రమ్మని
నిన్ను పిలిచిన దెవరే చెలియా
వేయి పేరుల వాడే - వాడు
వేయి తీరుల వెలిగే వాడే - పద
ర్వేల నారుల రేడే...’

ఇలా సాగే ఆ రచనని తన వద్దకు వచ్చిన నిర్మాతలకి చదివి వినిపించి రామారావుగారు ఎంతగా మురిసిపోయారో! అప్పుడు అదివిన్న నిర్మాతలలో దేవీవరప్రసాద్ గారు, వై.వి.రావుగారు, కొండవీటి వెంకటకవి గారు ఉన్నారు.

అటుతర్వాత చాలా కాలానికి ‘విరాటపర్వం’ తీస్తూ బృహన్నల నాట్యాచార్యుడుగా ఉత్తరను తీర్చిదిద్ది తొలి నాట్యం చేయించే సందర్భంలో నేను పాట రాసియిస్తే అది చూసి పక్కనే వున్న వెంకటకవి గారికి యిచ్చారు.

నటునిగా ఈనాడు అహర్నిశలూ కృషిచేయగలిగినా,
వివిధ పాత్ర నిర్వహణకు సాహసించగలిగినా
మీ అందరి ఆదరణా, ప్రోత్సాహము అనే నా విశ్వాసం.
మీ అభిమానం పొందగలిగిన
అదృష్టవంతునిగా ఇంకా చాలా జన్మలెత్తి, మిమ్మల్ని
తృప్తిపరచాలనే కాంక్ష వుంది; ఉల్లాసపరచాలనే ఉద్వే
గం వుంది; ఉత్తేజపరచాలనే ఆవేశమూ వుంది. ఇన్ని
విభిన్న పాత్రల రూపకల్పనకూ, నా కార్యదీక్షకూ అండగా
నిలిచి ప్రతిక్షణం నన్ను తీర్చిదిద్దుతున్న మీ అభి
మానాన్ని ఏ ద్రవ్యంతోనూ విలువ కట్టలేను — హృదయ
పూర్వకమైన కృతజ్ఞతలు సమర్పించుకోవడం కంటె నా
అభిమానులకు నేను ఈయగలిగిందిలేదు.

మీ



(సుమారు 40 ఏళ్ళ క్రితం ఒక ప్రముఖ పత్రిక కోసం కీ॥శే॥ ఎన్.టి.ఆర్. స్వదస్తూరితో రాసిన ఉత్తరంలోని కొంత భాగమిది.)

‘ఆడవే హంసగమన - నడ
యాడవే ఇందువదన’

అనే పల్లవి చూసి కవిగారు “హంసగమనా ఆడవే అన్నారు హంస నాట్యానికి ప్రసిద్ధి కాదుగదా” అని అడిగారు. వెంటనే నేను ‘అక్కడ మాట అంటున్నది పేడి అయిన బృహన్నల కాదు - అతనిలో దాగివున్న నాట్య కోవిదుడైన అర్జునుడు - అతను హంసలను నెమళ్ళను కాక అంతకన్న ఉదాత్తమైన తన స్థాయికి తగిన ఉపమానోపమేయాలు తేవాలికదా - అందుకే ఇక్కడ ‘హంస’శబ్దం సూర్యపరంగా వాడాను. క్రమంతప్పని గమనంలో సూర్యుడంతటి సమగమనం కలదానా అని అర్థం. అక్కడ ‘హంస’ సూర్యపరంగా వాడాను కాబట్టే ‘నడయాడవే ఇందువదన’ అనడం - గమనశ్రమ ఎంత కలిగినా ఆహ్లాదకరమైన చంద్రుడి వదనమే కలదానా అనే అర్థంలో చెప్పడం జరిగింది” అన్నాను.

వెంకటకవిగారు ఆశువుగా ఏదో పద్యపాదం చదివి లేచి నన్ను కౌగిలించుకున్నారు. నా విషయంలో రామారావుగారు ఆనాడు ఎంత తృప్తి వెల్లడించారో అక్కడే వున్న సంగీత దర్శకులు శ్రీ సుసర్ల దక్షిణామూర్తిగారు పదేపదే చాలాకాలంగా ఆ సంఘటనే ప్రస్తావించేవారు. అదే చిత్రంలో ‘జీవితమే కృష్ణ సంగీతము’ అనే గీతం కూడా రామారావుగారు ‘స్వగతంగా’ పాడుకుంటూ వుండేవారు, ఈ రెండు పాటలూ అన్నగారు బాలమురళి గారు పాడడంతో వాటికి మరింత వన్నె పెరిగింది.

‘అడవిరాముడు’ చిత్రంలో రామారావుగారి నోట నా పాట తొలిసారిగా తెలుగు ప్రేక్షక శ్రోతలకు వినపడింది. ‘కృషివుంటే మనుషులు ఋషులవుతారు మహా పురుషులవుతారు - తరతరాలకీ తరగని వెలుగౌతారు - ఇలవేలుపులౌతారు’ - ఏ ప్రేరణ చేత ఏ శక్తి నాచేత ఈ పదాలు రాయించిందో అవి చరిత్రగా మారిపోవడం దైవికం. తెలుగుపాట కోటిరూపాయల పాట కావడం కూడా ఆ చిత్రంలోని ‘ఆరేసుకోబోయి పారేసు కున్నాను’ అనే పాటతోనే జరిగింది. పాట చిత్రీకరణలో ‘కోకిలమ్మ పెళ్ళికి కోనంతా పందిరి చిగురాకులు తోరణాలు చిరుగాలి సన్నాయి’ అత్యున్నతస్థాయి సాధించింది. వీటన్నిటికి వెనుకనున్న శక్తి, వ్యక్తి శ్రీ రాఘవేంద్రరావు.

**(సశేషం)**

ఫిబ్రవరి 14 ప్రపంచ ప్రేమికుల దినోత్సవం సందర్భంగా...

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : ఆర్‌జూ
రచన : హస్రత్ జైపురి
సంగీతం : శంకర్ - జైకిషన్



## 'అజీ రూఠ్‌కర్ అబ్ కహాఁ జాయియేగా'

గానం
లతా మంగేష్కర్
అభినయం
సాధనా, రాజేంద్రకుమార్

అజీ రూఠ్‌కర్ అబ్ కహాఁ జాయియేగా
జహాఁ జాయియేగా హమేఁ పాయియేగా ॥అజీ రూఠ్‌కర్॥
నిగాహోం సే ఛుప్‌కర్ దిఖావో తో జానే
ఖయాలోం మేఁ భీ న ఆవో తో జానే
అజీ లాఖ్ పర్దోం మేఁ ఛుప్ జాయియేగా (2)
నజర్ ఆయియేగా, నజర్ ఆయియేగా ॥అజీ రూఠ్‌కర్॥
జోదిల్ మేఁహై హోఠోం పే లానా భీ ముష్కిల్
మగర్ ఉస్‌కో దిల్ మేఁ ఛుపానా భీ ముష్కిల్
నజర్ కీ జుబాఁసే సమఝ్ జాయియేగా (2)
సమఝ్‌కర్ జరా గౌర్ ఫర్మాయియేగా ॥అజీ రూఠ్‌కర్॥

## 'అజీ హమ్‌సే బచ్‌కర్ కహాఁ జాయియేగా'

గానం
మహమ్మద్ రఫీ
అభినయం
రాజేంద్రకుమార్, సాధనా

అజీ హమ్‌సే బచ్‌కర్ కహాఁ జాయియేగా
జహాఁ జాయియేగా హమేఁ పాయియేగా
యే కైసా నషా హై, యే కైసా అసర్ హై
న కాబూ మేఁ దిల్ హై, న బస్ మేఁ నజర్ హై
జరా హోష్ ఆలే, చలే జాయియేగా (2)
ఠహర్ జాయియేగా, ఠహర్ జాయియేగా॥అజీ హమ్‌సే॥

అలకపాటల్లో మొదటి లైన్లోనే 'రూఠ్‌కర్'(అలిగి) అనే పదం ఉండటంతో ప్రియమైనవారు అలిగినపుడు వెంటనే గుర్తుకొచ్చే పాట 'అజీ రూఠ్‌కర్ అబ్ కహాఁ జాయియేగా'. రామానంద్ సాగర్ నిర్మించి దర్శకత్వం వహించిన 'ఆర్‌జూ' చిత్రంలోనిది ఈ పాట. ఉత్తుత్తినే అలిగి ప్రియుడిని అందరి ముందూ ఒప్పించటానికి ప్రేయసి పాడే ఈ పాటకు శంకర్ - జైకిషన్ అందించిన సంగీతం అత్యద్భుతం. లతా తప్ప ఎవరూ పాడలేరనిపించే పాటల్లో ఇదొకటి. హస్రత్‌జైపురి రాసిన ఈ పాట పల్లవి అమరమైనది.

అజీ అంటే ఏమండీ లాంటి సంబోధనార్థకమైన మాట.

**"ఏమండీ, అలిగి ఎటు వెళతారిక తమరు**
**ఎటు వెళ్ళినా మీరు నన్నే చేరుతారు'**

పల్లవిలో 'అబ్' అనే పదం ట్యూన్ కోసం వేసినట్టు అనిపించినా 'ఇంతదూరం వచ్చాక' అనే అర్థం దాని సొగసును ఇనుమడింపజేసింది. 'ఇంత దూరం వచ్చాక ఇక అలిగి మాత్రం ఏం చేయగలరు? మీరు ఎటు వెళ్ళినా మీ తలపుల్లో నేనే ఉంటాను' అంటోంది ఆమె.

'నిగాహేఁ' అంటే చూపులు. ఛుప్‌నా అంటే దాక్కోవటం. ఖయాల్ అంటే తలపులు. 'నజర్ ఆనా' అంటే కనిపించటం.

**'నా చూపుల నుంచి తప్పుకో చూద్దాం**
**నా తలపుల్లోకి నువు రాకుంటే చూద్దాం**
**లక్ష పరదాలలో దాక్కున్నా తమరు**
**నాకు అగుపిస్తారు, నాకు అగుపిస్తారు'**



తన చూపుల నుంచి తప్పుకుని వెళ్లినా అతను తన కన్నులలోనే ఉంటాడని ఆమె అంటోంది. తన చూపుల నుంచి తప్పించుకుని, తన తలపుల్లోకి రాకుండా ఉంటే అప్పుడు అతను అలిగినా ఫలితం ఉంటుంది గానీ అంతటా అతనే ఉన్నపుడు ఈ చిన్న చిన్న అలుకలు ఏమీ చేయలేవని ఆమె భావం. పల్లవిలో 'అజీ' అంటూ చరణంలో 'తుమ్' అనటం కొంచెం అసమంజసంగా అనిపించినా 'అజీ' అనటం ఆటపట్టించటానికే అనుకుంటే సరిపోతుంది.

హోంఠ్ అంటే పెదవులు. ముష్కిల్ అంటే కష్టం. జుబాఁ అంటే నాలుక. భాష అనే అర్థంలో కూడా వాడతారు - ఆంగ్లంలో మాతృభాషను మదర్‌టంగ్ అన్నట్టు. 'గౌర్ ఫర్‌మానా' అంటే ఆలోచించటం.

**'మదిలో ఉన్నది పెదవులపైకి తేవటం కష్టం**
**అలాగని దాన్ని మదిలోన దాచటం కష్టం**
**కన్నుల భాషతోనే తెలుసుకోండి**
**తెలుసుకుని కాస్త ఆలోచించండి'**

మదిలో ఉన్నది పెదవులతో చెప్పలేని బిడియం ఆమెది. కానీ మదిలోని మాటని దాచలేని భావోద్వేగం కూడా ఉంది. అందుకే కళ్ళు చెప్పే ఊసులు అర్థం చేసుకోమని వేడుకుంటోంది.

ఈ పాట ట్యూన్‌లోనే మహమ్మద్ రఫీ పాడిన మరో పాట కూడా ఉంది ఈ చిత్రంలో. నాయిక తనను వదిలి వెళ్ళిపోతున్నపుడు నాయకుడు ఆమెను ఆగమని వేడుకునే పాటే ఇది.

'బచ్‌నా' అంటే తప్పించుకోవటం. 'నన్ను తప్పించుకుని ఎక్కడికి వెళ్ళినా నేనే ఎదురవుతాను' అంటున్నాడు అతను.

**'ఏమండీ, నను తప్పించుకుని ఎటు వెళతారు తమరు**
**ఎటు వెళ్ళినా మీరు నన్నే చేరుతారు'**

'నషా' అంటే మైకం. అసర్ అంటే ప్రభావం. కాబూ అంటే వశం. హోష్ అంటే స్పృహ. ఠహర్‌నా అంటే ఆగటం.

**'ఇది ఏమి మైకం, ఇది ఏమి ప్రభావం**
**మనసు వశాన లేదు, చూపు మాట వినదు**
**కాస్త నే తెరిపిన పడితే వెళ్ళచ్చు గాని**
**ఆగండి మీరు, ఆగండి మీరు'**



ఆమెతో గడిపిన సమయం అతనిపై మత్తు చల్లింది. మనసు కట్టు తప్పింది. తనకు మళ్ళీ లోకవు స్పృహ వచ్చేవరకూ ఆగమని అంటున్నాడు. ఇక్కడ 'అభీ న జావో' పాటలోని 'యే దిల్ సంభల్ తో లే జరా' లైను గుర్తొస్తుంది.

కాశ్మీరులో చిత్రీకరించిన ఈ పాట చివర కొలనులో సంధ్యా సమయంలో రెండు పడవలు విడిపోయి చెరోదారిన వెళ్ళే దృశ్యం ఎప్పటికీ మదిలో నిలిచిపోతుంది.

| | |
|---|---|
| చిత్రం | : హమ్ దోనోఁ |
| రచన | : సాహిర్ లుధియాన్వి |
| సంగీతం | : జయదేవ్ |
| గానం | : మహమ్మద్ రఫీ, ఆశాభోంస్లే |
| అభినయం | : దేవానంద్, సాధనా |





## 'అభీ న జావో ఛోడ్‌కర్'

అ: అభీ న జావో ఛోడ్‌కర్ కి దిల్ అభీ భరా నహీఁ (2)
అభీ అభీ తో ఆయీ హో, అభీ అభీ తో
అభీ అభీ తో ఆయీ హో, బహార్ బన్‌కే ఛాయీ హో
హవా జరా మెహక్ తో లే, నజర్ జరా బెహక్ తో లే
యే షామ్ ఢల్‌తో లే జరా (2), యే దిల్ సంభల్ తో లే జరా
మై థోడీ దేర్ జీతో లూఁ, నషే కే ఘూంట్ పీ తోలూఁ (2)
అభీతోకుఛ్ కహా నహీఁ, అభీతో కుఛ్ సునా నహీఁ ॥అభీ న జావో॥
ఆ: సితారే ఝిల్‌మిలా ఉఠే (2), చరాగ్ జగ్‌మగా ఉఠే
బస్ అబ్ న ముఝ్‌కో టోక్‌నా (2), న బఢ్‌కే రాహ్ రోక్‌నా
అగర్ మైఁ రుక్ గయీ అభీ తో జాన పావూంగీ కభీ
యహీ కహోగే తుమ్ సదా కి దిల్ అభీ నహీఁ భరా
జో ఖత్మ్ హో కిసీ జగహ్ యే ఐసా సిల్‌సిలా నహీఁ
అ: అభీ నహీఁ, అభీ నహీఁ
ఆ: నహీఁ నహీఁ నహీఁ నహీఁ
ఆ: అధూరీ ఆస్ (2) ఛోడ్‌కే, అధూరీ ప్యాస్ ఛోడ్‌కే
జో రోజ్ యూఁహీ జావోగీ తో కిస్ తరహ్ నిభావోగే
కి జిందగీ కీ రాహ్ మేఁ, జవాఁ దిలోం కీ చాహ్ మేఁ
కయీ ముకామ్ ఆయేంగే జో హమ్‌కో ఆజ్‌మాయేంగే
బురా న మానో బాత్ కా, యే ప్యార్ హై గిలా నహీఁ
అ: హాఁ యహీ కహోగే తుమ్ సదా కి దిల్ అభీ నహీఁ భరా
అ: హాఁ దిల్ అభీ భరా నహీఁ
ఆ: నహీఁ నహీఁ నహీఁ నహీఁ

ప్రేమ భావాలను చక్కని కవిత్వంతో భావస్ఫోరకంగా పలికించిన పాటలెన్నో ఉన్నాయి. అలాగే తేలికైన రొమాంటిక్ భావాలను హృదయానికి హత్తుకునేలా చెప్పిన పాటలూ ఉన్నాయి. ముఖ్యంగా తనను వదిలి వెళ్ళిపోతున్న ప్రేయసిని ఆగమని వేడుకోవడం, అలిగిన వారిని ఒప్పించటానికి శతవిధాలా ప్రయత్నించటం వంటి సందర్భాలలో వచ్చిన పాటలు అసంకల్పితంగానే పెదవులపై చిరునవ్వు మొలిపిస్తాయి. ఆ పాటలలోని చమక్కులు అలాంటివి. ఈనాటి ప్రేమికులు కూడా మళ్ళీ మళ్ళీ పాడుకునే పాటలు అవి.



'అభీ న జావో ఛోడ్‌కర్' (హమ్ దోనోఁ), 'దిన్ సారా గుజారా తేరే అంగ్‌నా' (కాశ్మీర్ కీ కలీ), 'అజీ హమ్‌సే బచ్‌కర్ కహాఁ జాయియేగా' (ఆర్‌జూ), 'అచ్ఛా తో హమ్ చల్‌తే హైఁ'(ఆన్ మిలో సజ్‌నా), 'ఆజ్ కీ ములాకాత్ బస్ ఇత్‌నీ' (భరోసా), 'ఢల్ గయా దిన్'(బిదాయీ), 'జానే దోన'(సాగర్), 'జాతీ హూఁ మైఁ'(కరణ్ అర్జున్) పాటలలో వెళనివ్వమని ప్రేయసి, ఇంకాసేపు ఉండమని ప్రియుడు వేడుకోవడం ఆయా తరం ప్రేక్షకులను విపరీతంగా ఆకట్టుకున్నాయి.

వీటిలో కొన్ని పాటలు ఇప్పటికీ మురిపిస్తూనే ఉన్నాయి. అలిగినవారిని ఒప్పించే పాటలలో 'యెల్లో మైఁ హారీపియా'(ఆర్‌పార్), 'అఛ్ఛా జీ మైఁ హారీ' (కాలా పానీ), 'అజీ రూఠ్‌కర్ అబ్ కహాఁ జాయియేగా'(ఆర్‌జూ), 'తుమ్‌నే కిసీ కీ జాన్‌కో'(రాజ్‌కుమార్), 'వో హైఁ జరా ఖఫాఖఫా' (షాగిర్ద్), 'జాయియే ఆప్ కహాఁ జాయేంగే' (మేరే సనమ్) పాటలు ఇప్పటికీ మైమరపిస్తూనే ఉన్నాయి.

రొమాంటిక్ హీరోగా పేరు గడించిన దేవానంద్ చిత్రాలలోని రొమాంటిక్ గీతాలు ఎంతో బావుంటాయి. ఇటీవలే భారతీయ చలనచిత్ర రంగానికి అందించిన సేవలకు గాను దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు అందుకున్న దేవానంద్ నిర్మించిన ఆణిముత్యం 'హమ్ దోనోఁ'లో 'అభీ న జావో ఛోడ్‌కర్' లైట్ రొమాంటిక్ సాంగ్స్‌కి తలమానికంలా ఉంటుంది. ఈ పాటను సాహిర్ లుధియాన్వి రాశారు.

'అభీ న జావో' అంటే 'ఇప్పుడే వెళ్ళకు' అని. ఛోడ్‌నా అంటే వదలటం. 'దిల్ అభీ భరా నహీ!' అంటే 'మనసు ఇంకా నిండలేదు'అని. ఈ ప్రయోగం తనివి తీరలేదే, నా మనసు నిండలేదే' (గూడుపుఠాణి) పాట ద్వారా తెలుగువారికి పరిచయమే. బహార్ అంటే వసంతం. హవా అంటే గాలి. మెహక్ అంటే పరిమళం. నజర్ అంటే చూపు. బెహక్‌నా అంటే హద్దు దాటడం. షామ్ అంటే సాయంత్రం, సందెవేళ. సంభల్‌నా అంటే సంభాళించటం. 'థోడే దేర్' అంటే కాసేపు. 'నషే కే ఘూంట్' అంటే మత్తెక్కించే గుక్కలు. కెహనా అంటే చెప్పటం. సున్‌నా అంటే వినటం.

**అ: ఇపుడే వెళ్ళకు నన్నొదిలి, ఇంకా మది నిండలేదుగా**
**ఇపుడే కదా వచ్చావు, ఇపుడే కదా**
**ఇపుడే కదా వచ్చావు, వసంతమై వెలిశావు**
**గాలిని పరిమళించనీ, చూపును హద్దు దాటనీ**
**ఈ సందెను కాస్త వెళ్ళనీ, నా గుండెను నెమ్మదించనీ**
**కాసేపు నను జీవించనీ, మత్తెక్కించే మధువు తాగనీ**
**ఇంకా ఏమీ అనలేదే, ఇంకా ఏమీ వినలేదే'**

ప్రేయసితో ఎంతసేపు గడిపినా ప్రియుడికి తనివితీరదు. ఇలా వచ్చి అలా వెళ్ళిపోతున్నట్టు అనిపిస్తుంది. వసంతంలా వచ్చిన ప్రియురాలు గాలిలో వసంతపు పరిమళం నిండకుండానే వెళుతున్నట్టు అనిపిస్తుంది. కనులారా ఆమెను చూసుకోలేదనిపిస్తుంది. చల్లటి సాయంకాలం దాటే వరకైనా ఉండమని వేడుకుంటున్నాడు.

ఈలోపల మనసును సంభాళించుకుంటాడట. 'కాసేపు నను జీవించనీ' అనటంలో 'నువ్వుంటేనే జీవితం' అనే భావం పలికించారు. మత్తెక్కించే ఆ సమయాన్ని ఆస్వాదించనివ్వమని అతని విన్నపం. ఎన్ని ఊసులాడుకున్నా ఇంకా ఏమీ మాట్లాడుకోలేదనే అనిపిస్తుంది.

సితారే అంటే తారులు. ఝిల్‌మిలానా అంటే మిలమిలలాడటం. చరాగ్ అంటే దీపాలు. జగ్‌మగానా అంటే కాంతివంతంగా వెలగటం. టోక్‌నా అంటే ఆపటం. రాహ్ అంటే దారి. రుక్‌నా అంటే ఆగటం. సిల్‌సిలా అంటే పరంపర.

**ఆ: చుక్కలు మిలమిల మెరిసె, దీపాలు కాంతిగ వెలిగె**
**నన్ను ఆపవద్దిక, రాకు దారికడ్డుగా**
**నేనిపుడు ఆగిపోతినా ఎప్పటికీ వెళ్ళలేనిక**
**ఇలాగే అంటావు నువ్వెపుడూ, ఇంకా మది నిండలేదని**
**ఎంతసేపు సాగినా ఆగేది కాదు ఈ కథ'**
**అ: 'ఇపుడే వద్దు, ఇపుడే వద్దు**
**ఆ: 'వద్దు వద్దు వద్దు వద్దు'**

లోకం తీరు వలన అమ్మాయిలకు లోకభీతి ఎక్కువ కదా. అందుకే ఆమె తొందరపడుతోంది. 'చుక్కలు పొడిచాయి. దీపాలు వెలిగాయి. ఇక వెళ్ళనీ' అంటూంది. ఇప్పుడు ఆగిపోతే ఎప్పటికీ వెళ్ళలేనేమో అని భయడుతూంది. 'నీ సంగతి నాకు తెలుసు. ఎంత సేపున్నా ఇంకా ఉండమనే అంటావు' అని సున్నితంగా మందలించింది.

ఆస్ అంటే ఆశ. ప్యాస్ అంటే దాహం. నిభానా అంటే నిలుపుకోవటం. 'జవాఁదిల్' అంటే యువహృదయాలు. చాహ్ అంటే కోరిక. ముకామ్ అంటే మజిలీలు. అజ్‌మానా అంటే పరీక్షించటం. గిలా అంటే అలుక.

**అ : 'తీరని ఆశతో, తీరని దాహంతో నన్నొదిలి**
**రోజూ ఇలాగే వెళితే ఎలా నిలుపుకుంటావు ప్రేమని**
**ఈ జీవితపు బాటలో, యువహృదయాల కోరికలో**
**ఎన్ని మలుపులు వస్తాయి, మనలను పరీక్షిస్తాయి**
**మరోలా అనుకోవద్దులే, ఇది ప్రేమయే అలుక కాదులే'**

ఆమెతో మనసు విప్పి మాట్లాడాలనే తన ఆశ తీరకుండానే ఆమె వెళ్ళిపోతుంటే 'ఇలాగేనా ప్రేమ నిలుపుకునేది' అని నిష్ఠూరాలాడుతున్నాడు. 'ఇంకా ఎన్నో అవాంతరాలు వస్తాయి. అప్పుడేం చేస్తావు?' అని అడుగుతూనే 'ఇది ప్రేమతో అంటున్న మాటే గానీ అలుక కాదు' అని ఆమెను అర్థం చేసుకున్నానని చెప్పకనే చెబుతున్నాడు.

రఫీ,ఆశా గానం, దేవానంద్,సాధనా అభినయంతో ఈ పాట క్లాసిక్‌గా నిలిచిపోయింది. ఇలాంటి పాటలెన్ని వచ్చినా ఈ పాట స్థానం చెక్కుచెదరదు.

**-పి.వి.సత్యనారాయణ రాజు**

# తాతా ధిత్తై తధిగిణతోం

సీరియల్ 6

| పాత్రలు | నటీనటుల సజేషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో

- జీడిగుంట రామచంద్రమూర్తి



**జరిగిన కథ**

రాజు పాలెం అనే గ్రామంలో రావ్ బహుద్దూర్ వంశానికి చెందిన వీరభద్రం అనే స్కూలు మాష్టారు ఉంటారు. ఆయనంటే ఆ ఊరి మొత్తానికి భక్తితో కూడిన భయం. చీటికి మాటికి భార్యపై రుసరుస లాడుతుంటాడాయన. వీరభద్రం పెద్దకొడుకు శ్రీరామ్ పట్నంలో చదువుతూంటే చిన్న కొడుకు లక్ష్మణమూర్తి తండ్రి దగ్గరే ఉండి పదోతరగతి చదువుతూ ఉంటాడు. శ్రీరామ్‌ను అశ్వని ప్రేమిస్తూ ఉంటుంది. తనకు బాకీగా ఉన్న కట్నం బాపతు సొమ్మును రెడీగా ఉంచమని మామ వీరభద్రంకు ఉత్తరం రాస్తాడు రాజేంద్ర . దాని గురించి బాల్యస్నేహితుడు లాయర్ చిదంబరంకు చెప్పి మంచి సలహా ఇమ్మంటాడు. సంక్రాంతి పండుగకు అల్లుడు రాజేంద్ర, కూతురు గీతలు వస్తారు. అశ్వని బాధ భరించలేక ఆమె తండ్రి విష్ణుమూర్తి కి ఆకాశరామన్న ఉత్తరం రాస్తాడు శ్రీరామ్.

-(ఇక చదవండి)




"అసలు నీ కింత పట్టుదల ఎందుకో నా కర్థం కావటంలేదు బేబీ...వద్దన్నా వాడి వెంటపడటం ఎందుకసలు?.. పైగా నీ స్టేటస్సూ, నీ అందచందాలు చూసి ఏ ఫారెన్ కుర్రాడో కళ్ళకద్దుకుని మరీ పెళ్ళి చేసుకుంటాడు... నెత్తిన పెట్టుకుని పూజిస్తాడు"

"అవునా, మరి అలాంటి స్టేటస్సూ, అంతటి అందచందాలూ వున్న నన్ను పల్లెటూరినించి వచ్చిన ఓ మామూలు కుర్రాడు ఎందుకు పట్టించుకోటం లేదు?.. అదేనాకు అర్థం కావటం లేదు డాడీ!.. నాకు తెలుసు అతనికి నేనంటే ప్రేమ వుంది.. ఆ సంగతి అతనే చెప్పాడు కానీ పెళ్లి చేసుకునేందుకు భయపడుతున్నాడు. అందుకు కారణం వాళ్ళ నాన్న..!..ఆయన చండశాసనుడట డాడీ!..అతనే చెప్పాడు..."

"అలాంటప్పుడు ఆ చండశాసనుణ్ణి మన దారికి తెచ్చుకుంటే ప్రాబ్లం సాల్వ్ అయిపోతుందిగా?" అడిగాడు విష్ణుమూర్తి.

"దానికంటే ముఖ్యం -శ్రీరామ్‌కి తండ్రిపట్ల వున్న భయాన్ని పోగొట్టడం...! అప్పుడు ఆటోమేటిగ్గా అతనే మన దారికి వస్తాడు..!"అంటూ లేచింది అశ్వని.

ఆమె మాటల్లోని తాత్పర్యాన్ని వెతుకుతూ అలాగే చూస్తుండిపోయాడు విష్ణుమూర్తి.

****

హాస్టల్లో తన గది ముందు అటూ ఇటూ పచార్లు చేస్తూ పుస్తకం చదువుతున్నాడు శ్రీరామ్. అతని మిత్రుడు అవధాని అక్కడకువచ్చాడు. అతని చేతిలో ఓ ఇన్‌లాండ్ కవరుంది.

"ఒరేయ్ శ్రీరామ్..! 'కాలేజి పోస్ట్ బాక్స్'లో నీ పేర ఈ కవరు కనిపించిందిరా!... తీసుకొచ్చా!"అంటూ దాన్ని అతని చేతికిచ్చి వెళ్ళిపోయాడు అవధాని.

శ్రీరామ్ ఆత్రంగా కవరువిప్పి,అందులో వున్న మొదటి వాక్యాన్ని చదివాడు. "..........ఒరేయ్ శుంఠాగ్రేశ్వర చక్రవర్తీ!"

ఆ వాక్యాన్ని అప్రయత్నంగా పైకి చదివినందుకు- తనకు తనే షాకై చుట్టుపక్కల ఎవరైనా వుండి విన్నారేమోనని అనుమానంగా చూశాడు. ఎవరూ లేరని నిర్ధారణ చేసుకున్నాక స్తంభం పక్కకెళ్ళి ఉత్తరాన్ని పూర్తిగా చదువుకున్నాడు.

"శ్రద్ధగా చదివి అఘోరించమని నిన్ను టౌనుకి పంపిస్తే పుస్తక పాఠాలు మానేసి ప్రేమపాఠాలు వల్లించుచుంటివని తెలియవచ్చింది!.. ఎవరో అశ్వనియట!.. ఆమె వలలో పడి -నీవు 'కుడితి' లో పడిన మూషికం లాగా గిలగిలా కొట్టుకుంటు న్నావట..! మీ క్లాసుమేటు ఒకడు తెలియపరచినాడు. నేను ఎంత ఛండశాసనుడనైనప్పటికి కన్నకొడుకు కోరికను కాదనే దుర్మార్గుడను కాను! నీకు సమ్మతమైనచో నాకునూ సమ్మతమే! నీ పరీక్షలు పూర్తికాగానే మీ వివాహమునకు ముహూర్తం పెట్టించెదను...

ఇట్లు
నీ పితృదేవుడు
వీరవాసరం వీరభద్రం వ్రాలు.

ఉత్తరం చదివిన శ్రీరామ్ బిత్తరపోయాడు." కలా? నిజమా? మా నాన్న అశ్వినితో పెళ్ళికి ఒప్పుకుంటాడా?"అని మనసులో పదేపదే ప్రశ్నించుకున్నాడు.

ఎన్నిసార్లు అలా ప్రశ్నించుకున్నా - ఖచ్చితమైన, నమ్మకమైన సమాధానం దొరకలేదు... ఆ ఉత్తరంలో ఏదో తిరకాసుందని నిర్ధారణ చేసుకున్నాడు. వెంటనే మళ్లీ కవరులోకి నిశితంగా చూశాడు... అందులోని భాష,శైలి, ముఖ్యంగా ఆ సంబోధనా గమనిస్తే అచ్చం తన తండ్రి రాసినట్టే అనిపించింది. అంతకు నాలుగు రోజుల ముందు-తన తండ్రి రాసిన ఉత్తరంలోని చేతివ్రాతతో దాన్ని పోల్చి చూడాలనుకున్నాడు.

ఆత్రంగా ఆ ఉత్తరంకోసం వెతికాడు...కానీ అది కనిపించలేదు. "అసలింతకీ ఈ ఉత్తరం తన తండ్రి కాక మరెవరు రాసుంటారు?...అలా రాయాల్సిన అవసరం ఎవరి కుంటుంది?" జుట్టు పీక్కుంటూ ఆలోచించాడు. అతని వ్యవహారాన్ని దూరంగా వుండి గమనిస్తున్న అశ్విని అక్కడకు వచ్చింది.

ఆమెను చూడగానే శ్రీరామ్‌కి అనుమానం కలిగింది. అవధాని ద్వారా ఆ ఉత్తరాన్ని అశ్విని పంపించి ఉండాలనుకున్నాడు.

"హలో శ్రీరామ్ ఏమిటీ వర్రీగా వున్నావు?" కొంటెగా చూస్తూ అడిగింది అశ్వని.

అంతలోనే తనను ఉడికించటానికే అలా అడిగిందని అర్థం చేసుకున్నాడు. "ఇన్నాళ్ళూ ఆకాశరామన్నల గురించే వినేవాళ్ళం!...ఇపుడు 'ఆకాశ సీత'లు కూడా తయారయ్యా రేమిటా అని వర్రీ అవుతున్నాను" చెప్పాడు.

"ఆకాశ సీతలా?"ఆశ్చర్యం నటించింది అశ్వని.

"ఇదిగో ఈ ఉత్తరం చూడు నీకే బోధపడుతుంది. ధైర్యంగా రాసే దమ్ములేక ఎవరో మా నాన్న రాసినట్టు రాశారు." ఆ కవర్ని విసురుగా ఆమె చేతికి అందించాడు.

"ఒరేయ్! శుంఠాగ్రేశ్వర చక్రవర్తీ!" కవరు తెరచి మొదటి వాక్యాన్ని చదివింది అశ్వని.



"పైకి చదవక్కర్లేదు.....లోపల చదువుకోవచ్చు!" కోపాన్ని అణుచుకుంటూ అన్నాడు శ్రీరామ్.

వస్తున్న నవ్వును బలవంతంగా ఆపుకుంటూ-ఉత్తరాన్ని మనసులోనే గబగబా చదివేసిందామె. "భలే వుంది! ఒకవేళ మీ నాన్నగారే రాశారేమో దీన్ని!"-అడిగింది.

"నెవ్వర్! ఛస్తే అలా రాయరాయన!"

"మరైతే ఎవరు రాసుంటారబ్బా?"

"ఇంకెవరూ? తమరే! ఆ మాత్రం తెలుసుకోలేని చవటదద్దమ్మ కాను!" ఆమె చేతిలోంచి ఆ కవర్ని మళ్ళీ లాక్కుంటూ అన్నాడు.

"నేనా?"తెల్లబోయినట్టు చూసింది అశ్వని.

"ఔను!...ముమ్మాటికీ నువ్వే!....అయినా నాతో ఎందుకిలా ఆటలాడుకుంటావ్? నీకు పుణ్యం వుంటుంది.... చేతులు జోడిస్తాను... నన్నొదిలెయ్ అశ్వనీ..."- అంటూ దణ్ణం పెట్టాడు.

అశ్వని ముఖకవళికలు గంభీరంగా మారిపోయాయి. "నిజమే శ్రీరామ్!..నీతో ఆటలే ఆడుతున్నాననుకో!.. కానీ అది దొంగాట మాత్రం కాదు. ప్రేమాట!...'లవ్ గేమ్'...! నువ్ వద్దన్నకొద్దీ నేను దగ్గరవుతాను.. గుర్తుంచుకో!" సూటిగా అతనివైపే చూసి చెప్పింది.

మళ్లీ మరో అడుగు ముందుకు వేసి చెప్పింది -

"శ్రీరామ్! 'లవ్ ఎట్ ఫస్ట్ సైట్' అంటారు తెలుసా?..అంటే తొలిచూపు లోనే ప్రేమ కలగటం!..నేను కాలేజీలో చేరిన తొలిరోజునే లెక్చరర్ అడిగిన ఓ ప్రశ్నకి నువ్ హుందాగా నిలబడి సమాధానం చెప్తూంటే - నిన్ను అలవోకగా చూసిన నేను నాకు తెలియకుండానే ప్రేమించాను... ఒకప్పుడు కాకపోతే మరొకప్పుడైనా నువ్ నన్ను చూస్తావనీ నా ప్రేమను 'ఓకే' చేస్తావని ఆశపడ్డాను!".

"అది దురాశ అవుతుందని చాలాసార్లు చెప్పాను!"- మధ్యలోనే ఆమె మాటల్ని




తుంచేస్తూ అన్నాడు శ్రీరామ్.

"అదే!..'ఎందుకూ' అని నేనూ చాలాసార్లు అడిగేను...! నాకేం తక్కువ?... 'పడిచచ్చేటంత' పిచ్చిప్రేమ కూడా వుంది... అలాంటి నన్ను నిజంగానే పిచ్చిదాన్ని చేసి మానాన్నకి ఆకాశరామన్న ఉత్తరం రాశావ్!"

ఆ మాటతో శ్రీరామ్ కొంచెం మెత్తపడ్డాడు.

అంతలో హేండ్‌బ్యాగ్ లోంచి ఆ కాగితం తీసి అతనికి చూపిస్తూ అడిగింద్లి - "ఇది నువ్వు రాయలేదూ!"

శ్రీరామ్ తల వంచుకున్నాడు.

"నాకు తెలుసు నువ్వే రాశావని! అందుకే దీనికి జవాబుగా దాన్ని నేను రాశాను! ఆనాడు రాత్రి నీరూమ్ లోకి వచ్చినప్పుడు బల్లమీద కనిపించిన ఇన్‌లాండ్ లెటర్ని - నిన్ను ఆటపట్టించాలని - నేనుతీసి - నా బ్యాగ్‌లో వేసుకున్నాను. ఆ తర్వాత దాన్ని యథాలాపంగా చూశాను. మీ నాన్న గారు రాసినట్టు గ్రహించాను. అందులోని భాషా, శైలీ నాకు వింతగా అనిపించి - ఉత్తరం మొత్తం చదివేను... అదేస్టయిల్ లో... - మీ నాన్నగార్ని అనుకరిస్తూ రాశాను. తప్పయితే క్షమించు... కానీ నా ప్రార్థన ఒక్కటే!... నన్ను దూరం చేయాలని ప్రయత్నించకు!... దగ్గరకు ఎలా తీసుకోవాలో ఆలోచించు!...నా మీద ప్రేముందని ఒకనాడు నువ్వేచెప్పావ్!.. మనసుంటే మార్గం అదే దొరుకుతుంది."- అంటూనే- అతని జవాబుకోసం ఎదురు చూడకుండా- అక్కణ్ణించి వేగంగా వెళ్లిపోయింది అశ్వని.

నిశ్చేష్టుడై ఆమెవైపు చూస్తూ....తన చేతిలో వున్న ఉత్తరాన్ని అప్రయత్నంగా చింపేశాడు శ్రీరామ్...

****

"మహాప్రభో...నమస్కారం!"

వీధి అరుగు మీద-పడక కుర్చీలో పడుకుని పేపరు చదువుతున్న వీరభద్రం ఆ సంబోధన విని - పేపరులోంచి బయటకు చూశాడు.

మెట్లమీద చేతులు కట్టుకుని నిలబడి-దీనవదనంతో చూస్తున్న పూజారి కేశవయ్య కనిపించాడు.

"ఏమిటి కేశవయ్యగారూ!.. ఉదయముననే వేంచేసితి రేమిటి?...మీ కుమార్తె వివాహము-సెటిలైనదటకదా!.. ముహూర్తము పెట్టించినారా?"-పేపరు మడిచి పక్కన పెడుతూ అడిగాడు వీరభద్రం.

"మగపెళ్ళివారు-ఎనభైవేల మేరకు లాంఛనాలు కావాలని పట్టుబడుతున్నారు మాష్టారూ"

"లాంఛనాలా?.. అట్లయిన,వారికి తగిన శిక్ష విధించవలసిందే!..మీరు నిర్భయముగా ఉండండి. ఆ సంబంధం కాకున్న- దానికి మించిన మంచి సంబంధం మరి ఒకటి చూసి - కట్న కానుకల ప్రసక్తి లేకుండా నేను సెటిల్ చేస్తాను!.."-అంటూ అభయమిచ్చాడు వీరభద్రం.

"మంచిది మాష్టారూ!..మరి నాకు శలవు!"-మరో సారి చేతులు జోడించి వెళ్ళిపోయాడు కేశవయ్య.

అప్పుడే కాఫీ తెచ్చి భర్తకు అందించింది పార్వతమ్మ. "అల్లుడుగారూ, అమ్మాయీ ఎల్లుండి వెళ్ళిపోతారు...గుర్తుందా?"- అడిగింది.

"గుర్తులేని ఎడల మరణదండన విధిస్తారా?"

"ఈ ఏడు పంటడబ్బులో అల్లుడుగారికి ఇవ్వాల్సిన కట్నం బాకీ డబ్బు నలభైవేలూ ఇచ్చేస్తానన్నారుగా!?"

"ఇవ్వని ఎడల-వారు మాకు మరణదండన విధిస్తారా?" అన్నాడు వీరభద్రం.

భర్త ధోరణి పార్వతమ్మకు చిరాకు కలిగించింది. "మరణదండన కాదు మన పరువు గంగలో కలుస్తుంది...ఇప్పటికి రెండేళ్ళనించీ వాయిదాలు వేస్తున్నారు. ఈసారైనా ఇవ్వకపోతే బావుండదు!"-చెప్పింది.

"ఈ మాట నువ్వు ఇదివరక్కూడా ఓ సారి చెప్పావు!..నేను 'మండల మామల సంఘా'నికి



అధ్యక్షుడినన్న మాటను మరోసారి గుర్తు చేస్తున్నాను.... కట్నకానుకలు కానీ, లాంఛనములు కానీ, ఇచ్చుటా, స్వీకరించుటా మా సంఘం అంగీకరించదు. మనసా,వాచా, కర్మణా ఆ కట్టుబాటుకై లొంగి వుండవలెనన్నది-నా సిద్ధాంతం!.. ఇక రాద్ధాంతము చేయకు-దయచెయ్యి!.."

సరిగ్గా అదే క్షణంలో-నారాయణ పాట పాడుకుంటూ లోపలకు ప్రవేశించాడు.

'ఈ జీవనతరంగాలలో-ఆ దేవుని చదరంగంలో ఎవరికి ఎవరూ సొంతమూ-ఎంతవరకీ బంధము....' అంటూ ఇంకా పాడబోతూనే-ఎదురుగా కనిపించిన వీరభద్రాన్ని చూసి ఠక్కున పాట ఆపేశాడు.

"బాబుగోరూ! తమరింకా ఇంట్లోనే వుండి పోయారేమిటీ?..అవతల కొంపంటుకుంది"-అన్నాడు భుజంమీది తుండుగుడ్డతో ముఖం తుడుచుకుంటూ.

"ఏమిటి నారాయణా...ఏం జరిగిందీ?" గాభరాగా అడిగింది పార్వతమ్మ.

"కొంపంటు కుందమ్మ గోరూ!"-అతని నోట మళ్ళీ అదే మాట!

"ఎవరి కొంపరా?".. పార్వతమ్మది మళ్లీ అదే ప్రశ్న!

"ఇంకెవరి కొంపండీ?..మామల సంగం 'సెక్కట్రీ' గారులేరండీ? ఆరిది!"

"ఇంతకీ విషయం వివరించి చావకుండా ఏమిటా అఘోరింపు?.. అప్పారావ్‌కి ఏమైంది?" వీరభద్రం విరుచుకు పడ్డాడు.

"సిత్తం!..మొన్న ఆరింటికి- అల్లుడు గారొచ్చేరు కదండీ?"

"అవును!..పండుగలకు అల్లుళ్లు మామల ఇళ్ళకు రావటం మామూలే!.. మనింటికి - మా అల్లుడు కూడా వచ్చివున్నాడుగా?"- అసహనంగా అన్నాడు వీరభద్రం.

"ఇంతకీ వాళ్ళ అల్లుడు వస్తే ఏం జరిగిందేమిటి నారాయణా?"- ఏదో కీడు శంకిస్తూ అడిగింది పార్వతమ్మ మరింత ఆత్రంగా.

"ఇవాళ కొంప అంటించాడు అమ్మగోరూ!"

"అయ్యో బంగారంలాంటి ఇల్లు.. కట్టి పదేళ్లుకూడా కాలేదు...కోటలావుండే ఇల్లు...ఎలా అంటించాడురా?..అసలేం జరిగింది?"-బుగ్గలు నొక్కుకుంటూ ప్రశ్నించింది.

"అబ్బ మీరుండండమ్మా... వరసలో సెప్పుకొస్తన్నాగా?...మొన్న వాళ్ళల్లుడు వచ్చి నిన్న వాళ్ళ మావగార్ని- "మావా, నేనో 'లారీ' కొనుక్కుంటానూ ..డబ్బియ్యి" అని అడిగాట్ట!"

"బొమ్మ లారీయా?"

"అబ్బ కాదమ్మగోరూ! నిజం లారీయే!"

"అఘోరించినట్టే వుంది...ఎవరైనా ఒక మణికట్టు గడియారమో-ద్విచక్రవాహనమో అడుగుతారు.... కానీ 'లారీ' ఏమిటి!..ఇంకా నయం!- రైలో,విమానమో కొనివ్వమని కోరలేదు!"-మధ్యలో మండిపడుతూ అన్నాడు వీరభద్రం.

"చిత్తం అల్లుడుగారు ఏదో దిగుమతి ఎగుమతి యాపారం చేసుకుంటారంట బాబూ! అందుకని లారీ అడిగేరు!"

"రుణముగానా?.. బేవార్సుగానా?"

"రుణముగా ఇమ్మని అడిగితే కొంపెందుకు మునుగుతాదండీ?.. 'బేవార్సు' గానే ఇమ్మన్నార్టండి!"-చెప్పాడు నారాయణ.

"ఆహా?..మామల సంఘానికి కార్యదర్శి అయ్యుండి-సంఘం కట్టుబాటూ,రూల్సూ అన్నీ గంగపాలు చేసి అడిగిన కానుక ఇచ్చెదరని భావించాడా,ఆ దశమగ్రహం?".

"ఆమాటే అప్పారావుగారు కూడా చెప్పి-ఒప్పించాలని ప్రయత్నించారంటండి! కానీ అల్లుడుగోరు ఇన్లేదండి!... 'లారీ కొనిస్తారా?..మీ అమ్మాయిని మీ ఇంట్లోనే వుంచేనుకుంటారా'-అని నిలదీసి అడిగారంట!"

"ఏమి పొగరూ?"- ఆశ్చర్యాన్ని ప్రకటించాడు వీరభద్రం.

"చిత్తం?..పొగరేనండీ!"

"ఇంతలో అసలేం జరిగిందో పూర్తిగా చెప్పరా!"- పార్వతమ్మ అతృతను ఆపుకోలేక పోయింది.

"అప్పుడేం జరిగిందంటే కూతురి కాపురం ఎక్కడ కూలిపోద్దోననీ అల్లుడుగోరి సేతిలో నాలుగు లచ్చలకు 'సెక్కె'ట్టి అప్పారావుగోరేమో రెండు సీసాల నిద్ర మాత్రలు నోట్లో పోసుకున్నారంట!"..

"అంతే మరి అది మా కట్టుబాటు!..రేపు మనల్లుడు మొండికెత్తినా నాకు అదేదారి కదా!" అన్యాపదేశంగా పార్వతమ్మతో అన్నాడు వీరభద్రం.

ఉలిక్కిపడి భర్తవైపు చూసింది పార్వతమ్మ...

"మన అల్లుడు ఆ అప్పారావుగారి అల్లుడిలాగా లారీలు, బస్సులూ అడగటం లేదులెండి!..అతనికివ్వాల్సిన కట్నం బాకీ 'డబ్బు' ఇచ్చేస్తే చాలు...విమానం కొని తెచ్చినంత ఆనందిస్తాడు!"-చెప్పింది.

"విలువ ఎంతటిదైననూ కట్నం కట్నమే!"

"మీ మూర్ఖత్వం మీదే!" అని విసురుగా చూసి వంటింట్లోకి వెళ్లిపోయింది పార్వతమ్మ.

"ఆఁ..నేను పోయి అప్పారావు భౌతిక కాయంపైన పుష్పగుచ్ఛాన్ని వుంచి శ్రద్ధాంజలి ఘటించి వస్తా!" అంటూ కండువా భుజం మీద వేసుకున్నాడు వీరభద్రం.

వెంటనే నారాయణ ఖంగారుగా చూస్తూ చెప్పాడు "అయ్యబాబోయ్ ఆరింకా పోలేదండీ!.. ఆసుపత్రిలో సేర్పించారు.. 'పేనగండం' లేదని డాట్టర్లు సెప్పారంట!"

"పోనీలే!..బ్రతికిపోయాడు!"-అనుకున్నాడు వీరభద్రం.

గుడికివెళ్ళిన రాజేంద్ర,గీత అప్పుడే తిరిగి వచ్చారు... వాళ్ళరాకను గమనించిన వీరభద్రం వాళ్ళకు వినిపించేలా అన్నాడు మళ్లీ "అయిననూ ఈ అల్లుళ్ళ ఆరళ్ళకు అంతు లేకుండా పోతున్నది!..వీటిని అరికట్టుటకు - దేశవ్యాప్తంగా మా సంఘం శాఖలుగా ఏర్పడి ఉద్యమించవలసి వుంటుంది!"

రాజేంద్ర ఆ మాటలు విన్నాడు!

-(ఇంకావుంది)



ఫిబ్రవరి 1 బ్రహ్మానందం పుట్టినరోజు సందర్భంగా...

# బ్రహ్మానందం నటించిన చిత్రాల వివరాలు...



| | | |
|---|---|---|
| 1. | తాతావతారం | వేజేళ్ల సత్యనారాయణ |
| 2 | సత్యాగ్రహం | జంధ్యాల |
| 3. | చక్రవర్తి | ఎన్.ఎన్.రవిచంద్ర |
| 4. | పసివాడి ప్రాణం | ఎ.కోదండరామిరెడ్డి |
| 5. | స్వయంకృషి | కె.విశ్వనాథ్ |
| 6. | రుద్రవీణ | కె.బాలచందర్ |
| 7. | అహనాపెళ్ళంట | జంధ్యాల |
| 8. | చిన్నికృష్ణుడు | జంధ్యాల |
| 9. | వివాహభోజనంబు | జంధ్యాల |
| 10. | చినబాబు | మోహన్ గాంధీ |
| 11. | రావుగారిల్లు | తరణి |
| 12. | జానకిరాముడు | కె.రాఘవేంద్రరావు |
| 13. | నీకు నాకు పెళ్ళంట | జంధ్యాల |
| 14. | చిక్కడు దొరకడు | రేలంగి నర్సింహారావు |
| 15. | మహారాజశ్రీ మాయగాడు | విజయబాపినీడు |
| 16. | త్రినేత్రుడు | కోదండరామిరెడ్డి |
| 17. | చూపులు కలసిన శుభవేళ | జంధ్యాల |
| 18. | బంధువులొస్తున్నారు జాగ్రత్త | శరత్ |
| 19. | ఊరంతా గోలంట | మణిశంకర్ |
| 20. | న్యాయంకోసం | రవిరాజా పినిశెట్టి |
| 21. | దొంగకోళ్ళు | విజయబాపినీడు |
| 22. | మరణమృదంగం | కోదండరామిరెడ్డి |
| 23. | హైహై నాయకా...! | జంధ్యాల |
| 24. | పూలరంగడు | రేలంగి నర్సింహారావు |
| 25. | భలేదొంగ | కోదండరామిరెడ్డి |
| 26. | పాపే మా ప్రాణం | వి.మదుసూధనరావు |
| 27. | ముత్యమంతముద్దు | రవిరాజా పినిశెట్టి |
| 28. | రుద్రనేత్ర | కె.రాఘవేంద్రరావు |
| 29. | అత్తకుయముడు అమ్మాయికి మొగుడు | ఎకోదండరామిరెడ్డి |
| 30. | ఒంటరి పోరాటం | కె.రాఘవేంద్రరావు |
| 31. | తాతయ్యపెళ్ళి మనవడి శోభనం | సాహితి |
| 32. | రాజకీయ చదరంగం | పి.చంద్రశేఖర్ రెడ్డి |
| 33. | భలేదంపతులు | కోడి రామకృష్ణ |
| 34. | బొమ్మమాట బంగారుబాట | రాజశేఖర్ |
| 35. | అగ్ని | కె.రాఘవేంద్రరావు |
| 36. | కొండవీటి దొంగ | ఎ.కోదండరామిరెడ్డి |
| 37. | ప్రేమ | నరేష్ కృష్ణ |
| 38. | రక్తాభిషేకం | ఎ.కోదండరామిరెడ్డి |
| 39. | జయమ్ము నిశ్చయమ్మురా... | జంధ్యాల |
| 40. | మంచివారు మావారు | మత్యాల సుబ్బయ్య |
| 41. | లంకేశ్వరుడు | దాసరి నారాయణరావు |
| 42. | టు టౌన్ రౌడి | దాసరి నారాయణరావు |
| 43. | సీతారత్నంగారబ్బాయి | ఇ.వి.వి సత్యనారాయణ |
| 44. | ఆర్తనాదం | యం.వి.రఘు |
| 45. | జాలకటక | విజయబాపినీడు |
| 46. | ప్రాణానికి ప్రాణం | చలసాని రామారావు |
| 47. | ఖైదీ దాదా | పరిటాల ఓంకార్ |
| 48. | పైలాపచ్చీసు | శివనాగేశ్వరరావు |
| 49. | శిలాశాసనం | కోడి రామకృష్ణ |
| 50. | లారీ డ్రైవర్ | బి.గోపాల్ |
| 51. | జగదేకవీరుడు | సాగర్ |
| 52. | రాజా విక్రమార్క | రవిరాజా పినిశెట్టి |
| 53. | ధృవ నక్షత్రం | వై.నాగేశ్వరరావు |
| 54. | ఇదేం పెళ్ళాం బాబోయ్ | కాట్రగడ్డ రవితేజ |
| 55. | సాహసపుత్రుడు | రవిరాజా పినిశెట్టి |
| 56. | రౌడియిజం జిందాబాద్ | దాసరి నారాయణరావు |
| 57. | రావుగారింట్లో రౌడీ | తరణి |
| 58. | బొబ్బిలి రాజా | బి.గోపాల్ |
| 59. | చెవిలో పువ్వు | ఇ.వి.వి సత్యనారాయణ |
| 60. | మా ఇంటి కథ | ముత్యాల సుబ్బయ్య |
| 61. | కొదమ సింహం | మురళీమోహన్‌రావు |
| 62. | శత్రువు | కోడిరామకృష్ణ |
| 63. | నా పెళ్ళాం నా యిష్టం | గెద్దాడ ఆనందబాబు |
| 64. | మహాజనానికి మరదలుపిల్ల | విజయబాపినీడు |
| 65. | కలియుగ రుద్రుడు | *** |
| 66. | ప్రేమా జిందాబాద్ | జంధ్యాల |
| 67. | తేనెటీగ | నందకుమార్ |
| 68. | సంసారవీణ | ముత్యాల సుబ్బయ్య |
| 69. | పద్మావతి కళ్యాణం | ముత్యాల సుబ్బయ్య |
| 70. | దోషి నిర్దోషి | వై.నాగేశ్వరరావు |
| 71. | స్వవర్ణపురం పోలీసు స్టేషన్ | యండమూరి వీరేంద్రనాథ్ |
| 72. | వహ్ వహ్ శ్రీ | శరత్ |
| 73. | పాపకోసం | మధు |
| 74. | లేడీస్ స్పెషల్ | జంధ్యాల |
| 75. | ఇంద్రజిత్ | గిరిబాబు |
| 76. | విచిత్ర ప్రేమ | జంధ్యాల |
| 77. | దాదర్ ఎక్స్‌ప్రెస్ | సత్యారెడ్డి |
| 78. | మౌనదీపం | వేజెళ్ళ |
| 79. | కీచురాళ్ళు | గీతాకృష్ణ |
| 80. | అమ్మ | నరేష్ కృష్ణ |
| 81. | శ్రీశైలం భ్రమరాంబిక | విఠలాచార్య |
| 82. | ప్రేమఖైదీ | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 83. | ఆత్మబంధం | సునీల్ వర్మ |
| 84. | అసెంబ్లీ రౌడీ | బి.గోపాల్ |
| 85. | బావా బావా పన్నీరు | జంధ్యాల |
| 86. | నా ఇల్లే నా స్వర్గం | కె.వి.రెడ్డి, రుష్యేందర్ రెడ్డి |
| 87. | ప్రేమ శిఖరం | సత్యా |
| 88. | కూలీ నెం.1 | కె.రాఘవేంద్రరావు |
| 89. | కలికాలం | ముత్యాల సుబ్బయ్య |
| 90. | చిత్రం భళారే విచిత్రం | పి.ఎన్.రామచంద్రరావు |
| 91. | క్షణక్షణం | రామ్‌గోపాల్ వర్మ |
| 92. | ఇంట్లో పిల్లి - వీధిలో పులి | పి.ఎన్.రామచంద్రరావు |
| 93. | మైనర్‌రాజా | కాట్రగడ్డ రవితేజ |
| 94. | యుగళగీతం | ఫణి సుందర్ |
| 95. | ఆదిత్య 369 | సింగీతం శ్రీనివాసరావు |
| 96. | ప్రేమ పంజరం | బి.వి.రమణారెడ్డి |
| 97. | ప్రయత్నం | పరుచూరి బ్రదర్స్ |
| 98. | పట్టుదల | జి.సి.శేఖర్ |
| 99. | ప్రేమద్రోహి | రమణారెడ్డి |
| 100. | సర్పయాగం | పరుచూరి బ్రదర్స్ |
| 101. | ప్రాణదాత | శరత్ |
| 102. | ప్రేమచిత్రం పెళ్ళి విచిత్రం | కె.వాసు |
| 103. | పిచ్చి పుల్లయ్య | కె.వాసు |
| 104. | అప్పుల అప్పారావు | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 105. | రౌడీగారి పెళ్ళాం | కె.యస్.ప్రకాష్ |
| 106. | 420 | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 107. | చంటి | రవిరాజా పినిశెట్టి |
| 108. | రౌడీ అల్లుడు | కె.రాఘవేంద్రరావు |
| 109. | అల్లరి మొగుడు | కె.రాఘవేంద్రరావు |
| 110. | *** | దేవి |
| 111. | చాంపియన్ | వై.నాగేశ్వరరావు |
| 112. | సుబ్బారాయుడి పెళ్ళి | దాసరి నారాయణరావు |
| 113. | పబ్లిక్ రౌడీ | సాగర్ |
| 114. | కిల్లర్ | ఫాజిల్ |
| 115. | సమర్పణ | ఫాజిల్ |
| 116. | పెళ్లినీకు శోభనం నాకు | పి.యన్.రామచంద్రారావు |
| 117. | గౌరమ్మా నీ మొగుడెవరమ్మ | శివానంద్ |
| 118. | అయ్యప్పస్వామి దీక్షలు | కె.వాసు |
| 119. | లోఫర్ మామా సూపర్ అల్లుడు | రేలంగి నర్సింహరావు |
| 120. | అబ్బాయిగారు | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 121. | ప్రేమ తపస్సు | డా॥శివప్రసాద్ |
| 122. | డబ్బు భలే జబ్బు | కె.రాజేంద్ర |
| 123. | ప్రేమ ఎంత మధురం | జంధ్యాల |
| 124. | రౌడీ ఇన్‌స్పెక్టర్ | బి.గోపాల్ |
| 125. | రక్త తర్పణం | కృష్ణ |
| 126. | పర్వతాలు - పానకాలు | రేలంగి నర్సింహరావు |
| 127. | బాబాయ్ హోటల్ | జంధ్యాల |
| 128. | సరసాల సోగ్గాడు | సత్యప్రసాద్ |
| 129. | అయ్యయ్యో బ్రహ్మయ్య | ఆకెళ్ల |
| 130. | పెళ్ళానికి ప్రేమలేఖ | రేలంగి నర్సింహరావు |
| 131. | ఘరానా మొగుడు | కె.రాఘవేంద్రరావు |
| 132. | అహంకారి | దాసరి నారాయణరావు |
| 133. | ఆదర్శం | పి.యన్.రామచంద్రరావు |
| 134. | మదర్ ఇండియా | బి.వి.రమణారెడ్డి |
| 135. | అత్తకి కొడుకు మామకు అల్లుడు | వై.నాగేశ్వరరావు |
| 136. | జంబలకడిపంబ | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 137. | బ్రహ్మ | బి.గోపాల్ |
| 138. | సూరిగాడు | దాసరి నారాయణరావు |
| 139. | భలేఖైదీలు | వల్లభనేని జనార్దన్ |
| 140. | పెళ్ళాంచాటు మొగుడు | రేలంగి నర్సింహారావు |
| 141. | రేపటిరౌడీ | సాగర్ |
| 142. | పెళ్ళంటే నూరేళ్ళపంట | ముత్యాల సుబ్బయ్య |
| 143. | కాలేజీ బుల్లోడు | శరత్ |
| 144. | సుందరకాండ | కె.రాఘవేంద్రరావు |
| 145. | మావారికి పెళ్ళి | రామనారాయణ |
| 146. | నాగజ్యోతి | తమ్మారెడ్డి భరద్వాజ |
| 147. | మొండిమొగుడు పెంకిపెళ్ళాం | వై.నాగేశ్వరరావు |
| 148. | ఆపద్బాంధవుడు | కె.విశ్వనాథ్ |
| 149. | ప్రెసిడెంటుగారి పెళ్ళాం | ఎ.కోదండరామిరెడ్డి |
| 150. | చెమ్మచెక్క | *** |
| 151. | ఇల్లు పెళ్ళి | ముత్యాల సుబ్బయ్య |
| 152. | రైతు భారతం | త్రిపురనేని మహారధి |
| 153. | ఆ ఒక్కటీ అడక్కు | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 154. | అశ్వమేధం | కె.రాఘవేంద్రరావు |
| 155. | ముఠామేస్త్రి | ఎ.కోదండరామిరెడ్డి |
| 156. | దొంగపోలీస్ | కె.ఎన్.ప్రకాష్ |
| 157. | తొలిముద్దు | రుష్యేందర్ రెడ్డి |
| 158. | గ్యాంగ్ వార్ | కోడిరామకృష్ణ |
| 159. | మెరుపు | గోపీచంద్ |
| 160. | అమ్మరాజీనామా | దాసరి నారాయణరావు |
| 161. | చిట్టెమ్మ మొగుడు | ఎ.కోదండరామిరెడ్డి |
| 162. | వెంకన్నబాబు | దాసరి నారాయణరావు |
| 163. | బలరామకృష్ణులు | రవిరాజా పినిశెట్టి |
| 164. | ఏంటిబావా మరీనూ | అజయ్‌కుమార్ |
| 165. | వియ్యాలవారి విందు | మణిశంకర్ |
| 166. | కొంగుచాటు కృష్ణుడు | అజయ్ కుమార్ |
| 167. | ఏవండీ ఆవిడొచ్చింది | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 168. | ప్రేమే నా ప్రాణం | అల్లాణి శ్రీధర్ |
| 169. | కొక్కొరకో | డా॥శివప్రసాద్ |
| 170. | మనీ | శివనాగేశ్వరరావు |
| 171. | రాజేశ్వరి కళ్యాణం | క్రాంతికుమార్ |
| 172. | వారసుడు | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 173. | అల్లరి ప్రియుడు | కె.రాఘవేంద్రరావు |
| 174. | మామాకోడలు | శరత్ |
| 175. | గాండీవం | ప్రియదర్శిన్ |
| 176. | రాజేంద్రుడు - గజేంద్రుడు | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 177. | పెళ్ళామా మజాకా | రేలంగి నర్సింహారావు |
| 178. | ఇన్‌స్పెక్టర్ అశ్వని | మౌళి |
| 179. | నక్షత్ర పోరాటం | సాగర్ |
| 180. | పరువు ప్రతిష్ఠ | గుహానాథన్ |
| 181. | అంగరక్షకుడు | జోషి |
| 182. | మెకానిక్ అల్లుడు | బి.గోపాల్ |
| 183. | రక్షణ | ఉప్పలపాటి నారాయణరావు |
| 184. | బంగారు బుల్లోడు | రవిరాజా పినిశెట్టి |
| 185. | పెళ్ళిగోల | ముత్యాల సుబ్బయ్య |
| 186. | కన్నయ్య - కిట్టయ్య | రేలంగి నర్సింహారావు |
| 187. | అమ్మకొడుకు | క్రాంతికుమార్ |
| 188. | కుర్రది - కుర్రాడు | రేలంగి నర్సింహారావు |
| 189. | కంకణ భాగ్య (కన్నడ) | పేరాల |
| 190. | రౌడీ మొగుడు | మోహన్ గాంధీ |
| 191. | మేజర్ చంద్రకాంత్ | కె.రాఘవేంద్రరావు |
| 192. | ఆత్మ | *** |
| 193. | అల్లరి అల్లుడు | ఎ.కోదండరామిరెడ్డి |
| 194. | అన్న | ముత్యాల సుబ్బయ్య |
| 195. | చిన్నా | దాసరి నారాయణరావు |
| 196. | మాయలోడు | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 197. | ప్రేమ & కో | వంశీ |
| 198. | రౌడీ టీచర్ | బి.ఎల్.వి.ప్రసాద్ |
| 199. | శ్రీదేవి నర్సింగ్‌హోం | గెద్దాడ ఆనందబాబు |
| 200. | అన్నా - వదిన | పి.సి.రెడ్డి |
| 201. | ప్రెసిడెంటుగారి అల్లుడు | సునీల్‌వర్మ |
| 202. | నాన్న అమ్మకావాలి | ఎన్.ఎన్.రవిచందర్ |
| 203. | శభాష్‌రాము | మోహన్ గాంధి |

| | |
|---|---|
| 204. మాతృదేవోభవ | కె.అజయ్‌కుమార్ |
| 205. శివరాత్రి | రామనారాయణ |
| 206. కుంతీ పుత్రుడు | దాసరి నారాయణరావు |
| 207. అక్కా చెల్లెలు | గుహనాథన్ |
| 208. బ్రహ్మచారి మొగుడు | శరత్ |
| 209. అలీబాబా అరడజను దొంగలు | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 210. తీర్పు | ఉప్పలపాటి నారాయణరావు |
| 211. ఓ తండ్రి ఓ కొడుకు | మౌళి |
| 212. నెంబర్‌వన్ | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 213. ముగ్గురు మొనగాళ్ళు | కె.రాఘవేంద్రరావు |
| 214. ఒన్ బై టు | శివనాగేశ్వరరావు |
| 215. పచ్చతోరణం | ఆదుర్తి భాస్కర్ |
| 216. ఫుంరానా అల్లుడు | ముప్పలనేని శివ |
| 217. నీకు 16 నాకు 18 | మణి |
| 218. యస్ నేనే నెం.1 | విజయ నిర్మల |
| 219. ఊర్మిళ | తమ్మారెడ్డి భరద్వాజ |
| 220. ముద్దుల ప్రియుడు | కె.రాఘవేంద్రరావు |
| 221. పేకాట పాపారావు | వై.నాగేశ్వరరావు |
| 222. అత్తాకోడళ్ళు | శరత్ |
| 223. పెళ్ళి కొడుకు | బాపు |
| 224. ఎన్.పి.పరుశరామ్ | రవిరాజా పినిశెట్టి |
| 225. అల్లరి ప్రేమికుడు | కె.రాఘవేంద్రరావు |
| 226. మనీ మనీ | శివనాగేశ్వరరావు |
| 227. హలో బ్రదర్ | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 228. గ్యాంగ్ మాస్టర్ | బి.గోపాల్ |
| 229. పుట్టినిల్లా మెట్టినిల్లా | సాయిప్రకాష్ |
| 230. మహిషాసుర మర్ధిని | మహేష్ కుమార్ |
| 231. ష్.గప్‌చుప్ | జంధ్యాల |
| 232. పల్నాటి పౌరుషం | ముత్యాల సుబ్బయ్య |
| 233. లక్కీఛాన్స్ | శివనాగేశ్వరరావు |
| 234. లీడర్ | పి.యన్.రామచంద్రరావు |
| 235. యమలీల | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 236. బొబ్బిలి సింహం | కోదండరామిరెడ్డి |
| 237. నమస్తే అన్న | కె.రంగారావు |
| 238. మిస్టర్ మాయలోడు | గోపిచందు |
| 239. సూపర్ పోలీస్ | మురళీ మోహన్‌రావు |
| 240. కిష్కింధకాండ | ప్రభాకర్ |
| 241. అల్లరోడు | అజయ్‌కుమార్ |
| 242. క్రిమినల్ | మహేష్‌భట్ |
| 243. మగరాయుడు | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 244. స్ట్రీట్‌ఫైటర్ | కోడిరామకృష్ణ |
| 245. టాప్‌హీరో | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 246. సూపర్‌మొగుడు | శరత్ |
| 247. పోలీసు అల్లుడు | బాలయ్య |
| 248. ఆమె | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 249. శుభలగ్నం | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 250. పోకిరి రాజా | ఎ.కోదండరామిరెడ్డి |
| 251. అమ్మదొంగ | సాగర్ |
| 252. మిస్ 420 | మౌళి |
| 253. శ్రీవారి ప్రియురాలు | మౌళి |
| 254. అమ్మాయి కాపురం | ముత్యాల సుబ్బయ్య |
| 255. చిన్నబ్బులు | ఎ.ఆర్.కె.మోహన్ |
| 256. రాజసింహ | కె.రాఘవేంద్రరావు |
| 257. అడవి దొర | సదాశివరావు |
| 258. నాన్నగారు | దాసరి నారాయణరావు |
| 259. లవ్‌గేమ్ | *** |
| 260. లేడీ బాస్ | కోడిరామకృష్ణ |
| 261. మాయదారి కుటుంబం | పురాణం సూర్య |
| 262. అల్లుడా మజాకా | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 263. ఘటోత్కచుడు | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 264. సాహసవీరుడు సాగరకన్య | కె.రాఘవేంద్రరావు |
| 265. కేటు - డూప్లికేటు | రేలంగి నర్సింహారావు |
| 266. దొరబాబు | వై.వెంకట్రావు |
| 268. డియర్ బ్రదర్ | కె.ప్రభాకర్ |
| 269. ఫుంరానా బుల్లోడు | కె.రాఘవేంద్రరావు |
| 270. అలీబాబా అద్భుతదీపం | సత్య |
| 271. మధ్యతరగతి మహాభారతం | ఉదయ్ భాస్కర్ |
| 272. రెండవ కృష్ణుడు | మల్లికార్జునరావు |
| 273. ఆయనకి ఇద్దరు | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 274. శుభమస్తు | భీమినేని శ్రీనివాసరావు |
| 275. ఎర్రోడు | ఆర్.నారాయణమూర్తి |
| 276. పుణ్యభూమి నా దేశం | ఎ.కోదండరామిరెడ్డి |
| 277. పెదరాయుడు | రవిరాజా పినిశెట్టి |
| 278. వంశానికొక్కడు | శరత్ |
| 279. తాజ్‌మహల్ | ముప్పలనేని శివ |
| 280. ఆంటీ | మౌళి |
| 281. తెలుగువీర లేవరా | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 282. అక్కుమ్ బక్కుమ్ | *** |
| 283. రిక్షావోడు | కోడిరామకృష్ణ |
| 284. లిటిల్ సోల్జర్స్ | గున్నం గంగరాజు |
| 285. స్వీటీ రోజా - టోపీరాజా | డా॥శివప్రసాద్ |
| 286. ఆడాళ్లా మజాకా | ముత్యాల సుబ్బయ్య |
| 287. సిసింద్రీ | శివనాగేశ్వరరావు |
| 288. సోగ్గాడి పెళ్లాం | ముత్యాల సుబ్బయ్య |
| 289. పెళ్ళిసందడి | కె.రాఘవేంద్రరావు |
| 290. వజ్రం | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 291. ధర్మచక్రం | సురేష్‌కృష్ణ |
| 292. అల్లుడిపోరు అమ్మాయి జోరు | ఎ.పి.చంద్ర |
| 293. ఓహోనాపెళ్ళంట | జంధ్యాల |
| 294. అక్కడ అమ్మాయి ఇక్కడ అబ్బాయి | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 295. అమ్మలేని పుట్టిల్లు | సాయిప్రకాష్ |
| 296. సంప్రదాయం | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 297. మమ్మీ... మీ ఆయనొచ్చాడు | అజయ్‌కుమార్ |
| 298. అనగనగా ఒకరోజు | కృష్ణవంశీ |
| 299. కాలేజీ స్టూడెంటు | జితేంద్ర |
| 300. బొబ్బిలి బుల్లోడు | కె.రంగారావు |
| 301. పిట్టలదొర | సానాయాదిరెడ్డి |
| 302. గమ్మం | అనిల్‌కుమార్ |
| 303. ఇంట్లో ఇల్లాలు వంటింట్లో ప్రియురాలు | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 304. మావిచిగురు | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 305. అదిరింది అల్లుడు | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 306. సరదా బుల్లోడు | రవిరాజా పినిశెట్టి |
| 307. జాబిలమ్మ పెళ్ళి | కోదండరామిరెడ్డి |
| 308. పెళ్ళాలరాజ్యం | మౌళి |
| 309. ప్రేమ ప్రయాణం | ముత్యాల సుబ్బయ్య |
| 310. క్రాంతి | సత్యం |
| 311. సహనం | పి.యన్.రామచంద్రరావు |
| 312. పుట్టింటి గౌరవం | విజయనిర్మల |
| 313. మా ఇంటి ఆడపడుచు | సాయిప్రకాష్ |
| 314. అబ్బాయిగారి పెళ్ళి | శరత్ |
| 315. బొంబాయి ప్రియుడు | కె.రాఘవేంద్రరావు |
| 316. అమ్మా నాన్న కావాలి | ఎస్.ఎస్.రవిచందర్ |
| 317. గన్‌షాట్ | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 318. పవిత్రబంధం | ముత్యాల సుబ్బయ్య |
| 319. అడవిలో అన్న | బి.గోపాల్ |
| 320. తారకరాముడు | ఉదయ్‌కుమార్.ఆర్.వి |
| 321. హిట్లర్ | ముత్యాల సుబ్బయ్య |
| 322. ముద్దుల మొగుడు | ఎ.కోదండరామిరెడ్డి |
| 323. చిలక్కొట్టుడు | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 324. తాళి | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 325. ఎగిరే పావురమా | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 326. శుభాకాంక్షలు | భీమినేని శ్రీనివాసరావు |
| 327. వీడెవడండీబాబు | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 328. తాత మనవడు | సదాశివరావు |
| 329. పెద్దన్నయ్య | శరత్ |
| 330. కుటుంబ గౌరవం | విజయనిర్మల |
| 331. లైఫ్‌లో వైఫ్ | రాజారవేష్ |
| 332. రాజహంస | సింగీతం శ్రీనివాసరావు |
| 333. తాళికట్టు శుభవేళ | కృష్ణ మోహన్ |
| 334. ప్రియరాగాలు | ఎ.కోదండరామిరెడ్డి |
| 335. అరుంధతి | క్రాంతికుమార్ |
| 336. అయ్యిందా లేదా | భరత్ |
| 337. అన్నమయ్య | కె.రాఘవేంద్రరావు |
| 338. రాజా | కోదండరామిరెడ్డి |
| 339. సూపర్ హీరోస్ | ఎ.వి.యస్ |
| 340. కళ్యాణ ప్రాప్తిరస్తు | దాసరి నారాయణరావు |
| 341. అమ్మో అల్లుడా... | శరత్ |
| 342. హలో గురూ | వై.వెంకట్రావు |
| 343. అమ్మా..అమ్మనిచూడాలి | సాగర్ |
| 344. అక్కా...బాగున్నావా...? | మౌళి |
| 345. కుర్రాళ్ళరాజ్యం | కాదంబరి కిరణ్ |
| 346. ఓసి నా మరదలా | సాగర్ |
| 347. ఒక చిన్నమాట | ముత్యాల సుబ్బయ్య |
| 348. ఆయనగారు | సత్య |
| 349. కోరుకున్న ప్రియుడు | ముప్పలనేని శివ |
| 350. జై భజరంగభళి | కె.ప్రభాకర్ |
| 351. నేను ప్రేమిస్తున్నాను | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 352. మావా..బాగున్నావా | కోడిరామకృష్ణ |
| 353. పెళ్ళి | కోడిరామకృష్ణ |
| 354. గోకులంలో సీత | ముత్యాల సుబ్బయ్య |
| 355. పట్టుకోండి చూద్దాం | శివ నాగేశ్వరరావు |
| 356. వా అమ్మో ఓ అత్తో | శివ నాగేశ్వరరావు |
| 357. కలక్టరుగారు | బి.గోపాల్ |
| 358. ప్రియా ఓ ప్రియా | ముప్పలనేని శివ |
| 359. ఆరోప్రాణం | వీరు.కె |
| 360. మాస్టర్ | సురేష్ కృష్ణ |
| 361. పెళ్ళి చేసుకుందాం | ముత్యాల సుబ్బయ్య |
| 362. ఆవిడా మా ఆవిడే | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 363. పరదేశి | కె.రాఘవేంద్రరావు |
| 364. మావిడాకులు | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 365. ఊయల | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 366. దీర్ఘసుమంగళీభవ | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 367. ఆల్ రౌండర్ | కె.ప్రభాకర్ |
| 368. నిధి | ప్రసాద్ |
| 369. ఆటోడ్రైవర్ | సురేష్‌కృష్ణ |
| 370. అందరూ హీరోలే | సి.హెచ్.ఉమాకాంత్ |
| 371. గణేష్ | తిరుపతిస్వామి |
| 372. రాయుడు | రవిరాజా పినిశెట్టి |
| 373. గిల్లికజ్జాలు | ముప్పలనేని శివ |
| 374. కన్యాదానం | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 375. ఓ పనైపోతుంది బాబూ | శివనాగేశ్వరరావు |
| 376. గ్రీకువీరుడు | దాసరి నారాయణరావు |
| 377. లవ్ 99 | కె.రాఘవేంద్రరావు |
| 378. చూడాలనివుంది | గుణశేఖర్ |
| 379. మాంగల్యభాగ్యం | సాయిప్రకాష్ |
| 380. పెళ్లాడి చూపిస్తా | సాయిప్రకాష్ |
| 381. మీ ఆయన జాగ్రత్త | ఎమ్.రామదాసు |
| 382. బావగారూ బాగున్నారా | జయంత్ |
| 383. విచిత్రం | జంధ్యాల |
| 384. ప్రేమంటే ఇదేరా... | జయంత్ |
| 386. సమరసింహారెడ్డి | బి.గోపాల్ |
| 387. శుభలేఖలు | ముప్పలనేని శివ |
| 388. మాణిక్యం | ముత్యాలసుబ్బయ్య |
| 389. గాంధి | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 390. యమజాతకుడు | శంకర్ |
| 391. వెలుగు నీడలు | మౌర్య |
| 392. హలో యమా | పవిత్రన్ |
| 393. తమ్ముడు | అరుణ్‌ప్రసాద్ |
| 394. స్నేహంకోసం | కె.యస్.రవికుమార్ |
| 395. శ్రద్ధాంజలి | విష్ణున్ |
| 396. రాజా | ముప్పలనేని శివ |
| 397. ఇద్దరు మిత్రులు | కె.రాఘవేంద్రరావు |
| 398. మావా అల్లుడు | రేలంగి నర్సింహారావు |
| 399. కంటే కూతుర్నేకనాలి | దాసరి నారాయణరావు |
| 400. స్వప్నలోకం | భీమినేని శ్రీనివాసరావు |
| 401. అల్లుడుగారు వచ్చారు | రవిరాజా పినిశెట్టి |
| 402. ప్రేమకు వేళాయెరా | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 403. శ్రీమతి వెళ్లొస్తా | కె.రాఘవేంద్రరావు |
| 404. ఫిల్మ్‌నగర్ | భరత్ |
| 405. రాజకుమారుడు | కె.రాఘవేంద్రరావు |
| 406. ప్రేమించేది ఎందుకమ్మా | జాన్ |
| 407. మా బాలాజీ | కోడిరామకృష్ణ |
| 408. పిల్ల నచ్చింది | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 409. హ్యాండ్స్అప్ | శివనాగేశ్వరరావు |
| 410. సూర్యపుత్రిక | టి.కృష్ణ |
| 411. ప్రేయసిరావే | చంద్రమహేష్ |
| 412. వంశోద్ధారకుడు | శరత్ |
| 413. కోదండరాముడు | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 414. పోస్ట్‌మాన్ | ముప్పలనేని శివ |
| 415. క్షేమంగావెళ్ళి లాభంగారండి | రాజా వన్నెంరెడ్డి |
| 416. బద్రి | పూరి జగన్నాథ్ |
| 417. కలసిఉందాం | ఉదయశంకర్ |
| 418. రియల్‌స్టోరి | రమణారెడ్డి |
| 419. నువ్వువస్తావని | ప్రతాప్ |
| 420. ప్రేమకోసం | వీరశంకర్ |
| 421. సుల్తాన్ | శరత్ |
| 422. అనగనగా ఒక అమ్మాయి | సారంగి రమేష్ |
| 423. శీను | శశి |
| 424. బొబ్బిలిసింహం | ఆదయ్‌మాన్ |
| 425. యువరాజు | వై.వి.యస్.చౌదరి |
| 426. మనసుపడ్డానుకానీ | వీరు.కె |
| 427. దాదాగిరి | భరత్ |
| 428. రవన్న | బి.గోపాల్ |
| 430. గోపి | *** |
| 430. ఎన్.టి.ఆర్.నగర్ | బాబ్జి |
| 431. సాహసబాలుడు విచిత్రకోతి | కృష్ణారెడ్డి |
| 432. పోలీస్‌రక్షణ | కొండవీటి సత్యం |
| 433. మణి | బి.గోపాల్ |
| 434. పెళ్ళిసంబంధం | కె.రాఘవేంద్రరావు |
| 435. శుభవార్త | పి.యన్.రామచంద్రారావు |
| 436. శ్రీరాములయ్య | ఎన్.శంకర్ |
| 437. చిరంజీవులు | రాధాకృష్ణ |
| 438. సర్దుకుపోదాం రండి | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 439. మా పెళ్ళికిరండి | ముప్పలనేని శివ |
| 440. మనసున్నమారాజు | ముత్యాలసుబ్బయ్య |
| 441. శివాజీ | సాయిబాలాజీ |
| 442. చిరునవ్వుతో | రాంప్రసాద్ |
| 443. రాయలసీమ రామన్నచౌదరి | సురేష్‌కృష్ణ |
| 444. మూడుముక్కలాట | రాఘవేంద్రరావు.కె |
| 445. ఆజాద్ | తిరుపతిస్వామి |
| 446. జయం మనదేరా | ఎన్.శంకర్ |
| 447. అమ్మోఒకటోతారికు | ఇ.వి.వి.సత్యనారాయణ |

| | | |
|---|---|---|
| 448. | శ్రీశ్రీమతి సత్యభామ | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 449. | సకుటుంబ సపరివార సమేతంగా | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 450. | నర్సింహానాయుడు | బి.గోపాల్ |
| 451. | తిరుమల తిరుపతి వెంకటేశా | ఇ.సత్తిబాబు |
| 452. | మృగరాజు | గుణశేఖర్ |
| 453. | ఎదురులేనిమనిషి | జొన్నగడ్డల శ్రీనివాసరావు |
| 454. | లేడి బ్యాచులర్స్ | ఉదయకుమార్ |
| 455. | అంతా మనమంచికే | వీరు.కె |
| 456. | మా ఆవిడమీదొట్టు / మీ ఆవిడ చాలా మంచిది | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 457. | అంకుల్ | రాజశేఖర్.ఎ |
| 458. | దీవించండి | ముత్యాలసుబ్బయ్య |
| 459. | అక్కా బావెక్కడ | రాజా వన్నెంరెడ్డి |
| 460. | అందాల ఓ చిలుకా | రాజ |
| 461. | ప్రేమించుకుందా రా | జయంత్ |
| 462. | రామ్మా చిలకమ్మా | తమ్మారెడ్డి భరద్వాజ్ |
| 463. | అతను | సత్యంబాబు |
| 464. | శుభాశీస్సులు | మల్లిఖార్జునరెడ్డి |
| 465. | రేపల్లెలో రాధ | శరత్ |
| 466. | శివానీ | సురేష్ వర్మ |
| 467. | వేచి ఉంటా | వెంకట్ |
| 468. | మనసిస్తారా | షిండే |
| 469. | సింహరాశి | వి.సముద్ర |
| 470. | రమణ | శివ నాగేశ్వరరావు |
| 471. | అగ్నపత్రిక | ఎస్.వి.సుబ్బరాజు |
| 472. | ఫ్రెండ్స్ | బండి రమేష్ |
| 473. | శ్రీమంజునాథ | కె.రాఘవేంద్రరావు |
| 474. | శ్రీ రాజరాజేశ్వరి | ఆదుర్తి భాస్కర్ |
| 475. | భలేవాడివి బాసూ | అరుణ్ ప్రసాద్ |
| 476. | ఫామిలీ సర్కస్ | తేజ |
| 477. | కలసినడుద్దాం | కోడిరామకృష్ణ |
| 478. | వీడెక్కడి మొగుడండీ | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 479. | నువ్వు నాకు నచ్చావు | కె.విజయభాస్కర్ |
| 480. | చెప్పాలని ఉంది | చంద్రమహేష్ |
| 481. | చందు | వీరు.కె |
| 482. | రాఘవ | వై.నాగేశ్వరరావు |
| 483. | అధిపతి | రవిరాజా పినిశెట్టి |
| 484. | చిరుజల్లు | శ్రీరాం బాలాజీ |
| 485. | హనుమాన్ జంక్షన్ | రాజా |
| 486. | స్నేహమంటే ఇదేరా | బాలశేఖరన్ |
| 487. | ప్రేమసందడి | అరుణ్ ప్రసాద్ |
| 488. | థ్యాంక్యూ సుబ్బారావు | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 489. | సిద్దు | కె.యస్.నాగేశ్వరరావు |
| 490. | ఎంతబాగుందో | తమ్మారెడ్డి భరద్వాజ్ |
| 491. | జాబిలి | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 492. | లైలా కాలేజ్ | రాజేంద్రబాబు |
| 493. | అమ్మాయే నవ్వితే | జ్యోతికుమార్ |
| 494. | సంతోషం | దశరధ్ |
| 495. | పరుశరాం | మోహన్‌గాంధి |
| 496. | మనసుంటేచాలు | జొన్నలగడ్డ శ్రీనివాసరావు |
| 497. | సుబ్బు | సురేష్‌వర్మ |
| 498. | నీతో చెప్పాలని | సత్యానాయుడు |
| 499. | డ్రీమ్స్ | బాలాజీ |
| 500. | స్టూడెంటు నెం.1 | రాజమౌళి |
| 501. | ఇదే నా మొదటి ప్రేమలేఖ | నాగేశ్వరరెడ్డి |
| 502. | మనసుతో | రవికుమార్‌చౌదరి |
| 503. | నీ ప్రేమకై | ముప్పలనేని శివ |
| 504. | నువ్వులేక నేనులేను | కాశీ విశ్వనాధ్ |
| 505. | ఓ చినదాన | ఇ.సత్తిబాబు |
| 506. | వెండి మబ్బులు | ఆదిత్య కుమార్ |
| 507. | తప్పుచేసి పప్పుకూడు | ఎ.కోదండరామిరెడ్డి |
| 508. | ఆడుతూ పాడుతూ | దేవిప్రసాద్ |
| 509. | లాహిరి లాహిరి లాహిరిలో | వై.వి.యస్.చౌదరి |
| 510. | నిన్నే ప్రేమిస్తా | ఆర్.ఆర్.షిండే |
| 511. | నేను నిన్ను ప్రేమిస్తున్నాను | జి.హరిబాబు |
| 512. | అదృష్టం | శేఖర్‌సూరి |
| 513. | ఇంద్ర | బి.గోపాల్ |
| 514. | టూమచ్ | వీరు.కె |
| 515. | జోరుగా హుషారుగా | చంద్రమహేష్ |
| 516. | ప్రియదర్శిని | ధవళమల్లిక్ |
| 517. | ఆనందం | శ్రీను వైట్ల |
| 518. | నీతో | జాన్ |
| 519. | చూసొద్దాంరండి | రాజా వన్నెంరెడ్డి |
| 520. | భరతసింహారెడ్డి | సూర్యప్రకాష్ |
| 521. | చెన్నకేశవరెడ్డి | వి.వి.వినాయక్ |
| 522. | జెమిని | శరత్ |
| 523. | బాబి | శోభన్ |
| 524. | ఇదేం ఊరురా బాబూ | ముత్యాల సుబ్బయ్య |
| 525. | పోలీస్ సిస్టర్స్ | విక్కీ |
| 526. | శివరామరాజు | వి.సముద్ర |
| 527. | ప్రేమలో పావనీ కళ్యాణ్ | ఘటికాచలం |
| 528. | ఈశ్వర్ | జయంత్ |
| 529. | నందడే నందడి | ముప్పలనేని శివ |
| 530. | తొట్టిగ్యాంగ్ | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 531. | మన్మధుడు | కె.విజయభాస్కర్ |
| 532. | ధనుష్ | నల్లమోతు శ్రీనివాసరావు |
| 533. | ఆశలసందడి | అనిల్ కిషోర్ |
| 534. | హాయ్ | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 535. | సూర్యవంశ్ (హిందీ) | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 536. | అపురూపం | సాయిరవి |
| 537. | ఉత్సాహం | అల్లాణి శ్రీధర్ |
| 538. | ఎవరే అతగాడు | భాను శంకర్ |
| 539. | గోల్‌మాల్ | పి.యస్.రామచంద్రరావు |
| 540. | పెళ్ళాం ఊరెళితే | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 541. | కబడ్డీ కబడ్డీ | వెంకీ |
| 542. | ఫూల్స్ | దాసరి నారాయణరావు |
| 543. | గంగోత్రి | కె.రాఘవేంద్రరావు |
| 544. | అమ్ములు | ఎల్.శ్రీనాధ్ |
| 545. | అవునా... | సి.ఉమామహేశ్వరరావు |
| 546. | రౌడీ | శ్రీ మధవ్ |
| 547. | ఒట్టేసి చెబుతున్నా | ఇ.సత్తిబాబు |
| 548. | ఒకరాజు ఒకరాణి | యోగి |
| 549. | జానీ | పవన్‌కళ్యాణ్ |
| 550. | విజయం | సింగీతం శ్రీనివాసరావు |
| 551. | ఎంజాయ్ | టి.వి.రాజు |
| 552. | ఆయుధం | ఎన్.శంకర్ |
| 553. | రాఘవేంద్ర | సురేష్‌కృష్ణ |
| 554. | సింహాద్రి | రాజమౌళి |
| 555. | సీతయ్య | వై.వి.యస్.చౌదరి |
| 556. | ఓరి నీ ప్రేమ బంగారం కానూ | ఎ.వి.యస్ |
| 557. | నాని | ఎస్.జె.సూర్య |
| 558. | దొంగోడు | భీమినేని శ్రీనివాసరావు |
| 559. | విష్ణు | షాజీ కైలాస్ |
| 560. | నేను సీతామహాలక్ష్మి | నాగేశ్వరరెడ్డి |
| 561. | పలనాటి బ్రహ్మనాయుడు | బి.గోపాల్ |
| 562. | నీకునేను నాకునువ్వు | రాజశేఖర్ |
| 563. | టైగర్ హరిశ్చంద్రప్రసాద్ | వి.సముద్ర |
| 564. | సత్యం | సూర్యకిరణ్ |
| 565. | మా అల్లుడు వెరీగుడ్ | ఇ.వి.వి.సత్యనారాయణ |
| 566. | కితకితలు | ఆదిత్య ఓం |
| 567. | ఎలా చెప్పను | రమణ |
| 568. | శ్వేతనాగు | సంజీవ్ |
| 569. | నీకే మనసిచ్చాను | సూర్యతేజ |
| 570. | ఇందిరమ్మ | మాధవ్‌సాయి |
| 571. | శ్రీరామచంద్రులు | వి.శ్రీకాంత్ |
| 572. | పెళ్ళాంతో పనేంటి | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 573. | కాశీ | లక్ష్మీ శ్రీనివాస్ |
| 574. | మా ఇంటికి వస్తే ఏం తెస్తారు / మీ ఇంటికి వస్తే ఏం ఇస్తారు | రాజా వన్నెంరెడ్డి |
| 575. | అతడే ఒక సైన్యం | ఎస్.వి.కృష్ణారెడ్డి |
| 576. | మల్లీశ్వరి | కె.విజయభాస్కర్ |
| 577. | ఆంధ్రావాలా | పూరి జగన్నాధ్ |
| 578. | 5వ తారీకు | సురేష్ |
| 579. | ఐతే ఏంటి | సోమా విజయప్రకాశ్ రెడ్డి |
| 580. | దోస్త్ | ముప్పలనేని శివ |
| 581. | గిల్లీ (తమిళ్) | ధరణి |
| 582. | ఒకటవుదాం | జి.శివప్రసాద్ రెడ్డి |
| 583. | ధమ్ | రాజు పూపాటి |
| 584. | ఒట్టు ఈ అమ్మాయి ఎవరో తెలీదు | హరిబాబు |
| 585. | ప్రేమించుకున్నాం పెళ్ళికిరండి | రేలంగి |
| 586. | నిన్నే ఇష్టపడ్డాను | కొండా |
| 587. | ఒక రాధ ఇద్దరు కృష్ణులు | నాగేశ్వరరెడ్డి |
| 588. | వాళ్ళిద్దరి వయస్సు పదహారు | భానుశంకర్ |
| 589. | నీతోవస్తా | కె.అజయ్‌కుమార్ |
| 590. | 'X' ట్రా | వీరు.కె |
| 591. | కొడుకు | ఎం.యస్.నారాయణ |
| 592. | గౌరి కళ్యాణ వైభోగం | కె.యోగి |
| 593. | నేనున్నాను | వి.ఎన్.ఆదిత్య |
| 594. | వైజయంతి ప్రొడక్షన్స్ | కరుణాకర్ |
| 595. | బాలకృష్ణ హీరోగా రానున్న చిత్రం | స్వర్ణ సుబ్బారావు |
| 596. | లక్ష్మీ ప్రొడక్షన్ చిత్రం | |
| 597. | విజయ మూగాంబికా వారి చిత్రం | |
| 598. | అంజనా ప్రొడక్షన్స్ చిత్రం | |
| 599. | బి.గోపాల్ చిత్రం | |
| 600. | నిధి ప్రసాద్ చిత్రం | |
| 601. | సూపర్‌గుడ్ వారి చిత్రం | |
| 602. | సిరి మీడియా వారి చిత్రం | |
| 603. | ఆర్.పి.పట్నాయక్ చిత్రం | |
| 604. | ముప్పలనేని శివ చిత్రం | |

వివరాలు ఇంకా సంపాదించవలసిన వాటికి *** ఈ గుర్తును ఇవ్వడం జరిగింది.

## 'శాంతి సందేశం' ఆడియో విడుదల



గతంలో విజయ్‌చందర్ ముఖ్యపాత్రధారిగా క్రీస్తుపై వచ్చిన చిత్రాలకు భిన్నంగా సూపర్‌స్టార్ కృష్ణ ముఖ్యపాత్రలో ఏసుక్రీస్తుపై విభిన్నంగా నిర్మితమైన చిత్రం 'శాంతి సందేశం'. పి.చంద్రశేఖర్‌రెడ్డి దర్శకత్వంలో పద్మాలయా టెలిఫిలింస్ సంస్థ ఈ చిత్రాన్ని నిర్మించింది. ఈ చిత్రానికి సంబంధించిన ఆడియో క్యాసెట్స్‌ను ఇటీవల సికింద్రాబాద్ పోలోగ్రౌండ్స్‌లో నిర్వహించిన ఓ భారీ సభలో క్రైస్తవ మత ప్రచారకురాలు జాయిస్ మేయర్ చేతుల మీదగా ఆవిష్కరించారు.

కృష్ణగారిని చూస్తుంటే ఏసుక్రీస్తునే చూస్తున్నట్లుందని, తప్పకుండా ఈ చిత్రం విజయవంతం కాగలదని ఆమె పేర్కొన్నారు. మొదటి విడతగా లక్ష క్యాసెట్లు, పది వేల సి.డి.లను మార్కెట్లోకి విడుదల చేసినట్లు సూర్య మ్యూజిక్ ప్రైవేట్ లిమిటెడ్ ఛైర్మన్ గుళ్లపల్లి శ్రీనివాస్ తెలిపారు. గుడ్‌ఫ్రైడే కానుకగా ఏప్రిల్ నెలలో ఈ చిత్రం విడుదల కానుంది.

ముప్పలనేని శివ - కోటి దోస్తీకి మరో నిదర్శనంగా నిలిచిన

## 'దోస్త్' ఆడియో ఆవిష్కరణ



కె.విశ్వనాథ్, సుహాసిని, శివబాలాజీ, కార్తీక్ కాంబినేషన్‌లో ఎన్.ఆర్.కె పతాకంపై ముప్పలనేని శివ దర్శకత్వంతో ఎన్.రాధాకృష్ణారెడ్డి నిర్మించిన 'దోస్త్' చిత్రం ఆడియో ఆవిష్కరణ ఇటీవల జరిగింది. కోటి ఈ చిత్రానికి సంగీతదర్శకుడు. ఈ చిత్రానికి మాతృక అయిన 'నమ్మళ్' చిత్రం (మలయాళం)లోని పాటలలో కొన్నిటి లైన్స్‌ని మాత్రం ఈ చిత్రంలోని పాటల స్వరరచనకు ప్రేరణగా తీసుకున్నానని చెప్పారాయన. ముప్పలనేని శివ - కోటి కాంబినేషన్‌లో ఇంతవరకూ వచ్చిన చిత్రాలన్నీ మ్యూజికల్‌గా చక్కని ప్రశంసలను అందుకోవటం జరిగింది. అలాగే ఈ చిత్రం ఆడియో కూడా శ్రోతలను ఆకట్టుకుంటుందన్న ఆశాభావాన్ని దర్శకుడు ముప్పలనేని శివ వ్యక్తం చేశారు. ఈ ఆడియోను శ్రీ కె.విశ్వనాథ్ ఆవిష్కరించి తొలి క్యాసెట్‌ను నటి సుహాసినికి అందించారు. ఆదిత్య మ్యూజిక్ సంస్థద్వారా విడుదలైన ఈ ఆడియో మార్కెట్‌లో వుంది.

## చిరంజీవి చిత్రానికి దేవిశ్రీ ప్రసాద్ సంగీతం



ఇటీవల విడుదలైన హిందీ చిత్రం 'మున్నాభాయ్ యం.బి.బి.యస్' చిత్రాన్ని తెలుగులో నిర్మించటానికి ఏర్పాట్లు జరుగుతున్నాయని, మెగాస్టార్ చిరంజీవి హీరోగా నటించనున్న ఆ చిత్రానికి దేవిశ్రీ ప్రసాద్ సంగీతం అదించనున్నారని విశ్వశనీయ వర్గాల భోగట్టా. అదే గనుక నిజమైతే అటు చిరంజీవి అభిమానులూ, ఇటు దేవిశ్రీ ప్రసాద్ అభిమానులూ మాత్రమే కాక ఆనందించని వారెవ్వరు?



## కులశేఖర్ మాటల రచయితగా వెంకటేశ్ చిత్రం

ప్రముఖ గీత రచయిత కులశేఖర్ సంభాషణలు రాసిన శ్రీ గీత ఇంటర్నేషనల్ వారి చిత్రం ఇటీవల ప్రారంభమైనది. వెంకటేశ్, ఆశిన్ జంటగా తయారవుతున్న ఈ చిత్రానికి - 'చెలి' చిత్రంలోని 'మనోహర నా హృదయమునె ఓ మధువనిగా మలిచినావంట' పాట ద్వారా తెలుగు నాట పాపులర్ అయిన హరీష్ జైరాజ్ సంగీత దర్శకుడు. గతంలో వెంకటేశ్‌తో 'పవిత్రబంధం' చిత్రాన్ని తీసి హిట్ కొట్టిన శివరాజు, వెంకటరాజు తో పాటు, వి.క్రియేషన్స్ సమర్పకులు శ్రీ యస్.భాను కూడా ఈ ప్రాజెక్ట్‌లో నిర్మాతగా వున్నారు. ప్రస్తుతం గీత రచయితే అయినా పూర్వాశ్రమంలో జర్నలిస్ట్ కూడా అవటంచేత కులశేఖర్ మాటలను పొదుపుగాను, శక్తివంతంగానూ ఉపయోగించగలడని చిత్రం ప్రారంభోత్సవానికి హాజరైనవారు అనుకున్నారు. అదే మాట కులశేఖర్‌తో అంటే 'మితభాషణం స్మితభాషణం ఈ చిత్రంలోని సంభాషణల లక్షణం' అని అన్నారు.



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | తెలుగు | తమిళం |
|---|---|---|
| రచన | : పింగళి | తంజై రామయ్యాదాస్ |
| సంగీతం | : ఘంటసాల | ఘంటసాల |
| గానం | : ఘంటసాల - లీల | ఘంటసాల - లీల |
| నటన | : సావిత్రి, నాగేశ్వరరావు | సావిత్రి, జెమిని గణేష్ |

ఘాటు(ప్రేమలో పడినవారు ఏమంటారు? 'నీ కోసమె నే జీవించునది' అంటారని పింగళి నాగేంద్రరావు అన్నారు. ఆయన పెళ్లిచేసుకోలేదు. ప్రేమలో పడినట్టు దాఖలాలు లేవు. అయినా ఆయన కవి కదా! రవికాంచనివీ కవి కాంచగలడని పెద్దలు చెప్పడాన్ని బట్టి - ప్రేమ గురించీ ప్రేమికుల గురించీ, విరహం గురించీ ఆయన ఎన్నెన్నో పాటలూ, మాటలూ రాశారు. వాటిలో చాలా పాటలూ, మాటలూ నేటికీ సజీవంగా ఉండడానికి - ఆయన ప్రతిభ ప్రముఖ కారణం. 'మాయాబజార్' చిత్రంలోని 'నీకోసమె నే జీవించునది' పాటలోని 'విరహము కూడా సుఖమే కాదా నిరతము చింతన మధురము కాదా' అనే పంక్తులు సూక్తుల స్థాయిని పొందాయి.

శశిరేఖకు లక్ష్మణకుమారుడితో పెళ్లి నిశ్చయించారు. అభిమన్యుడు ద్వారక విడిచి వెళ్లి ఘటోత్కచుడి ఆశ్రమంలో ఉన్నాడు. శశిరేఖ, అభిమన్యుడు ఒకరి గురించి మరొకరు ఆలోచిస్తూ ఉన్నారు. ఆ వెన్నెల వేళలోనూ శశిరేఖకు అంతా చీకటిగానే అనిపిస్తున్నది. ఆమె మనసులో వెలుగు లేదు. విరహము నిరాశా ఆమెలో దుఃఖాన్ని పెంచుతున్నాయి. శశిరేఖ వియోగంవల్ల అభిమన్యుడిలో ఆమె పట్ల ప్రేమ మరింత పెరుగుతున్నదట. ఆకాశంలో శశిబింబం మరుగునపడి అభిమన్యుడికి శశిరేఖ రూపం దర్శనమిస్తుంది.

ఈ సన్నివేశం కోసం : - పింగళి రాసిన పాటను ఒకసారి నెమరు వేసుకొందాం

శశిరేఖ : నీ కోసమె నే జీవించునది
ఈ విరహములో ఈ నిరాశలో
వెన్నెలకూడా చీకటియైనా
మనసున వెలుగే లేకపోయినా
నీ కోసమె నే జీవించునది





అభిమన్యుడు :
విరహము కూడా సుఖమే కాదా
నిరతము చింతన మధురము కాదా
వియోగ వేళల విరిసే ప్రేమల విలువలు గనలేవా
నీ రూపమె నే ధ్యానించునది
నా హృదయములో నా మనస్సులో
నీ రూపమె నే ధ్యానించునది





శశి : హృదయము నీతో వెడలిపోయినా
మదిలో ఆశలు మాసిపోయినా
మన ప్రేమలనే మరి మరి తలచి
ప్రాణము నిలుపుకొని నీ కోసమె నే జీవించునది

అభి : మెలకువనైనా కలలోనైనా
కొలుతును నిన్నే ప్రణయ దేవిగా
లోకములన్నీ ఏకమైయైనా ఇక నాదానవెగా
నీ రూపమె నే ధ్యానించున

శశి : ఈవిరహములో ఈ నిరాశలో
నీకోసమె నే జీవించునదీ




హృదయం అన్నా మనస్సు అన్నా ఒకటే కదా అని కొందరికి అనుమానం రావచ్చు. 'చిత్తంతు చేతో హృదయం స్వాన్తం హృన్మానసం మనః' అంటుంది అమరకోశం. మరి - అభిమన్యుడికి హృదయమూ, మనసూ రెండూ ఎలా ఉన్నాయి? సమాధానం పాటలోనే ఉంది. శశిరేఖ హృదయం అభిమన్యుడితో - వెళ్లిపోయింది కనుక అభిమన్యుడికి ఆమె హృదయమూ అతని మనసూ రెండూ ఉన్నాయని చెప్పుకోవాలి!

హృదయం ప్రేమిస్తుంది. ఆ ప్రేమ ఫలించగలదా లేదా అని ఆలోచించేది మది. తన మనసు అభిమన్యుడి పరమైనా ఘనువు లక్ష్మణ కుమారుడితో నిశ్చయమైన తర్వాత శశిరేఖకు నిరాశ తప్ప ఆశ ఎక్కడ మిగిలి ఉంటుంది? శశిరేఖ 'మదిలో ఆశలు మాసిపోయినా' అభిమన్యుడికి తనపట్ల ఉన్న ప్రేమనూ తనకు అతని పట్ల ఉన్న ప్రేమనూ మరి మరి తలచి ప్రాణము నిలుపుకొని ఉన్నదట. శశిరేఖ నిరాశలో మునిగిపోయినా - అభిమన్యుడు ధైర్యంగానే ఉన్నాడు. 'లోకములన్నీ ఏకమైయైనా ఇక నాదానవెగా' అని ధీమాగా చెప్పగలుగుతున్నాడు. బహుశా అందుకే అతను కొంత మామూలుగానే ఉన్నట్టున్నాడు. నిద్రపోయి శశిరేఖనే కలల్లో చూస్తున్నాడు. మెలకువగా ఉన్నప్పుడూ ఆమెనే ప్రణయదేవిగా కొలుస్తున్నాడు.

'నీకోసమె నే జీవించునది' అనే పల్లవి - తమిళంలో 'ఉనక్కాగవె నాన్ ఉయిర్ వాళ్‌దేనే' అయింది. తమిళగీత రచయిత తంజై రామయ్యాదాస్.

రామయ్యాదాస్ తంజావూరు (తంజై)లో బడిపంతులుగా ఉండేవారు. ఆయన కాంగ్రెస్ పార్టీలో జాతీయోద్యమంలో పాల్గొనడంతో ఉద్యోగానికి ఇబ్బంది వచ్చింది. దాంతో ఉద్యోగం మానేసి నాటకాల రచయిత అయ్యారు. ఆ తర్వాత 'జయలక్ష్మీ గాన సభ' పేరిట నాటకాల కంపెనీ ప్రారంభించి 'మత్స్యరేగై' (మత్స్యరేఖ) నాటకం ఆడారు. 1947లో 'ఆయిరం తలైవాంగి అబూర్వ చింతామణి' (సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి) చిత్రం ద్వారా చలన చిత్ర రచయిత అయ్యారు. రామయ్యాదాస్‌కు విశేష కీర్తి తెచ్చిన చిత్రం. 'పాతాళభైరవి' (తమిళం). దాంతో ఆయన విజయావారి ఆస్థాన తమిళ రచయిత అయ్యారు. 'మిస్సమ్మ' (తమిళం) కూడా ఆయనకు ఎంతో పేరు తెచ్చి పెట్టింది. స్వతహాగా పండితుడే అయినా - సినిమా పాటలు పామర జనరంజకంగా సాధారణంగా ఉంటే చాలునని ఆయన అభిప్రాయ పడేవారట. దాంతో ఆయన ఎన్నో విమర్శలకు గురయ్యారు. 'దేవదాస్' తమిళ చిత్రానికి పాటలు రాసిన ఉడుమలై నారాయణ కవి వంటివారి లాగా రామయ్యాదాస్ సినిమా పాట స్థాయిని పెంచే ప్రయత్నం చేయలేదని కొందరు విమర్శకుల అభిప్రాయం.

'మాయాబజార్' తమిళ చిత్రం కోసం రామయ్యాదాస్ రాసిన విరహగీతం:

వత్సల: ఉనక్‌కాగవే నాన్ ఉయిర్ వాళ్‌న్‌దేనే
ఉలవుమ్ తాపమే ఎన్నై దగిత్‌తాలుమే
విణ్‌మది వానిల్ ముగిల్ సేరన్‌దాలుమ్
ఎన్ మన వానిల్ ఇరుళ్ సూళన్‌దాలుమ్ ॥ఉనక్ కాగవే॥





అభిమన్యుడు :
విరహత్‌తిన్ కనవే సుగమాగాదా
ఇదయత్‌తిన్ నినైవే ఇనిమైయాగాదా
పిరివినిల్ కాణుమ్ ఇన్‌బత్‌తైప్‌పోలే
పేరిన్‌బమ్ వేఱున్ డో
ఉయిర్ ఓవియమే ఉనెయే పిరియేన్
ఉనదు ధ్యానమే నానే మఱవేన్ ॥ఉయిర్॥





వత్సల : ఇదయమే ఉన్‌నై ఇణైన్‌దు శెన్‌ఱాలుమ్
ఇన్‌బ కనవెల్‌లామ్ మఱైన్‌దు విట్‌టాలుమ్
ఇణైయేదు మిల్‌లా ప్రేమైయినాలే
ఇదునాళ్ బువిమేలే ॥ఉనక్ కాగవే॥
అభి: కనవిలుమ్ నీయే నినైవిలుం నీయే
మన మాళిగైయిల్ మగిళుమ్ దేవియే
ఉలగమే యావుమ్ ఒన్ ఆఘినుమ్
ఎన్ ఉడలుమ్ ఉయిరుమ్ నీయే ॥ఉయిరే॥




మాయాబజార్ తమిళ చిత్రం కోసం రామయ్యాదాస్ రాసిన పాటలలో ఈ 'ఉనక్‌కాగవే' పాట స్థాయి ఉత్తమమైనదని చెప్పాలి. పాటలోని భావాలు ఇవి :

వత్సల : నీ కోసమే నేను జీవించేదే
మసలే తాపం నన్ను దహించినా
మింట జాబిలిని మబ్బులు కమ్మినా
నా మానస ఆకాశాన్ని చీకటి ముసిరినా ॥నీ కోసమే॥
అభి : విరహపు కలయే సుఖం కాదా
హృదయపు జ్ఞాపకమే మధురం కాదా
ఎడబాటులోని ఆనందంలాగా
మహదానందం మరొకటి ఉంటుందా
సజీవ చిత్రమా నినునే విడువను
నీ ధ్యానాన్ని నేను మరువను ॥సజీవ॥
వత్సల : హృదయం నీతోనే వెళ్లిపోయినా
మధుర స్వప్నాలన్నీ మాసిపోయినా
సాటిలేని ప్రేమవల్లే
ఇన్నాళ్లు భూమిమీద ॥నీ కోసమే॥
అభి : కలలోనూ నీవే మెలుకువలోనూ నీవే
మానస మందిరంలో ఆనందించే దేవి
లోకమంతా ఒకటయినా
నా మేనూ ప్రాణమూ నీవే ॥సజీవ॥

తెలుగు పాటలోని అభిప్రాయాలను తమిళగీతం దాదాపుగా ప్రతిబింబించిదని చెప్పుకోవచ్చు. కాకపోతే 'వియోగ వేళల విరిసే ప్రేమల విలువలుగనలేవా' అని తెలుగు పాట ప్రశ్నిస్తే 'వియోగంలోని ఆనందాన్ని పోలిన మహదానందం మరొకటి ఉంటుందా?' అంటుంది తమిళగీతం. తెలుగు పాటలో 'సజీవ చిత్రం' ప్రస్తావన లేదు. అభిమన్యుడూ శశిరేఖా ఒకచోట లేకపోయినా - మానసికంగా ఇద్దరికీ ఎడబాటు లేదు. పాట అంతా ఇద్దరూ దాదాపు కలిసే కనిపిస్తారు. అభిమన్యుడికి శశిరేఖ (వత్సల) భ్రమ కాదు. సజీవ చిత్రమే. తెలుగు నాయిక, 'మన ప్రేమలనే మరి మరి తలచి ప్రాణము నిలుపుకొని' ఉంటే , తమిళ నాయిక సాటిలేని ప్రేమవల్లే సజీవంగా ఉన్నాననీ అంటుంది. తెలుగు పాటలోలేని సొగసు తమిళగీతంలో ఒకటుంది. తెలుగులో 'లోకములన్నీ ఏకమయైనా ఇక నాదానవెగా' అనే అభిమన్యుడు తమిళంలో 'లోకమంతా ఒకటయినా నా మేనూ ప్రాణమూ నీవే' అని శశిరేఖ (వత్సల) పట్ల తన ప్రేమను ప్రకటించడం సొగసుగా ఉంది. తెలుగులో మెలకువ ముందూ కల తర్వాతా ఉంటే తమిళంలో కలముందూ మెలకువ తర్వాతా ఉన్నాయి.

ప్రపంచ వ్యాప్తంగా ప్రేమికుల రోజును జరుపుకునే సందర్భంగా ఈ విరహగీతాలను స్మరించడానికి - తెలుగు, తమిళ భాషలలో అవి సాధించిన అమరత్వమే కారణం!

**- పి.ఎస్.గోపాలకృష్ణ**



# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు

**డా॥ పి.బి.శ్రీనివాస్**

'హాసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

" సితంనే లూట్ లియా హై ఏ క్యాకరేఁ" అనే ట్యూనులోను, ఆలాపనలోనూ, సన్నివేశపు దివ్యత ద్యోతక మౌతుంది. ఇందులో ముకేశ్ రఫీలు కూడా బహు ప్రభావప్రదంగా పాడినా లతాదే అగ్రస్థానం. రాగభావం ఉట్టిపడేలా "పసనీపమాపదాసమా, రీపమదపరాగాసారిగా "అద్భుత రూపకల్పన.

నౌషాద్ తన సంతకాన్నీ, బాణీనీ నిలబెట్టుకుంటూనే అగ్రస్థానంలో నిలిచి రాజ్యమేలారు. అయితే అనార్కలీ,బర్సాత్ చిత్రాలు కూడా సంగీతపరంగా దిగ్విజయం సాధించేసరికి క్రమంగా సి.రామచంద్రా, శంకర్‌జైకిషన్లు తమదైన ఉన్నత స్థానాన్ని సంపాదించుకోగలిగారు. అనార్కలీ లో లతా పాటలన్నీ -"ఆజా అబ్‌తో ఆజా","యే జిందగీఉసీకిహై"వంటి పాటలు హాంటింగ్ మెలోడీస్‌గా పేరు తెచ్చుకున్నాయి.

దానికి కారణం 90% లతా గళస్వరంలోని దయార్ద్రత.

అదే సమయాన రాజ్‌కపూర్ "బర్‌సాత్" లో అన్ని పాటలూ హిట్టై శంకర్‌జైకిషన్లకి ఒక ప్రత్యేక స్థాయిని చేకూర్చాయి. "బర్‌సాత్‌మేఁ" వంటి పాటల్లో వాళ్ళు ప్రవేశపెట్టిన కొత్త బీట్, యౌవనంతో తొణికిసలాడి, యువకులందరి మనసుల్నీ దోచుకున్నాయి. 'అల్‌బేలా'లో సి.రామచంద్ర లతచే పాడించిన లల్లబీ "ధీరేసే ఆజారీ అఖియన్‌మే నిందియా ఆజారీ ఆజ, ధీరేసే ఆజా" ది గ్రేటెస్ట్ ట్రెండ్ సెట్టర్ గా నిరూపించుకుంది. ఆ పాట అంత హిట్టవ్వగానే చాలామంది జోల పాటలుచేశారు కాని, చెప్పుకోదగినది "ఆయి ఆయి రాత్ సుహానీ" - అనే శంకర్‌జైకిషన్ల కంపోజిషన్. శంకర్‌జైకిషన్లు శోకగీతాలలో కూడా ఫాస్ట్‌బీట్ పెట్టేవారు.



'ఆహ్' చిత్రంలో నర్గీస్, రాజ్‌కపూర్

అనాడీలో "తేరాజానా" అనే పాట ఈ కోవకు చెందినది. అది ఒక అపూర్వమైన వినూతన ప్రయోగం అనే అనాలి.

"ఆహ్ (తెలుగులో ప్రేమలేఖలు)" చిత్రం దెబ్బతిన్నా, అందులోని అన్ని పాటలు ప్రజల్ని అమితంగా ఆకర్షించాయి. "రాజాకీ ఆఏగీ

## తన కుటుంబసభ్యుల గురించి లతా

ఇటీవలే ఒక ప్రముఖ పత్రికకు ఇంటర్వ్యూ ఇస్తూ లతా తన కుటుంబసభ్యుల గురించి వెల్లడించిన అభిప్రాయాలు -

"మా తమ్ముడు హృదయనాథ్‌కి రావలసినంత గుర్తింపు రాలేదు. నాకంటె అతనికి సంగీతంపై ఎక్కువ అవగాహన ఉందని నా అభిప్రాయం. కానీ కమ్మర్షియల్‌గా అతనికి పేరు రాలేదు. పుణెలో మా నాన్నగారి పేర కట్టించిన హాస్పటల్ విషయంలో కూడా అతనెంతో శ్రమించాడు. కానీ ఇంట్లో కూచున్నా ఖ్యాతి వచ్చిపడింది నాకు.

అతనిలాగానే మూడుదశాబ్దాలుగా ఈ రంగంలో ఉన్నా ఉషామంగేష్కర్‌కు కూడా రావలసినంత పేరు ప్రతిష్టలు రాలేదు. నాకు స్లంప్ ఉన్నరోజుల్లో 'జై సంతోషిమా' పాటతో ఉషా టాప్ హిట్ కొట్టింది. కానీ గాయనిగా ఆమెను తలచుకుని ఆకాశాని కెత్తినవారు లేకపోయారు.

ఇక ఆశా అంటారా, ఆశాకు చాలా మంచి ఛాన్సులు వచ్చాయి. కానీ నన్ను నెంబరు 1 అనీ, ఆమెను నెంబరు 2 అనీ అనవసరంగా ముద్రలు వేశారు. తన తరహా పాటల్లో తనకు తనే సాటి. ఆర్.డి.బర్మన్ అంటూండేవాడు - 'మీ ఇద్దరూ క్రికెట్‌లో గారీ సోబర్స్, డాన్ బ్రాడ్‌మన్ లాటివారు. ఎవరి ఆట వారిదే. ఎవరి పాట వారిదే' అని. తనకు అన్యాయం జరిగిందని వాపోవడం ఆశాకు తగదు. ఉషా, హృదయనాథ్ చేయవలసిన ఫిర్యాదులు తను చేస్తోంది. మంగేష్కర్ కుటుంబానికి చెందకుండా ఉంటే తను ఇంకా పెద్ద సింగర్ అయ్యేదానినని అనుకోవడం దురదృష్టకరం."

- కమ్యూనికేటర్ ఫీచర్స్

బారాత్" ప్రతీ పెళ్లి పందిరిలోనూ మ్రోగుతూనే వుండేది. ' యే శామ్ కీ తన్‌హాయియా' లో లతచే మంచి హైపిచ్ లో పాడించారు సంగీతకవలలు.

మధ్యలో రోశన్ వచ్చి తన బాణీలో లతచే చాలామంచి పాట పాడించారు. వాటిలో ఒకటి "సారీ సారీ రాత్ మే యే నీంద్ న అయే" - శృతి పథంలో మ్రోగే మెలోడీ "ఏరీ మైతో ప్రేమ్‌దీవానీ మేరా దర్ద్ న జానేకోయీ" అనే మీరాభజన్ భీం పలాస్ రాగానికి ఒక మేటి మచ్చుతునక, భీం పలాస్ రాగం. మన దక్షిణాది సంగీత దర్శకుల్లో దాదాపు మక్కువతో ప్రయోగించినవారు రాజేశ్వరరావు,ఘంటసాల,పెండ్యాల వారిలో త్రిమూర్తులు. పెండ్యాల ట్యూన్ చేయగా ఘంటసాల, ఎస్.జానకీ విడివిడి సోలోలుగా పాడిన "నీలిమేఘాలలో గాలికెరటాలలో" అలా అలా హృదయాలని తేలికపరచి గాలి అలలపై తేలియాడజేన్తుంది. ఈనాడు విన్నా, మదన్‌మోహన్ తదుపరి లత చేత పాడించిన "నైనా బరసే" అనే ట్యూన్‌పైనా పెండ్యాల ట్యూను ప్రభావం వుందనిపించకమానదు.


"దేఖ్ కబీరా రోయీ" చిత్రంలో అమితా గుహ

కాని మదన్‌మోహన్, లతాల కాంబినేషన్‌లో వచ్చినన్ని హాంటింగ్ మెలోడీన్, మరో కాంబినేషన్‌లో రాలేదేమో అనే అనిపిస్తుంది. దానికి మదన్ స్పెషలైజ్, గజల్ స్టయిల్ కంపోజింగ్ కూడా చాలా దోహదం చేసింది. "ఆప్ కీ నజరోఁ నే సంఝా", "న తుం బేవఫా హో, న హం బేవఫా హైఁ" లాంటి గీతాలు ఎవరి హృదయాలనైనా కరిగించి వేస్తాయి అనడంలో సందేహమే మాత్రం లేదు. "దేఖ్ కబీరా రోయీ" చిత్రంలో "మేరీవీణా తుఝ్‌బిన్ రోయే" అనే పాట అహిర్ భైరవ్ రాగంలో (చక్రవాకం) మదన్‌మోహన్ కంపోజింగ్ చేసి ఆ పాటకి పుష్టి చేకూర్చారు. "సప్‌నేమేఁ సజన్‌సే దో బాతేఁ" అనే పల్లవి రిషభంలో అందంగా నిలపడం ఆయనకే చెల్లింది. ''వోకౌన్‌థీ''లో ''లగ్‌జాగలే'', ''నైనాబరసే రింఝుం రింఝుం'' వంటి హాంటింగ్ ట్యూన్ కి ఆయనదే పెట్టినపేరు.

ఏ.వి.యం. వారి "భాయీ భాయీ" లో "కదర్ జానేనా మేరాబాలం బేదర్‌దీ" మంచి ఫాస్ట్ టెంపోలో ఒక కంప్లెయింటివ్ టోన్‌తో సాగుతుంది. ఇది ఒక అపూర్వమైన గీతం. మరోపాట "శరాబీ జా...జా...జా..." ఆయన ముఖంలో సంతృప్తిముఖాన్ని చూడగలుగుతాం. పల్లవిలోనే జా అనే పదాన్ని మూడు విసుర్లు విసిరి రక్తి కట్టించారు. లతా పాడడం సరేసరి.

ఎస్.డి.బర్మన్ ' గైడ్'లో "ఆజ్ ఫిర్ జీనే కీ తమన్నా హై" అనే లిరిక్కుకి కట్టిన మట్టు చాలా హిలేరియస్‌గా కుదిరింది. అర్థానికి అనువుగా, పల్లవిలోని ఫాస్ట్ బీట్ అవీ శంకర్‌జైకిషన్ల బాణీని కొంత స్ఫురింపజేసినా ఆ పాట మదన్‌మోహన్, శంకర్‌జైకిషన్ ల బాణీలు రెండూ వినిపించాయి. అందుచేత అది ఉత్సాహవంతమైన మృదు మధుర మనోహర గీతంగా పరిణమించింది.

కల్యాణ్‌జీ ఆనంద్‌జీల సంగీతంలో లత పాడి "చందన్‌సా బదన్ చంచల్ చిత్‌వన్" అనే పాట ముకేశ్ కూడా సోలోగా పాడారు. రెండూ శ్రవణపేయంగా ఆలపింపబడ్డాయి. మంచి లిరిక్కూ, మంచి ట్యూను, మంచి సింగర్లూ లభించినపుడు గీతానికి ఎంతవన్నె చేకూరగలదో నిరూపించగలిగేది "సరస్వతీ చంద్ర" లోని ఈ పాట!

అలాగే "ముఝ్‌కో ఇస్‌రాత్‌కి తన్‌హాయీ మెఁఆవాజ్ నదో...." అనే పాట కూడా లతామంగేష్కర్ డ్యూయెట్‌గా పాడారు. మనస్సుకి

# పాపం షంషాద్ బేగమ్

షంషాద్ బేగమ్ పాట పాడి లతా మంగేష్కర్ గులాం హైదర్ దృష్టికి వచ్చిందని గుర్తుంచుకుంటే చాలు షంషాద్ బేగమ్ స్థాయి తెలుసుకోవడానికి! మాస్టర్ గులాం హైదర్ సంగీతం సమకూర్చిన 'ఖజాంచీ' (1941) అనే సినిమాలోని తొమ్మిది పాటల్లోనూ షంషాద్‌బేగమ్ పాడింది. అన్ని పాటలూ సూపర్ హిట్సే! 1945లో ఖజాంచీ పాటల పోటీ అని పెట్టారు. దానిలో పాల్గొని బహుమతి గెలుచుకున్న లతా ప్రతిభను గులాం హైదర్ గుర్తించాడు. అవకాశాలు ఇచ్చాడు.



అప్పట్లో అంటే 1948 వరకూ షంషాద్ బేగమ్ గులాం హైదర్‌కే కాదు, నౌషాద్, ఇతర సంగీతదర్శకులకు టాప్ ఫేవరేట్. పాటకు వెయ్యిరూపాయలు తీసుకునేది. లతాకైతే 50 రూపాయలు చాలు.కానీ షంషాద్ లతాను తనకు పోటీగా ఎప్పుడూ అనుకోలేదు. స్ట్రాంగ్‌గా ఖంగుమని మొగాడితో సమానంగా మోగే పంజాబీ కంఠం తనది, పీలగా, నీరసంగా పలికే స్వరం లతాది అని అనుకున్నదామె.

కానీ 'అందాజ్' (1949) లో నర్గీస్‌కు షంషాద్‌చేత కాకుండా లతాచే పాడించి మ్యూజిక్ చరిత్రను మార్చేశాడు ఆ సినిమా సంగీతదర్శకుడు నౌషాద్. అందాజ్‌లో లతాతో కలిసి 'డర్ నా మొహబ్బత్ కర్ లే' డ్యూయట్ పాడుతున్నప్పుడు తను నర్గీస్‌కు, లతా కుక్కూ అనే సహతారకూ పాడుతోందని అనుకుంది షంషాద్. కానీ జరిగినది దానికి రివర్స్. నర్గీస్‌కు ప్లేబ్యాక్ సింగర్‌గా లతా స్థిరపడిపోయింది. మధుబాల నటించిన 'దులారీ'లో కూడా షంషాద్‌కి ఒక పాట ఇచ్చాక 'అందాజ్' ఎఫెక్టు చూసి తక్కిన ఎనిమిది పాటలూ లతాకే ఇచ్చేశాడు నౌషాద్. 'దీదార్', 'ఆన్'లలో లతా షంషాద్ పోటీపడ్డారనవచ్చు. 'బైజుబావ్‌రా' (1952) వచ్చేసరికి లతాతో పోటీలో ఓడిపోయానని గుర్తించింది షంషాద్. శాస్త్రీయసంగీతంలో శిక్షణ పొందడం వల్లనే లతా తనను అధిగమించిందని అందరూ అనడంతో క్లాసికల్ మ్యూజిక్ నేర్చుకోవడం మొదలుపెట్టింది. దాంతో గులాం హైదర్ చివాట్లేశాడు - 'ఇలా అయితే నీ నేచురల్ ఫ్లో పోతుంది. నీ ప్రతిభ ఉపయోగించుకోవడం తెలిసిన మంచి మ్యూజిక్ డైరక్టరు కోసం చూడు.' అని.

నౌషాద్ ఇలా చేస్తే బాక్స్‌ఆఫీసు రీత్యా అతని తర్వాత స్థానంలో ఉన్న సి.రామచంద్ర కూడా తీసిపోలేదు. నౌషాద్ బాటలోనే రామచంద్ర కూడా షంషాద్‌చేత గతంలో ఎన్నో పాటలు పాడించాడు. 'గర్ల్స్ స్కూల్' సినిమాకి లతా పాడడానికి తిరస్కరించినప్పుడు షంషాద్‌నే పిలిచాడు. ఓ రోజు ఓ పాట తృప్తికరంగా పాడకపోవడంతో రామచంద్ర విసుక్కుని 'ఓ సారి చెబితే నేర్చుకోలేవూ?' అని తిట్టాడు. షంషాద్ చేతిలో పుస్తకం మూసేసి చరచరా స్టూడియోనుండి వెళ్లిపోయింది. ఇలా గతంలో వారిమధ్య ఎన్నోసార్లు జరిగింది. ఇలా జరిగిన ప్రతీసారీ రామచంద్ర మర్నాడు క్షమాపణలు చెబుతూ ఆమెను పిలవడం జరిగేది. కానీ ఈ సారి మాత్రం అలా జరగలేదు. అప్పటికే రామచంద్ర లతా మ్యాజిక్‌కు దాసోహమనడం జరిగింది.

రామచంద్రకూడా చేతినుండి జారిపోయాడు. అలాగే బర్మన్. లతా చేత పాడించడం ఇష్టంలేని ఓపి నయ్యర్ షంషాద్‌బేగమ్‌కు ఛాన్సులిచ్చేవాడు. (ఆర్ పార్ వగైరా) కానీ ఆశాభోంస్లేను డిస్కవర్ చేశాక ఓపి షంషాద్‌ను పిలవడం మానేశాడు. షంషాద్ క్రమంగా వెనుకబడిపోయింది.

-ఎమ్బీయస్ ప్రసాద్

# లతా - శంకర్

1956 ఫిలిం ఫేర్ ఎవార్డు ఫంక్షన్‌లో లతను స్టేజిపై 'చోరీ చోరీ' లో పాట పాడమంటే గాయనీ గాయ కులకు అవార్డు ఇవ్వటం లేదు కాబట్టి పాడనంది. బెస్ట్ మ్యూజిక్ డైరెక్టరు ఎవార్డు తెచ్చుకున్న శంకర్ - జైకిషన్‌ల జంటలో



జైకిషన్ లతాకు చాలా అప్పుడు. 'మాకు అవార్డు రావడం నీకు కంటగింపుగా ఉంది. అందుకే పాడనంటున్నావు' అన్నాడు జైకిషన్. కానీ శంకర్ 'నీ అభిప్రాయం తప్పు. ఆమె నిరసన మనపై కాదు. అవార్డుల పై.' అని జైకిషన్‌ను మందలించాడు.

శంకర్‌జైకిషన్‌లకై లతా 124 సినిమాలలో 453 పాటలు పాడింది. 313 దాకా సోలోలే. తన సిల్వర్‌జూబిలీ ఫంక్షన్ సందర్భంగా ప్రకటించిన లతా ఫేవరేట్స్ లో తమ పాట ఒక్కటీ లేనందుకు గాను కినిసి శంకర్ ఆ ఫంక్షన్ ఎగ్గొట్టాడు.

1986లో లతా ఒకచోట మాట్లాడుతూ ఫిర్యాదు చేసింది - 'ఈనాటి పాటలు ఏమీ బాగుండటం లేదు. మేము వెళ్లేసరికి కనీసం బేసిక్ ట్యూన్ కూడా రెడీ కావడం లేదు. ఇక ఈ పాటలేం నిలుస్తాయి?' అని.

దానికి శంకర్ ఇలా జవాబిచ్చాడు - 'నిజమే. కానీ దానికి కారణం ఎవరు? లతా వంటి గాయనీమణులు మాకు సమయం కేటాయిస్తున్నారా? రిహార్సల్స్‌కి రమ్మంటే రికార్డింగురోజు పొద్దున్న పెట్టుకోండి అంటున్నారు. ఓ గంటసేపు రిహార్సల్స్ చేస్తే మంచిపాట తయారవుతుందా? ఇదివరకు అలాగే ఉండేదా? సంగీతదర్శకుడు హార్మోనియం పెట్టుకుని కూచుంటే ఒక్కో బాణీ అందిస్తూంటే, గాయకుడు ఒక్కొక్క మాటా అని చూసుకుని , అవసరం బట్టి మార్చుకుంటూ ఇద్దరూ కలిసి తయారుచేస్తేనే మంచి ట్యూన్ డెవలప్ అవుతుంది. కడదాకా ముకేష్ అలా సహకరించబట్టే అతని పాటలన్నీ నిలిచాయి. కానీ లతా ఏం చేస్తోంది? ప్రతీనెలా ఒకటో తారీకున కూర్చుని రాబోయే 30 రోజులకు రికార్డింగు డేట్స్ ఫిక్స్ చేసేస్తోంది. ఇక రిహార్సల్స్‌కి వేరే డేట్స్ ఎక్కడ? అందుకే ఈ బాణీలూ నిలవవు, ఈ పాటలూ నిలవవు." అతని మాటల్లో నిజం లేదూ!?

\- సమీర్

మంచి అనుభూతిని కలిగించే తీరున ట్యూన్ కట్టారు కల్యాణ్‌జీ,ఆనంద్‌జీలు. సోనిక్,ఓమీల జంట కూడా లతాచేత పాటలు పాడించినా, లతాచే ఎక్కువగా పాటలు పాడించిన ఘనతగల లక్ష్మీకాంత్ ప్యారేలాల్ పరిచయంచేసిన రిథింబీట్ తరవాత చాలామంది అనుకరించారు. ఆ బీట్ వింటూవుంటే నిజంగా జింక ఎగురుతున్నట్టే అనిపిస్తుంది. దానికి"లక్ష్మీ ప్యారే" రిథిమ్ అని కూడా పేరు పెట్టారు కొందరు. ఆదుర్తి సుబ్బారావుగారి "మిలన్" చిత్రంలో లతా



"జిస్‌దేశ్‌మెగంగాబహ్‌తీహై"లో పద్మిని

నూతన్‌కీ జమునకీ కూడా పాటలు పాడారు. ఆ చిత్రంలో ముఖ్యంగా "సావన్‌కా మహీనా పవన్ కరే సోర్" అనే ముకేశ్ లతామంగేష్కర్‌ల డ్యూయెట్ సూపర్‌హిట్టు.

లక్ష్మీప్యారే, లతా కాంబినేషన్ చాలాకాలం దాకా మంచి ఉధృతంగా సాగింది - చివరికి రాజ్‌కపూర్ బాణీలో "ఝూట్ బోలే కౌవా కాటే" వంటి హిట్ సాంగ్స్ రికార్డు బ్రేక్ చేశాయి. "హం తుం ఇక్ కమరేమెం బంద్ హోం ఔర్ ఛాబీ ఖోజాయే" అనేది ఒక వింత లిరిక్కు. దానికి తగిన ట్యూను అందరికీ బాగా నచ్చింది. "జిస్‌దేశ్‌మెం గంగాబహ్‌తీహై"లో శంకర్‌జైకిషన్‌ల "ఓబసంతీ పవన్ బాదల్ నజారేనాజా రోకో కోయీ...." మనసులో మారుమ్రోగే పాట. అలాగే "క్యాహువా"లో రిథిం శ్రోతల్ని ఉత్తేజపరచి ఊపేసింది.

కాని అన్ని రికార్డులూ బ్రేక్ చేసిన లతా పాటలు "నాగిన్" చిత్రంలో హేమంత్ కుమార్ సింపుల్‌గా ట్యూన్ చేసి ఓవర్‌గా పాపులర్ చెయ్యగలిగారు. అలాగే బీస్ సాల్ బాద్ లోని "కహీఁదీప్ జలే కహీఁదిల్" కూడా హేమంత్ ట్యూనే. పాట ఎవరు ట్యూన్ కట్టినా లిరిక్కుకీ, ట్యూన్‌కీ సన్నివేశానికి తగినట్లుగా జీవంపోసే ప్రావీణ్యం లతా మంగేష్కర్ గళస్వరానికున్న ప్రత్యేకత. అవే పాటలు ఇతరులు పాడినా పాపులర్ అవ్వవచ్చు. రక్తి కట్టవచ్చు, కాని లత వాయిస్సు మాత్రం ప్రతీ పాటకీ గొప్ప ఎస్సెట్టు. "చోరీ చోరీ" లో రసిక్ బల్ మా అనే పాట మంచి క్లాసికల్ ట్యూన్. ఇందులో ఓపెనింగ్‌లోనే సితార్‌బిట్ చాలా ఇంప్రషన్ క్రియేట్ చేసింది. 'పంఛీబను ఉడ్ తీ ఫిరూ' అనే మరో లతాసోలో వింటూ రెక్కలు కట్టుకుని ఆకాశంలో ఎగురుతూ ఉండాలనిపిస్తుంది. "ఆజాసనం మధుర్‌చాంద్‌నీ మే హం" "యేరాత్ భీగీ భీగీ" అనే డ్యూయెట్లు మన్నాడేతో లతా పాడిన టెరిఫిక్ హిట్లు. సాధారణంగా ఏ.వి.యం. వారి చిత్రాలన్నింటిలోనూ ఎక్కువగా హిట్టయ్యే పాటలు కుదురుతూండడం, ఆ సంస్థ వారి టేస్టుకి నిదర్శనం.

ఖయ్యాం సంగీతంలో "ఐదిలే నాదాన్" లతా సోలో, ఆమెకే అతిగా నచ్చిన పాట "రజియాసుల్తాన్" చిత్రంలో హేమమాలినికి

## లతా గానలహరి

**చిత్రం: చోరీ చోరీ(1956)**

రచన: హస్రత్      సంగీతం: శంకర్-జైకిషన్

రసిక్ బల్‌మా హాయే
దిల్ క్యోం లగాయా
తోసే దిల్ క్యోం లగాయా
జైసే రోగ్ లగాయా ॥రసిక్॥
జబ్ యాద్ ఆయె తిహారీ
సూరత్ వొ ప్యారీ ప్యారీ (2)
నేహా లగాకే హారీ ఆ......
తడ్‌పూం మైం గమ్ కీ మారీ ॥రసిక్॥
ఢూంఢే హై పాగల్ నైనా
పాయే న ఇక్ పల్ చైనా (2)
డస్‌తీ హై ఉజ్‌లీ రైనా ఆ.....
కాసే కహూం మైం బైనా ॥రసిక్॥

### పీలూ రాగంలో లతా పాటలు

మోరే సయ్యాజీ ఉతరేంగే పార్ హో
(ఉడన్ ఖటోలా- నౌషాద్)
మైనే రంగ్ లీ ఆజ్ చునరియా
(దుల్హన్ ఏక్ రాత్ కీ - మదన్ మోహన్)
నా మానూ నా మామూ నా మానూ రే
(గంగా జమునా - నౌషాద్)
నదియా కినారే హేరాయే ఆయీ కంగ్నా
(అభిమాన్ - ఎస్.డి.బర్మన్)
బన్వారీ రే (ఏక్ ఫూల్ చార్ కాంటే - శం-జై)

### పహాడీ రాగంలో...

మేరీ ఆంఖోం మే బస్ గయా కోయీ రే
(బర్సాత్ - శం-జై)
మర్నా తేరీ గలీ మే
(షబాబ్ - నౌషాద్)
చందా కీ ఛావో మే
(పర్ఛాయియా - సి.రామచంద్ర)
బహారోం మేరా జీవన్ భీ సవారో
(ఆఖ్రీ ఖత్ - ఖయ్యామ్)
యే దిల్ ఔర్ ఉన్‌కీ నిగాహోం కీ సాయే
(ప్రేమ్ పర్బత్ - జయదేవ్)

### ఖమాజ్ రాగంలో...

బడా నట్‌ఖట్ హై రే కృష్ణ కన్హయా
(అమర్‌ప్రేమ్ - ఆర్.డీ.బర్మన్)
తు చందా మై చాందినీ
(రేశ్మా ఔర్ షెహరా - జయదేవ్)
మేరే ఆంఖోం సే కోయీ
(పూజా కే ఫూల్ - మదన్ మోహన్)
ఖనక్ గయో హాయ్ బైరీ కంగనా
(రిస్తే నాతే - మదన్ మోహన్)
చోరీ చోరీ చుప్‌కే చుప్‌కే
(ఆప్ కీ కసమ్ - ఆర్.డీ.బర్మన్)
ధీరే ధీరే మచల్ ఐ దిలే బేకరార్
(అనుపమా - హేమంత్‌కుమార్)
జియా నా లాగే మోరా నా జా రే
(బుడ్డా మిల్‌గయా - ఆర్.డీ.బర్మన్)

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**

పాడింది. "బహారో మేరా జీవన్‌భీ, సవారో" అనే మరో పాట మన చెవుల్లో ఈనాటికీ రీంకారం సలిపే మధురగీతం. ఇవన్నీ ఒక ఎత్తైతే, "మధుమతి" లోని పాటలన్నీ ఒకఎత్తు. "ఆజారే పరదేసీ" అనేది థీంసాంగ్ వంటిది. "దిల్‌తడప్‌తడప్‌కే" ముకేష్ తో డ్యూయెట్ గంతులేనన్తా పాడాలనిపించే టట్టుంటుంది. సలీల్ చౌధురీ మాణిక్యం "ఓ సాజనా బర్‌ఖా బహార్ ఆయీ". జెమినీవారి "బహుత్ దిన్ హుఏ" చిత్రానికై ఈమని శంకర్ శాస్త్రి గారు అందించిన భీంపలాస్ రాగంలోని స్వర రచన మధురాతి మధురం. ఈ పాట చాలామందికి తెలియదుగానీ, "లత" రిహర్సల్స్ చేసేటప్పుడే మెచ్చుకున్న ట్యూను. మధుబాలపై చిత్రీకరించ బడింది. బెంగుళూర్‌లో ఒక సర్దార్‌జీ స్నేహితుణ్ణి కలిసినప్పుడు అయన ఈ పాటని తన ఫేవరెట్ సాంగ్ గా ఉటంకించినప్పుడు చాలా ఆశ్చర్యపోయాను. మంచిపాట యేదైనా ఏ మనసునైనా ఇట్టే ఆకర్షించగలదనే మాట ఋజువయినది.

(ఇంకావుంది)

## హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

## 1962


ముకేష్

ఈ సంవత్సరం కూడా శంకర్ - జైకిషన్‌లు ఛార్ట్స్‌లో మొదటి స్థానాన్ని దక్కించుకున్నారు. హృషికేశ్ ముఖర్జీ తను డైరెక్టు చేసిన రెండు చిత్రాలకు సంగీతాన్ని నెరిపే అవకాశం వీరికి ఇచ్చారు. రాజ్‌కపూర్ హీరోగా ఉన్న 'ఆషిక్' చిత్రంలో వీరు అందించిన 'మై ఆషిక్ హూ బహారోంకా', 'ఓ షమా ముఝే ఫూఁఖ్ దే', 'మెహతాబ్ తేరా చెహరా', 'తుమ్ ఆజ్ మేరే సంగ్ హస్ లో ', 'తుమ్ జో హమారే మీత్ న హోతే' పాటలు సూపర్ హిట్ అయ్యాయి.

ఇవి ముకేష్ పాటలైతే దేవానంద్ హీరోగా ఉన్న 'అసలీ నకిలీ' చిత్రం కోసం వారు రఫీద్వారా అందించిన పాటలూ హిట్టే! 'తుఝే జీవన్ కి డోర్', 'లాఖ్ ఛుపాయే ఛుప్', 'ఇక్ బుత్ బనావూంగా', 'కల్ కి దౌలత్ ఆజ్ కో', 'గోరి జరా హస్ దే తూ', 'ప్యార్ కా సాజ్ భి హై...ఛేడా మేరే దిల్ నే ', 'తేరా మేరా ప్యార్ అమర్' పాటలు ఈ చిత్రంలోనివే!


షమ్మీకపూర్

షమ్మీకపూర్, రఫీ, శంకర్-జై కిషన్‌ల టీమ్ మరో రెండు హిట్స్‌తో తమకు తిరుగులేదని నిరూపించింది. 'దిల్ తేరా దీవానా' చిత్రం కోసం వీరు అందించిన 'ధఢ్‌కనే లగతా హై మేరా దిల్ తేరా నామ్ సే', 'బిజలీ గిరా కే ఆప్ ఖుద్....దిల్ తేరా దీవానా హై సనమ్', 'నజర్ బచాకర్ చలే గయే వో', 'ముజే కితనా ప్యార్ హై తుమ్‌సే' పాటలు క్లాసిక్స్‌గా నిలిచాయి.


శంకర్ - జైకిషన్

'ప్రొఫెసర్' చిత్రంలోని పాటలగురించి చెప్పనే అక్కర్లేదు. 'ఓ కోయీ ఆయేగా ఆయేగా ఆయేగా, హమరే గాఁవ్ కోయీ ఆయేగా', 'యహ్ ఉమర్ హై క్యా రంగీలి', 'మైఁ చలీ మైఁచలీ', (ఇటీవలనే రీ మిక్స్‌గా వెలువడిన ఈ గీతం సంచలనం సృష్టించిన సంగతి తెల్సిందే!)'ఏ గుల్ బదన్', 'ఖులీ పలక్ మైఁ ఝూఠా గుస్సా', 'ఆవాజ్ దే కే హమేఁ తుమ్ బులావో' పాటలు సూపర్ హిట్ అయ్యాయి.


మహేంద్రకపూర్

శంకర్-జైకిషన్‌లు సాధించిన మరో విజయం -'హరియాలీ ఔర్ రాస్తా'. ఈ చిత్రం కోసం స్వరపరిచిన 'బోల్ మేరీ తక్‌దీర్ మైఁ క్యా హై', ' యే హరియాలీ ఔర్ యే రాస్తా', 'తేరీ యాద్ దిల్ సే', 'ఇబ్తదాయే ఇష్క్ మేఁ' పాటలు వీరికి మంచి పేరును తెచ్చాయి. తొలిసారిగా మనోజ్ కుమార్‌కై మహేంద్రకపూర్ పాడినది ఈ సినిమాలోనే. 'ఖో గయా హై మేరా ప్యార్' అనే ఆ పాట అతనికి గుర్తింపును తీసుకువచ్చింది. తక్కినపాటలు ముకేష్‌వి.

-(వచ్చే సంచికలో మరికొంత)



"ఒరేయ్... నువ్వు మాటిమాటికీ పొరపాట్లు కావాలని చేస్తున్నావేంటి? నీకేమైనా పిచ్చా"

"అబ్బే... అదేంలేదు నాన్నా పొరపాట్ల నుంచే పాఠాలు నేర్చుకోవచ్చునని...'



"ఆ పళ్ళ డాక్టర్ మరీ చాదస్తపు మనిషిలా వున్నాడురా..."

"ఏం...ఏం జరిగిందేంటి?"

"పన్ను నొప్పిగా వుందని వెళితే ఆ నొప్పిని పంటి బిగువున భరించ మంటేనూ..."



"అతడే పని చేసినా వెనకా ముందూ ఆలోచించి చేస్తుంటాడటగా? ఇంతకీ ఏం చేస్తూ ఉంటాడేంటి?" అడిగేడు అమర్

"సైకిలు బ్రేకులు పాడైతే బాగుచేస్తుంటాడు"

ఈ జోకులను పంపించిన వారు -భమిడిపాటి వెంకటేశ్వరరావు, చందానగర్, హైదరాబాద్



"జడ్జి గారికి అప్పు ఇచ్చినందుకు ఆనందపడాలి గాని, బాధ దేనికి?"

"బాధ కాకపోతే ఏమిటి? వసూలుకని ఎప్పుడు వెళ్ళినా, 'ఫలానా రోజున కనిపించు' అంటూ వాయిదాల మీద వాయిదాలు వేస్తుంటే..."



"టింకూ... అమ్మానాన్నా ఆటాడుకుందాం వస్తావా!"

" వస్తాను గాని ఓ షరతు"

"ఏమిటది... త్వరగా చెప్పు"

"నా చేత వంట చేయించకూడదు మరి"



గుడికి వెళ్ళి దేవుడ్ని దర్శించుకున్నారు భార్యాభర్తలు

"దేవుణ్ణి ఏం కోరుకున్నావ్" అడిగాడు భర్త ఆసక్తిగా

"నా 'కోరిక'లన్నీ తీర్చే 'మంచిబుద్ధి'ని మీకు ప్రసాదించమని?" చెప్పింది భార్య కూల్‌గా.



కూతురినీ, అల్లుడినీ చూసి పోదామని పట్నం వచ్చాడో పల్లెటూరి పెద్దమనిషి

పక్కింట్లోంచి ఎవరో స్త్రీ ఏడుపు వుండి, వుండి వినిపిస్తోంది

"ఏమై వుంటుందో... కాస్త వెళ్ళి చూసిరామ్మా" అన్నాడు కూతురితో ఒకింత ఆందోళనగా

"మీరేం కంగారు పడకండి నాన్నా! ఇది టి.వి.లో సీరియల్స్ వచ్చే సమయం కదా! అవి పూర్తయేంత వరకు అప్పుడప్పుడు అలా ఏడుపు వినిపిస్తూనే వుంటుంది" అంది కూతురు



"ఈ మధ్య కూరల్లో ఉప్పు,కారం తెగ వేస్తున్నావు. కాస్త తగ్గించు" కోపంతో రంకెలు వేశాడు భర్త

"అలాగే! మీరు కూడా కొంచెం బీపీ తగ్గించుకోండి" సలహా ఇచ్చింది భార్య

ఈ జోకులను పంపించిన వారు
-కె.జ్యోతి,సికింద్రాబాద్



"రమేష్! నీకు నామీద నిజంగా ప్రేమే ఉంటే ఆ కొండమీద నుండి దూకు చూద్దాం"
"ఊహు! నేను ఛస్తే దూకను"
"ఏం!"
"నేను ఛస్తే నిన్నెవరు ప్రేమిస్తారు చెప్పు...!? అంచేత... నీ మీద ప్రేమతోనే నేను చావాలను కోవటంలేదు"



ఓ ఇద్దరు మిత్రులు చాలా కాలం తర్వాత కలుసుకున్నారు.
ఓ మిత్రుడు అడిగాడు
"ఎలా ఉందిరా జీవితం"
"మూడు పువ్వులు... ఆరు కాయలుగా..."
"అంటే...?"
"నాకు ముగ్గురు భార్యలు... ఆరుగురు పిల్లలు మరి...'.





"సార్! మీ పార్టీ అధికారంలోకి రాగానేఏం చేస్తారు?"
"మేం అధికారంలో లేనపుడు మా మీద అధికారం చెలాయించిన వారిమీద అధికారం చెలాయిస్తాం"

ఈ జోకులను పంపిన వారు - బి.వి.యస్.బాబు,తెనాలి



అర్ధరాత్రి వేళ వీధిలో తిరుగుతున్న చలపతిని పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఆపి ఇలా అడిగాడు-
"తిరగకూడని వేళ తిరుగుతున్న నిన్ను చూస్తే నాకు అనుమానంగా వుంది. ఇందుకు నీ సంజాయిషీ ఏమిటి?"
"ఆమాత్రం సంజాయిషీ ఇచ్చుకోగలిగితే ఇంటికి వెళ్ళి అదేదో మా ఆవిడకే ఇచ్చుకొని వుండేవాడిని సార్... ఇలా రోడ్డుమీద తిరగాల్సిన ఖర్మ ఉండేది కాదు" - నసుగుతూ చెప్పాడు చలపతి పోలీస్ ఇన్‌స్పెక్టర్‌తో.

ఈ జోకులు పంపించిన వారు-మామిడి మహేంద్ర,పూణే



"మమ్మీ నీకు నేనెలా దొరికాను"
"మీ డాడీని అడిగితే ఇచ్చారురా?"
"మరి పక్కింటి ఆంటీకి కూడా నా లాంటి బాబే కావాలట డాడీ ని అడగమని చెప్పనా మరి?



భార్య : వంట మనిషిని తీసేసి మీకు వండిపెడితే నాకు ఎంత ఇస్తారు?
భర్త : ఇంకా నేను ఇవ్వాల్సిన అవసరమేముందే నా ఎల్ఐసి పాలసీ సొమ్మంతా వెంటనే నీకు వచ్చేస్తుందిగా!

ఈ జోకులను పంపినవారు -జి.యామిని సాగర్,వనపర్తి,మహబూబ్‌నగర్ జిల్లా

"మొత్తానికి మన పరంధామయ్య గారి కొడుకులు ముగ్గురూ ముగ్గురేనోయ్"
"అలాగా! ఇప్పుడు పెద్దాడెక్కడున్నాడు?"
"జైల్లో"....
"రెండోవాడు?"
"బెయిల్లో"....
"మూడోవాడు?"
"పరారీలో"...





"రోజుకో పెన్ తో రచనలు చేశావా? ఎందుకని?"
అడిగాడు ఎడిటర్
"మీరేకద్సార్ క్రొత్త కలాల్ని ప్రోత్సహిస్తామని ప్రకటించారు"
చెప్పాడురైటర్.

ఈ జోకులను పంపినవారు -బి.చంద్రశేఖరయ్య,రామసముద్రం,చితూర్తు జిల్లా

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన భమిడిపాటి వెంకటేశ్వరరావు(హైదరాబాద్), కె.జ్యోతి(సికింద్రాబాద్), బి.వి.యస్. బాబు (తెనాలి), మామిడి మహేంద్ర(పూణే), జి.యామినిసాగర్ (వనపర్తి), బి.చంద్రశేఖరయ్య(రామసముద్రం) గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'నిజం' ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్‌ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN
MUSIC



# హాసం సినీగీతకోశం 2003

(గత సంచిక తరువాయి)

## కబీర్‌దాస్

విడుదల తేదీ: 18.07.2003 దర్శకత్వం :వి.వి.రాజు బ్యానర్:కీర్తి చక్ర ప్రొడక్షన్స్ సంగీతం :కె.వి.మహదేవన్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. ఓం అన్న నాదమే నిరాకామూ | ఆత్రేయ | యస్.పి.బాలసుబ్రహ్మణ్యం |
| 2. గ్రహమేలా నిగ్రహమేలా రామానుగ్రహమే ఉంటే | వేటూరి | యస్.పి.బాలసుబ్రహ్మణ్యం |
| 3. ఎన్నేళ్లో వేచితినీ ఎన్నాళ్ళో వేడితినీ | ముళ్లపూడి శాస్త్రి | పి.సుశీల |
| 4. నేను వారణా నీవు అసి వలచి వచ్చిన ప్రేయసీ | వేటూరి | యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పి.సుశీల |
| 5. విరహమోపలేనిదానా విరజాజులు కన్న దానా | వేటూరి | వాణి జయరాం |
| 6. వినరా కబీరు మాటా అది నిను నడిపించే బాటా | సి.నా.రె | యస్.పి.బాలసుబ్రహ్మణ్యం |

## కళ్యాణరాముడు

విడుదల తేదీ: 18.07.2003 దర్శకత్వం : రాంప్రసాద్.జి బ్యానర్:ఎస్.పి.ఎంటర్‌టైన్‌మెంట్స్ సంగీతం :మణిశర్మ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. కథలో రాజకుమారి ప్రేమగ మారి పిలిచేనా | శ్రీహర్ష | జేసుదాస్ |
| 2. ప్రేమించుకున్న వాళ్లు ఊహల్లో తేలుకుంటూ | చంద్రబోస్ | ఉదిత్‌నారాయణ్, కల్పన |
| 3. సీతాకోకమ్మా॥2॥ మా మల్లెపూల తోటలోన | చంద్రబోస్ | శంకర్‌మహదేవన్, ఎస్.పి.చరణ్ |
| 4. ఆడుతు పాడుతు పనిచేస్తుంటే | చిర్రావూరి విజయకుమార్ | మనో, బృందం |
| 5. డోలు బాజ సన్నాయి మోగుతానంటున్నాయి | సిరివెన్నెల | శంకర్ మహదేవన్ |
| 6. గుత్తొంకాయ॥2॥ గుంతలక్కడి గుమ్మ పేరు | చంద్రబోస్ | శంకర్‌మహదేవన్, సుజాత |

## ప్రాణం

విడుదల తేదీ: 25.07.2003 దర్శకత్వం : మల్లి బ్యానర్: ఎం.ఆర్.సి సంగీతం :కమలాకర్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.నిండు నూరేళ్ళు సావాసం స్వర్గమవ్వాలి వనవాసం | సాయిశ్రీహర్ష | సోనునిగమ్, మహాలక్ష్మి |
| 2.సైయ్యారే నా ఎంకి వయ్యారి వల్లంకి కనిపెట్టి | సాయిశ్రీహర్ష | బాలు |
| 3.స్నేహమా...స్వప్నమా ప్రాణమిచ్చు వరమా | సాయిశ్రీహర్ష | హరిహరన్, చిత్ర |
| 4.వాతాపి గణపతింభజే శ్రీ వాతాపి గణపతింభజే | ఇ.ఎస్.మూర్తి | చిత్ర |
| 5.బ్రహ్మాండం బద్దలు కాని విశ్వాసం రద్దయిపోని | సాయిశ్రీహర్ష | బాలు |
| 6. స్నేహమా స్వప్నమా ప్రాణమిచ్చు వరమా | సాయిశ్రీహర్ష | కమలాకర్, గోపికాపూర్ణిమ |
| 7.ధిం...ధిం...ధిం...మా గుండె ధింధిమ్మక్ మోగిందే | సుద్దాల అశోక్ తేజ | శంకరమహదేవన్,కల్పన |

## ధమ్

విడుదల తేదీ: 25.07.2003 దర్శకత్వం :రాజువుపాటి బ్యానర్: బ్లూ స్కై ఎంటర్‌టైన్‌మెంట్ సంగీతం :రమణ గోగుల

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.చల్లగాలికి చెప్పాలనివుందీ | సురేంద్రకృష్ణ | హరిహరన్, నందిత |
| 2.అయ్యోరామా నీతో నేందోనయ్యో | ఆర్.డి.ఎస్.ప్రకాష్ | కౌసల్య |
| 3.నెల్లూరు నెరజాణ అబ్బ గుండెల్లో జడివాన | కందికొండ | రమణగోగుల, నందిత |
| 4.మరుమరు మల్లెల మదువున...ఋతువున | వేటూరి | రాజేష్ |
| 5.ఫ్రెండ్ ఇన్ నీడ్ ఈజ్ ఎ ఫ్రెండ్ | సురేంద్రకృష్ణ | రమణగోగుల |
| 6.అద్దిర బన్న అడుగెయ్యరా | సురేంద్రకృష్ణ | శంకర్ మహదేవన్,చిత్ర |
| 7.మనసులు కలిసి మీ వలపులన్ని విరిసి | సురేంద్రకృష్ణ | రాజేష్, నందిత |

## శంభు

విడుదల తేదీ: 25.07.2003 దర్శకత్వం : సురేష్ వర్మ బ్యానర్:శబరి గిరీశా పిక్చర్స్ సంగీతం : ఇళయరాజా

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.మార్కోని కనిపెట్టవా వందేళ్ల టీనేజీని | కులశేఖర్ | టిప్పు, కార్తిక్, వాసు, రంజిత్ |
| 2.కలలో చూసినది నిన్నేనా | కులశేఖర్ | టిప్పు, ఉష |
| 3.దోసెడు మల్లెలు నేడే గుప్పుమన్నాయి నాలోన | కులశేఖర్ | భవతారిణి, కార్తిక్ |
| 4.బుట్టబొమ్మ భలేగ యమగ వుంది | కులశేఖర్ | టిప్పు, ఉష |
| 5.లౌలీ లీల లవ్వన్న లీల వారెవారెవా | కులశేఖర్ | కార్తిక్, ప్రసన్న, ఫెబి, భవతారిణి |
| 6.సింగపూరు సంతలోన ఓ రమణమ్మా | కులశేఖర్ | కల్పన, సురేందర్, ఝాన్సీ, జోగినాయుడు, శ్రీనివాసరెడ్డి |

## సిటీ

విడుదల తేదీ: 25.07.2003 దర్శకత్వం :అంబటి సుభాష్ బ్యానర్:తాన్యా ఫిలింస్ కార్పోరేషన్ సంగీతం :అనురాగ్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.కౌగిళ్ళలోనే కారాగారం చీకట్లోనే సోకుల బేరం | చంద్రబోస్ | ఆశాభోంస్లే |
| 2. పరువాల ప్రాయమా ఒడిచేరి కరుగుతోంది | జానీ | రవివర్మ, సుధ |

## సంబరం

విడుదల తేదీ: 31.07.2003 దర్శకత్వం : దశరధ్ బ్యానర్:చిత్రం మూవీస్ సంగీతం :ఆర్.పి.పట్నాయక్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.దేవుడిచ్చిన వరమని తెలుసే | కులశేఖర్ | టిప్పు |
| 2.ఎర్రగులాబి తల్లో పెట్టుకున్నది | కులశేఖర్ | రవివర్మ, మల్లి & గ్రూప్ |
| 3.ప్రేమను పంచిన ప్రేమను | కులశేఖర్ | ఆర్.పి |
| 4.మధురం మధురం ఎపుడూ ప్రేమ | కులశేఖర్ | రాజేష్ |
| 5.ఎందుకే ఇలా గుండే లోపలా | సిరివెన్నెల | ఆర్.పి |
| 6.నక్కతోక తొక్కావురో | కులశేఖర్ | రవివర్మ, శ్రీరాం, బాలాజి |
| 7.పట్టుదలతో చేస్తే... సమరం | సిరివెన్నెల | మల్లికార్జున్ |
| 8.నీ స్నేహం దూరం ఆయె | కులశేఖర్ | ఆర్.పి |
| 9.పిట్ట నడుంపిల్ల భలేగుందిరా | కులశేఖర్ | ఆర్.పి, ఉష |

## దొంగోడు

విడుదల తేదీ: 07.08.2003 దర్శకత్వం : భీమినేని శ్రీనివాసరావు బ్యానర్:గుడ్‌విల్ సినిమా సంగీతం :విద్యాసాగర్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.కోడిముందా గుడ్డుముందా | చంద్రబోస్ | శంకర్ మహదేవన్, రిమ్మీటామి |
| 2.డుండుండుం | సీతారామశాస్త్రి | వలీషా బాబ్జి, చిత్ర |
| 3.ఎంత పంజేసింది ప్రేమ | సీతారామశాస్త్రి | హరిహరన్, సుజాత |
| 4.సొట్టబుగ్గల రుక్కుమణి | భాషశ్రీ | కార్తీక్, స్వర్ణలత |
| 5.దొంగా దొంగా (థీమ్) | బండారు దానయ్య | పిల్లల బృందగానం |
| 6.మీసాలా గోపాలా | భాషశ్రీ | ఉదిత్ నారాయణ్, శ్రీవర్ధిని |

## సింహాచలం

విడుదల తేదీ: 08.08.2003 దర్శకత్వం : ఇంద్రకుమార్ బ్యానర్:చంద్రహాసహ సినిమా సంగీతం :మణిశర్మ

| పాట పల్లవి | రచన |
|---|---|
| 1. దోబూచులాడే సిగ్గాటకి లాలూచీ పడ్డ ముద్దాటకి | వేటూరి |
| 2. మనసేమో అదిరిపడి నాకేమో మనసుపడి అందాల ఏలుబడి | సాయిశ్రీహర్ష |
| 3. నీతిని నమ్మితే ఓటమి ఉండునా | సుద్దాల అశోక్‌తేజ |

# నీకు నేను నాకు నువ్వు

విడుదల తేదీ: 15.08.2003 దర్శకత్వం : డి.రాజశేఖర్ బ్యానర్:సురేష్ ప్రొడక్షన్స్ ప్రైవేట్ లిమిటెడ్ సంగీతం :ఆర్.పి.పట్నాయక్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.నా చిరునామా నీ హృదయాన కొలువైందా | పెద్దాడ మూర్తి | రాజేష్, చిత్ర |
| 2.ప్రేమకన్న గొప్పదింక నేలపైన లేదని | కులశేఖర్ | శంకరమహాదేవన్, చిత్ర |
| 3.పెళ్ళాడే తీరాలన్నారు... మా నాన్నారు | చైతన్య ప్రసాద్ | బాలు, చిత్ర |
| 4.నేను నీకెవరని అనీ ఏమి కాదని అని | వేటూరి | కార్తీక్, ఉష |
| 5.తెలుగు భాష తియ్యదనం.. తెలుగుజాతి గొప్పదనం | చంద్రబోస్ | యస్.పి.చరణ్ |
| 6.గోల్..గోల్...గోల్...గోల్ | చంద్రబోస్ | ఉదయకిరణ్, ఉష, సాకేత్, లిటిల్ మ్యూజిషియన్స్ |
| 7.గుమ్మారె...గుమ్మారె...ముద్దు గుమ్మారె | పెద్దాడమూర్తి | కె.కె, ఉష |

# చార్మినార్

విడుదల తేదీ: 15.08.2003 దర్శకత్వం : సాగర్ బ్యానర్:కాళి క్రియేషన్స్ సంగీతం :ఘంటాడి కృష్ణ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.గోదావరిలా॥2॥పొంగేనమ్మా నిండు చందమామ | తైదల బాపు | కుమారుసాను, మాళవిక |
| 2.ఐస్‌లా నైస్‌గా చూడకమ్మా | జల శ్రీనివాస్ | ఉదిత్ నారాయణ్, స్వర్ణలత |
| 3.ఏమైందో ఏమోగాని అమ్మొమ్మో ఈ వేళ | వరికుప్పల యాదగిరి | శ్రీయగోషాల్ |
| 4.ఈ లోకమంతా చార్‌సౌ బీసుగాళ్ళ సొంతమయె | సుద్దాల అశోక్ తేజ | ఘంటాడి కృష్ణ |
| 5.బ్రతుకు ఒక మాయా...బాధపడతామె సులువుగా | వరికుప్పల యాదగిరి | బిందు |
| 6.చార్మినార్ చిన్నది సోకు సోలెడున్నది ఆకువక్క | జయసూర్య | ఘంటాడి కృష్ణ |

# అనగా అనగా ఓ కుర్రోడు

విడుదల తేదీ: 15.08.2003 దర్శకత్వం : ఎల్.పి.రామారావు బ్యానర్:శ్రీ సాయి ఊహ క్రియేషన్స్ సంగీతం :చక్రి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.నేనే నువ్వని నువ్వే నేనని | కందికొండ | కౌసల్య, వేణు |
| 2.సెల్‌ఫోన్ ధ్వనినే నవ్వు దాచేసి నాకే ఇవ్వు | కందికొండ | గోపికా పూర్ణిమ, చక్రి |
| 3.విజయం మన సొంతమయితే ఉత్సాహానికి | భువనచంద్ర | టిప్పు, అనూరాధా శ్రీరామ్ |
| 4.కల తెలవారింది కన్నీరు మిగిలింది | కందికొండ | కౌసల్య |
| 5.సక్కుబాయి మీరంట నేనుంటే పులకింత | కందికొండ | సునీత, రఘుకుంచె |
| 6. చిన్న డ్రస్సులో పెద్దపాపా చంపేసింది సొరచేప | కందికొండ | సుధ, రవివర్మ |

# సీతయ్య

విడుదల తేదీ: 22.08.2003 దర్శకత్వం : వై.వి.యస్.చౌదరి బ్యానర్:బొమ్మరిల్లు వారి సంగీతం :కీరవాణి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.అమ్మతోడు నాన్నతోడు నిన్ను పుట్టించిన బ్రహ్మతోడు | చంద్రబోస్ | ఉదిత్‌నారాయణ్, చిత్ర |
| 2.ఇదిగో రాయలసీమగడ్డ | డా.సినారె | బాలు |
| 3.సుగుణాభిరాముడు సమరాన భీముడు | చంద్రబోస్ | అనూరాధ, శ్రీరామ్, కీరవాణి |
| 4.సమయానికి తగు సేవలు చేయనీ శ్రీవారికి | చంద్రబోస్ | విజయ్ ఏసుదాస్, సునీత |
| 5.పైరుకోయిల కూసింది పల్లె దరువులు తీసింది | డా.సినారె | బాలు, కీరవాణి |
| 6.ఆదిశంకరుల సౌందర్యలహరి | చంద్రబోస్ | ఎస్.పిబాలు, చరణ్, సునీత |
| 7.ఎవరి మాటా వినడు సీతయ్య | డా.సినారె | కీరవాణి |
| 8.సిగ్గేస్తుంది నిను చూస్తుంటే | చంద్రబోస్ | శ్రీయాగోషాల్, కీరవాణి |
| 9.అనాది మహిళా మాతా | వేటూరి | కీరవాణి |
| 10.బస్సెక్కి వస్తావో బండెక్కి వస్తావో | చంద్రబోస్ | బాలు, చిత్ర |
| 11.నా పరిపూర్ణ పరిశుద్ధ హృదయంతో | కీరవాణి | కీరవాణి |

# బాయ్స్

విడుదల తేదీ: 29.08.2003 దర్శకత్వం : శంకర్ బ్యానర్:శ్రీ సూర్యా మూవీస్ సంగీతం :ఎ.ఆర్.రెహమాన్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.పదహారు ప్రాయంలో నాకొక గర్ల్ ఫ్రెండ్ కావాలి | ఎ.ఎం.రత్నం, శివగణేష్ | కార్తిక్, డిమ్మి, టిప్పు |
| 2.ఎవరి నడిగి నాగుండెల్లో | ఎ.ఎం.రత్నం, శివగణేష్ | ప్లాసి, వసుందరాదాస్ |
| 3.ఎగిరి దుమికితే నింగి తగిలేను | ఎ.ఎం.రత్నం, శివగణేష్ | కార్తిక్, చిత్ర, శివరామన్ |
| 4.సారీగమే పాదనిసే మార్చివేసేయ్ | ఎ.ఎం.రత్నం, శివగణేష్ | లక్కీఆలి, క్లింటన్, ప్లాసి, వసుందరాదాస్ |
| 5.బూమ్ బూమ్ షికికా షికాకా | ఎ.ఎం.రత్నం, శివగణేష్ | ఉదిత్‌నారాయణ్, సాదనాసర్గం |
| 6.మారో మారో చౌకా చక్కా సా మారో | ఎ.ఎం.రత్నం, శివగణేష్ | కార్తిక్, కునాల్, జార్జి, అనుపమ, సునీత |

## ఆడంతే.. అదోటైపు

విడుదల తేదీ: 30.08.2003 దర్శకత్వం : ఇ.వి.వి.సత్యనారాయణ బ్యానర్:అంబికా ఆర్ట్స్ సంగీతం :యువన్ శంకర్ రాజా

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.చిన్నా దాని సోకు | సురేంద్రకృష్ణ | టిప్పు, సుజాత |
| 2.పొగరెక్కి పందెమేస్తే | సురేంద్రకృష్ణ | బాలు |
| 3.ఓ ప్రేమా ఓ ప్రేమా | సురేంద్రకృష్ణ | శంకర్‌మహదేవన్ |
| 4.ఓ ఫ్రెండు | సురేంద్రకృష్ణ | కార్తిక్, టిప్పు |
| 5.కోపంగా చూస్తూ | సురేంద్రకృష్ణ | రాజేష్, వర్మ, గంగాధర్, సందీప్, ఉష |
| 6.అందమే ఆనందం | సురేంద్రకృష్ణ | కార్తిక్, గోపికా పూర్ణిమ |
| 7.చిన్న నవ్వుతోనే | సురేంద్రకృష్ణ | హరిహరన్ |

## ఓ రాధ ఇద్దరు కృష్ణుల పెళ్లి

విడుదల తేదీ: 05.09.2003 దర్శకత్వం : జి.నాగేశ్వర రెడ్డి బ్యానర్:శ్రీ బాలాజీ క్రియేషన్స్ సంగీతం :చక్రి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.శ్రీరామచంద్రా సిగ్గే గోవిందా ముద్దుల్తో మొదలెట్టెయ్ | భాస్కరభట్ల | ఉదిత్‌నారాయణ్, కౌసల్య |
| 2.ఆకూ వక్కాలిచ్చి సోకూ సున్నాలెట్టె నా మనసె | భాస్కరభట్ల | చక్రి, శ్రీయాగోషాల్ |
| 3.నా గుండెకలమే ఐతే నీ పేరే రాస్తాలే... | పైడిపల్లి శ్రీనివాస్ | శంకర్‌మహదేవన్, కౌసల్య |
| 4.లవ్వుదోమ కుట్టేసి చంపె గుండెల్లోన హంగామా | భువనచంద్ర | సుఖ్వీందర్ సింగ్, కౌసల్య |
| 5.చిలకా ॥3॥ చిరునవ్వుల నా శశిరేఖా ॥2॥ | కందికొండ | కుమార్‌సాను, శ్రీయాగోషాల్ |
| 6.గరం గరం బేల్‌పూరిని నాసామిరంగ గన్నవరం | కందికొండ | చక్రి, కౌసల్య |

## బస్తీమే సవాల్

విడుదల తేదీ:12.09.2003 దర్శకత్వం :రామ్ లక్ష్మణ్ బ్యానర్:సౌత్ ఇండియన్ మూవీస్ సంగీతం :సురేష్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.బస్తీమే సవాల్ (5) అంటూ తొడనె గొట్టావ్ | కృష్ణదాస్ | నిత్య సంతోషిణి |
| 2.ఓ పోరి నా పోరి నిన్నెమో లేను ప్యార్‌కియా | కృష్ణదాస్ | సురేష్, పద్మావతి, శ్రీదేవి |
| 3.మొగుడా మొగుడా... ఓరినా మొగుడా కోరివచ్చా | కృష్ణదాస్ | గాయత్రి |
| 4.రగులుతుందిరా మొగలి పొదరా... ఏదో చెయ్యరా | సుధాకర్ | మాధురి |
| 5.కోడిబాయె లచ్చుమ్మది...కోడిపుంజు బాయె లచ్చుమ్మది | కలువకృష్ణ సాయి | వెంకటాచలం, కౌసల్య |

## పెళ్లాంతో పనేంటి

విడుదల తేదీ:12.09.2003 దర్శకత్వం :ఎస్వీ కృష్ణారెడ్డి బ్యానర్:జగన్నాథ సినీ అండ్ మీడియా క్రియేషన్స్ సంగీతం :ఎస్వీ కృష్ణారెడ్డి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.మల్లె చెట్టు నిన్ను చూసి మండిపడ్డదే | చంద్రబోస్ | రవివర్మ, కౌసల్య |
| 2.ఎన్ని జన్మలైనా చాలవే ఎలాగా ॥2॥ | సిరివెన్నెల | శ్రీయాగోషాల్ |
| 3.వినండహో జనులారా మా గుండెల్లో ఈ జేగంట | సిరివెన్నెల | బాలు, సునీత & కోరస్ |
| 4.కూసింది కోయిలా అన్ని వేళలా నీ మాటల మాటునున్న ఆనందంలా | చంద్రబోస్ | హరిహరన్, సునీత |
| 5.ఒక్క నిమిషమైనా చాలుగా ఇలాగ ॥2॥ | సిరివెన్నెల | హరిహరన్, సునీత |
| 6.ఓలమ్మో... ॥3॥ ఓరినాయనో ఓమ్మో ఓరినాయనో | చంద్రబోస్ | ఉదిత్‌నారాయణ్, లెనినా |

## జానకి వెడ్స్ శ్రీరామ్

విడుదల తేదీ:12.09.2003 దర్శకత్వం :'అంజి' శ్రీను బ్యానర్:ఎస్.ఆర్.బి.ఆర్ట్ ప్రొడక్షన్స్ సంగీతం :ఘంటాడి కృష్ణ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.మేరాదిల్ తుజ్‌కో దియా | తైదలబాపు | కుమార్‌సాను & కోరస్ |
| 2.పండువెన్నెల్లో ఈ వేణుగానం | సిరివెన్నెల | టీనా కమల్ |
| 3.రివ్వున ఎగిరే గువ్వా నీ పరుగులు ఎక్కడికమ్మా | చైతన్యప్రసాద్ | సునీత,ఉషసంజీవని,ఘంటాడికృష్ణ,ఘటికాచలం,వరికుప్పలయాదగిరి& కోరస్ |
| 4.అందాల భామలూ క్యాట్‌వాక్ చేపలూ | చైతన్యప్రసాద్ | సందీప్, భౌమిక్,సునీల్,నిష్మా & కోరస్ |
| 5.ఎక్కడ నిన్ను వెతకాలి ఎవరిని నేను అడగాలి | చైతన్యప్రసాద్ | రాజేష్, నిత్య సంతోషిణి |
| 6.నిన్ను ఎంత చూసినా చూడనట్టు ఉండవు | తైదలవు బాపు | ఉదిత్ నారాయణ్,టీనా కమల్ |
| 7.రివ్వున ఎగిరే గువ్వా నీ పరుగులు ఎక్కడికమ్మా | సిరివెన్నెల | ఎస్.పి.బాలు |
| 8.ఈఫీల్ టవరయినా॥2॥ | తైదలబాపు | శంకర్ మహదేవన్, సురేఖా మూర్తి |

-(వచ్చే సంచికలో మరికొంత)



# ఆ పాట మధురం

రాజా

దర్శకుడు బి.ఎ.సుబ్బారావుకి తెలుగు సినీ రంగంలో ఓ చారిత్రాత్మక స్థానం ఉంది. ఎన్.టి.ఆర్, ఏయన్నార్ కాంబినేషన్‌లో తొలిసారిగా 'పల్లెటూరి పిల్ల' చిత్రాన్ని తీసింది ఆయనే. శోభనాచల బ్యానర్‌తో తన బి.ఎ.యస్ బ్యానర్‌ను కలుపుకుంటూ ఆ చిత్రాన్ని తీసిన తర్వాత స్వతంత్రంగా బి.ఎ.యస్ బ్యానర్‌పై అటు ఏయన్నార్‌తోను ఇటు ఎన్‌టిఆర్‌తోను ఎన్నో మంచి చిత్రాలు తన దర్శకత్వంలో నిర్మించారు. 'రాజు - పేద', 'చెంచులక్ష్మి', 'రాణీ రత్నప్రభ', 'భీష్మ' అందులోని కొన్ని. ఇవి కాక 'మైరావణ', 'మోహినీ భస్మాసుర' వంటి చిత్రాలు కూడా ఆయన ఖాతాలో ఉన్నాయి. 'రాజు - పేద' నుంచి ఎస్.రాజేశ్వరరావే ఆయనకు సంగీత దర్శకుడు. వీళ్ళిద్దరి కాంబినేషన్‌లో వచ్చిన చిత్రాల్లోని పాటలలో అభిరుచి ప్రత్యేకంగా కనిపిస్తూ ఉంటుంది. 1960లో విడుదలైన




అనే ఓ జానపద చిత్రంలో - అటు జనాదరణతో కూడిన అభిరుచికి, ఇటు అభిరుచితో కూడిన ప్రత్యేకతకు సాక్ష్యాలుగా నిలబడగలిగే ఓ నాలుగు పాటలివి :

నిన్న కనిపించింది  
నన్ను మురిపించింది  
అంద చందాల రాణీ ఆ చిన్నది ॥నిన్న॥  
ఆమె చిరునవ్వులోనే  
హాయున్నది ॥ఆమె॥  
మనసు పులకించగా మధురభావాలు  
నాలోన కలిగించింది ॥నిన్న॥  
మరచిపోలేను ఆ రూపు ఏనాటికి ॥మరచి॥  
మమత లేవేవో చెలరేగే ఇది ఏమిటి ॥మమత॥  
తలచుకొనగానే ఏదో ఆనందమూ ॥తలచు॥  
వలపు జనియించగా  
ప్రణయగీతాలు  
నాచేత పాడించింది ॥నిన్న॥  
సోగకనులార చూసింది సొంపారగా  
మూగ కోరికలు చిగురించె ఇంపారగా ॥సోగ॥  
నడచిపోయింది ఎంతో నాజూకుగా ॥నడచి॥  
విడచి మనజాలను విరహతాపాలు  
మోహాలు రగిలించింది ॥నిన్న॥



ఈ పాటను ఆరుద్ర రాయగా ఘంటసాల గానం చేశారు. ఎన్.టి.ఆర్. ప్రధాన పాత్రధారిగా చిత్రీకరించిన ఈ పాటలో రేలంగి, సీతారామ్, అంజలి, సి.యస్.ఆర్. అవసరానుగుణంగా కనిపిస్తారు. ఘంటసాలకి,ఆరుద్రకి వారి సినీ జీవితంలో మైలురాయిలా నిలిచిపోయిన గీతమిది. తొలిచూపులో కలిగే ప్రేమానుభవాలు మనసులో ఎటువంటి భావాలను కలిగిస్తాయో వాటన్నిటినీ అందమైన, తేలికైన మాటలతో విరహ గీతాలుగా మలిచి రాయటంలో ఆరుద్ర సిద్ధహస్తుడు, ప్రసిద్ధ హస్తుడు అని నిరూపించే గీతమిది. ఈ పాటతో పరిచయం ఉన్న ప్రతివారు తమ అనుభవాలతో కలుపుకుని జీవిత కాలంలో ఒక్కసారైనా నెమరు వేసుకోకుండా ఉండలేరేమో?! ఇక సంగీతపరంగా చూసుకుంటే మొదటి చరణం ట్యూన్ ఒకలాగ, రెండు,మూడు చరణాల ట్యూన్ మరోలాగ ఉంటుంది. అప్పట్లో కొన్ని పాటలలో ఒకటి, మూడు చరణాలు ఒకలాగ రెండోచరణం మాత్రం మరోలాగ ఉండటం

జరిగేది. మంచి ట్యూన్ హిట్ అవటానికి ఆ కొలతలేవీ అడ్డం కావని ఋజువు చేసిన ఈ గీతానికి ప్రధాన రాగం భీంప్లాస్. ఆ రాగానికి సంబంధించిన స్వరాలతో పాటు అన్యస్వరాలను కూడా విస్తృతంగా వాడుకుంటూ కొండకచో అంతర్గాంధారం, శుద్ధ దైవతంని జతచేసుకుంటూ ఖరహర ప్రియ రాగ లక్షణాలను జోడించుకుంటూ (ముఖ్యంగా రెండు,మూడు చరణాల్లో) 'ప్రయోజనరంజకం'గా తయారు చేశారు యస్.రాజేశ్వరరావు. తదనుగుణంగా ఘంటసాల పాటను ఆవిష్కరించిన తీరుకూడా రసాత్మకంగా సాగటంతో ఎంతో కాలం మన్నటానికి, ఎంతోమంది మన్ననలను అందుకోవటానికి కావలసిన అర్హతలన్నిటినీ ఈ గీతం సంతరించుకున్నది.

ఆమె : అనురాగము ఒలికే ఈ రేయి మనసారగ కోర్కెలు తీరేయి
మన హాయికి సాటే లేదోయి అనురాగము
అతడు : ఆ ఆ ఆ ఆ ఆ
అనురాగము ఒలికే ఈ రేయి మనసారగ కోర్కెలు తీరేయి
మన హాయికి సాటే లేదోయి అనురాగము
ఆమె: చల్లని వెన్నెలలోన
ఝలు ఝల్లను వలపులసోన ॥చల్లని॥
చిరునవ్వులతో విరితేనెలతో
మన జీవితాన పూలవాన అనురాగము
అతడు: ఆ ఆ ఆ ఆ ఆ ఆ
అనురాగము ఒలికే ఈరేయి
మనసారగ కోర్కెలు తీరేయి
మన హాయికి సాటే లేదోయి
అనురాగము
ఆమె: తెలియని పరవశమొంది మన
కలలు ఫలించినవోయి ॥తెలియని॥
అనుబంధముతో ఆనందముతో మది
తేలి తేలి సోలిపోయె
అనురాగము
అతడు: ఆ ఆ ఆ ఆ ఆ
అనురాగము ఒలికే ఈ రేయి మనసారగ కోర్కెలు తీరేయి
మన హాయికి సాటే లేదోయీ
అనురాగము








ఈ పాటను పి.సుశీల,పిబీ శ్రీనివాస్ గానం చేయగా అంజలీదేవి, ఎన్.టి.రామారావు అభినయించారు. ఈ పాటకు అమీర్ కళ్యాణి రాగం ఆధారం. ఇదే రాగంలో యస్.రాజేశ్వరరావు స్వరపరచిన 'భక్తజయదేవ' చిత్రంలోని 'నీ మధు మురళీ గానలీల' పాట సినీసంగీత ప్రియులకు, ఘంటసాల ఆరాధకులలకు బాగా గుర్తుండే ఉంటుంది. ఆ పాటను, ఈ పాటను సంపాదించి, కలిపి వినండి. ఆలాపనలు, ఇంటర్ల్యూడ్‌లు ఎంత దగ్గరగా ఉన్నాయో తెలుస్తుంది. సరియైన ప్రచారం లభించక కాలగర్భంలో కలిసి పో(బో)తున్న మంచి పాటలలో ఇదొకటి. ఏ ఛానల్ వారయినా పూనుకుని ఈ పాటను వరసగా కొన్నాళ్ళపాటు ప్రేక్షక శ్రోతలకు అందిస్తే - చక్కని అభిరుచి గల వారి మన్ననకు పాత్రులవుతారు. ఆరుద్ర రాసిన ఈ పాటలో 'ఈ రేయి - తీరేయి' అనే పద ప్రయోగం ఆయనను పట్టియిచ్చే ముద్ర.

అతడు: నీటైన పడుచున్నదోయ్ నా రాజా
నీకే నా లబ్జన్నదోయ్ ఆహాహా ॥నీటైన॥
నీతోటి మాటంది - నిన్నే రమ్మంది ॥నీ తోటి॥
నీపైన కన్నేసింది - ఆహాహా
నీవే కావాలన్నది - ఓహోహో ॥నీటైన॥
వాలైన వన్నెలాడి - ముచ్చటైన ముద్దులాడి
చందమామ అందంతో - సై అన్న వగలాడి ॥వాలైన॥
ఏడేడు లోకాల యీడులేని దొరసాని
నీ నీడ నున్నది - నీ జాడ గన్నది ॥నీటైన॥
స్త్రీ కంఠంతో: మగవారి మాయలోన చిక్కనన్నదోయ్ - అది
మాటంటె ఎన్నటికి పడనన్నదోయ్ ॥మగవారి॥
ఒకటంటే పది బాగ వడ్డిస్తానన్నదోయ్
చెవిపట్టుకొని సాగదీస్తా లెమ్మన్నదోయ్ ॥నీటైన॥
అతడు: ఓర్చుకొన్నవారికే ఓరుగల్లన్నదీ
స్త్రీ కంఠంతో: ఆత్రపడ్డవారికే అందను పొమ్మన్నదీ
అతడు: రంగైన చిన్నదీ రాలుగాయ నన్నదీ
స్త్రీ కంఠంతో: వరసైతే చచ్చినా వదలిపెట్టనన్నదీ ॥నీటైన॥






ఈ పాటను కొసరాజు రాయిగా ఘంటసాల,స్వర్ణలత ఆలపించారు. రేలంగి ప్రధాన పాత్రధారిగా అభినయించగా అలనాటి హాస్యజంట నల్లరామ్మూర్తి - సీతారామ్ లోని సీతారామ్, మరికొంతమంది ఉపపాత్రధారులు కూడా అభినయించారు. హాస్యనటుడు బాలకృష్ణ పాటమధ్యలోనూ, హీరో ఎన్.టి.ఆర్ పాట చివర్లోనూ కనిపిస్తారు. ఓర్చుకున్నవారికే ఓరుగల్లు, వాలైన వన్నెలాడి, లబ్జు వంటి పద ప్రయోగాలతో కొసరాజు కాస్సేపు ఆలోచింపచేస్తారు. పాటలో స్త్రీ పురుష కంఠాలు రెండు ఉన్నా ఇటు ఆడవారి పరంగానూ, ఇటు మగవారి పరంగానూ, రెండు అభినయాలను రేలంగి అందించారు. ఘంటసాల హుషారుగా, తమాషాగా పాడిన పాటల జాబితాలో ఈ పాట స్థానం ప్రత్యేకమైనదని ఇప్పుడు విన్నా కూడా అనిపిస్తుంది. ఈ పాటలో మరో తమాషా కూడా ఉంది. పల్లవి పూర్తికాగానే వచ్చే ఇంటర్ లూడ్‌ని, కంఠతా వచ్చేవరకూ పదేపదే వినండి. 'ప్రేమలేఖలు' సినిమాద్వారా శంకర్ - జైకిషన్ అందించిన 'ఘల్లు ఘల్లు ఘల్లు ఘల్లు గజ్జెల సంగీతం' పాటలోని ఇంటర్ లూడ్స్‌తో పోల్చుకోండి. సరదాపాట కనుక యస్.రాజేశ్వరరావు సరదాగా పేరడీ చేసినట్లు అనిపిస్తుంది.

| | |
|---|---|
| కనులలో కులుకులే కలిసి హాయిగ పిలిచెనే | ॥కనులలో॥ |
| తలపులో వలపులే మురిసి తీయగ నవ్వెనే | ॥కనులలో॥ |
| సొగసు చిలికే వయసులోనే | |
| అనుభవించాలి | ॥సొగసు॥ |
| మంచి సమయము మించినా | ॥మంచి॥ |
| తపించినా లభించునా | |
| ఈ మౌనమేలా జాబిలీ | ॥కనులలో॥ |
| మనసు విరిచే వింత కలలే | |
| మరచిపోవాలీ | ॥మనసు॥ |
| నిజము తెలియక పోవునా | ॥నిజము॥ |
| నమ్మించినా;కవ్వించినా | |
| చిన్నారి రూపే మారినా | ॥కనులలో॥ |



ఈ పాటను సుశీల గానం చేశారు. తెరపై ఎన్.టి.ఆర్,అంజలి పై చిత్రీకరించారు. ఈ పాటను కొసరాజు రాఘవయ్య చౌదరి రాసినట్టుగా పాటల పుస్తకంలో ఉంది. మంచి అభిరుచితో రూపుదిద్దుకున్నా, మరుగున పడిపోయిన మధుర గీతాలలో ఒకటిగా ఈ పాటను ఉదహరించవచ్చు. ఈ పాట దొరికే అవకాశాలు కూడా అంతంత మాత్రమే. లభ్యమైతే మాత్రం ఓ చక్కటి కలక్షన్‌గా దాచుకోదగ్గ ఈ పాట మోహనరాగం ఆధారంగా సాగుతుంది. మోహనరాగంలో రాజేశ్వరరావు శ్రోతలకు సమర్పించిన పాటలెన్నో... 'కళ్ళుతెరచి కనరా'(రాజు -పేద), ఎచట నుండి వీచెనో ఈ చల్లని గాలి (అప్పుచేసి పప్పుకూడు), పాడవేల రాధికా (ఇద్దరు మిత్రులు), వినిపించని రాగాలే (చదువుకున్న అమ్మాయిలు), మదిలో వీణలు మ్రోగే (ఆత్మీయులు) ఇవన్నీ మోహనరాగం ప్రధాన రాగంగా ఆయన స్వర రచనలో సాగినవే. ఆ పాటల మాధుర్యపు స్థాయికి ఏ మాత్రం తగ్గని రీతిలో ఉంటుంది ఈ 'కనులలో కులుకులే' గీతం. మోహనరాగంతో మాండ్‌రాగాన్ని మిళితం చేసుకుంటూ అవసరం అయిన చోట పహాడీ రాగచ్ఛాయలతో మలచుకుంటూ పాటను పారవశ్యపు అంచుల దాకా తీసుకు వెళ్ళగలగటం రాజేశ్వరావు సాధించుకున్న ప్రత్యేకత. టోక్యో మోహన, సినీమోహన లాగ 'రాజేశ్వరరావు మోహన' అంటూ ఓ బ్రాండ్ నేమ్ వచ్చేలా ఉంటాయి - ఆయన ఆ రాగంలో స్వరపడిన గీతాలు! అందుకు పైన ఉదహరించిన గీతాలే సాక్ష్యాలు. వాటితో సమస్థాయిలో గౌరవాన్ని పొందదగ్గ అర్హతగల ఈ గీతాన్ని ప్రజలకు కొన్నాళ్ళపాటు అందించే కార్యక్రమాన్ని ఏ ఛానల్ వాళ్ళో ఆడియో వాళ్ళో పూనుకుంటే పుణ్యం కట్టుకున్నవారవుతారు.

ఈ చిత్రంలో మొత్తం తొమ్మిదిపాటలున్నాయి. మిగిలిన అయిదు పాటలలో ఎక్కడ దాచావోయ్ సిపాయి, విన్నావా నూకాలమ్మా, ఒహ్హోహ్హో అందాల మహరాజా బందీగ మననేల రాజా వంటి ఫరవాలేదనిపించే పాటలు కూడా లేకపోలేదు. అయితే పై నాలుగు పాటల ప్రత్యేకతే వేరు. ఈ చిత్రానికి సంబంధించిన పాటలలో ఇంకో ప్రత్యేకత ఉంది. 1960 నాటికి కథానాయకుడిగా ఎన్.టి.ఆర్, హాస్యనటుడిగా రేలంగి బాగా ఎస్టాబ్లిష్ అయిపోయారు. ఆయనకు ఘంటసాల, ఈయనకు మాధవపెద్ది రెగ్యులర్‌గా నేపథ్యం పాడేవారు. ఎప్పుడో ఒకటీ అరా మినహాయింపులు ఉండొచ్చు. కానీ ఈ చిత్రంలో ఎన్.టి.ఆర్ అభినయించిన యుగళ గీతాలకి పిబీ శ్రీనివాస్‌చేత పాడించడం (నిన్న కనిపించింది పాట సోలో కింద వస్తుంది), రేలంగికి ఘంటసాల చేత పాడించటం గమనించదగ్గ విషయం.

# సరిగపదమని

కూర్పు : టి.నవీన్

**12**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | ● | 3 | | 4 | | |
| ● | | ● | 5 | | ● | | ● | ● |
| 6 | ● | 7 | | ● | 8 | ● | 9 | 10 |
| 11 | | ● | 12 | 13 | | ● | ● | |
| | ● | 14 | ● | | ● | 15 | | |
| | ● | | ● | | ● | ● | ● | |
| | ● | | ● | ● | ● | 16 | ● | ● |
| ● | 17 | ● | 18 | ● | 19 | | | 20 |
| 21 | | ● | 22 | | ● | | ● | |

పంపినవారి పేరు :.........................................................

వయసు :........... వృత్తి :.................................................

చిరునామా :..........................................................

.......................................................................

......................................................ఫోన్ :....................

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక
ప్రతిసారి
ఓ సినీ ప్రముఖునిచే...

This feature is sponsored by :

HMV

saregama

**అడ్డం:-**

1. ............ బోలో హరి గోపాలు బోలో (3)
3. '.......... నాటుబాంబులు అతిథులు మీరండి' వెంకటేష్ అభినయించిన పాట (5)
5. '.......సుకోబోయి పారేసుకున్నాను' అడవిరాముడు చిత్రంలోని పాట (2)
7. తెలుగు పదానికి జన్మ...... జానపదానికి జ్ఞానపదం ఇది అన్నమయ్య జననం (2)
9. అమ్మాయే సన్నగా అరనవ్వే నవ్వగా ........తప్పి కుర్రాళ్ళే మంచాన పడ్డారే (2)
11. '......... మెత్తితిరా అనుభవించితిరా' ఘంటసాల పాడిన పాట (2)
12. .......... మేనత్త కూతురా వద్దు ........ నా గుండెలదరా (3)
15. నిండు గోదారి కదా ........ అందరికి బంధువురా ...... (3)
19. '.........చేయ్యేసి చెప్పేయనా' 'బొంబాయి ప్రియుడు' కోసం కీరవాణి స్వరపరిచిన గీతం(4)
21. 'ప్రతి...... వసంత ..... ప్రతిగాలి పైరగాలి (2)
22. 'ఎక్కడవున్నా పక్కన ....... ఉన్నట్టుంటుంది చెలీ' నువ్వేకావాలి చిత్రంలోని పాట (2)

**నిలువు:-**

2. విన్నపాలు వినవలె ....... ......లు పన్నగపు దోమ తెర పైకెత్తవేమయ్య (2)
3. '........ ........ నై......... బాబా' ఆంధ్రావాలా చిత్రంలోని పాట (2)
4. పెళ్ళి కళ వచ్చేసిందే ......... (2)
5. అందమె ........... ఆనందమె జీవిత మకరందం (3)
6. '................ ఎంత అందమైన దేశం' సిపాయి చిన్నయ్య చిత్రంలోని పాట (5)
8. వగలరాణివి ....... సొగసుకాడనే నేనే (2)
10. ............ గిరివాసా దివ్యమందహాసా (4)
13. '........... రాని వాడవని దిగులు చెందకు' సి.నారాయణరెడ్డి గీతం (3)
14. ........... వరమందిస్తే నే నిన్నే కోరుకుంటాలే (3)
16. 'అయ్యయ్యో ............ డబ్బులు పోయెనే' (3)
17. 'ఇది తొలి ........... కదలని .......... ' నాగార్జున అభినయించిన పాట (2)
18. '....... వీడని నీడను నేనే' (2)
20. సిరిమల్లె పువ్వల్లె ........ చిన్నారి పాపల్లే నువ్వు (2)

**పజిల్, కూపన్ 15-02-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)




36పాటలు గల
డబుల్ ప్యాక్ ఆడియో సి.డి.

రెండవ బహుమతి (ఒక తప్పుతో)




15పాటలు గల
సింగిల్ ప్యాక్ ఆడియో సి.డి.

మూడవ బహుమతి (రెండు తప్పులతో)



36పాటలు గల
డబుల్‌ప్యాక్ ఆడియోక్యాసెట్

కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)




20 పాటలు గల
సింగిల్‌ప్యాక్ ఆడియో క్యాసెట్

## సరిగపదమని-10

**జవాబులు:- అడ్డం:** 1.పచ్చగడ్డి 3.కొట్టలిరా 5.పెట్ట 6.పుణ్య 7.ఓం 8.హాయి 10.మారో 11. ఒక్కడు 14.ఛయ్య 15.నాపాట 16.తోడ 19.బలపం 20.లాలీ 21.ఏలా

**నిలువు:** 1.పసుపు 2.గడ్డ 3.కొట్టకురో 4.రావోయి 8.హాయి 9.ఆడు 10.మావయ్య 12.మోనా 13.ఆటకావాలా 14.ఛల్ 16.తొలి 17.చిలకా 18.లైలా.

### కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:

పి.మధు- విజయనగరం, యం.రజని- నల్గొండ, జి.ఈశ్వర్-
హైదరాబాద్, సిలివేరు పుష్పలత- దేవరకొండ (నల్గొండ), పర్చా
విజయలక్ష్మి- దేవరకొండ (నల్గొండ), జి.విజయలక్ష్మి-
హైదరాబాద్, ఎ.లీలావతి- హైదరాబాద్, పి.వి.వి.ఆర్ ప్రతాప్-
చీపురుపల్లి, యం.సునందబాయి- కర్నూలు, నెల్లుట్ల రమాదేవి-
హన్మకొండ, టి.బ్రహ్మయ్య- కుప్పాలపల్లి, వెత్సా రామకృష్ణ-
విజయనగరం, కె.వి.ఎస్.ఎన్.ఎస్.శర్మ- రాజమండ్రి,
విజయభాస్కర్- రాజమండ్రి, చెరిపల్లి శ్రీనివాస్ కళ్యాణి-
దేవరకొండ (నల్గొండ), కె.వేణుమాధవ్- హైదరాబాద్, భూసురపల్లి
ప్రహ్లాదుడు- మాచర్ల (గుంటూరు), జి.బాలత్రిపురసుందరి-
శ్రీకాకుళం, సి.హెచ్.రామకృష్ణమూర్తి- విజయవాడ,
ఎస్.బాలకృష్ణ- సికింద్రాబాద్, కొల్లూరు శేషశాయి- రాయగడ,
జి.కిషోర్- విజయనగరం, పి.శేఖర్‌బాబు- దర్మసాగర్ (వరంగల్),
తాతా శ్రీరామమూర్తి- విశాఖపట్నం, బి.జయపద్ర- కర్నూలు,
జి.మల్లిఖార్జున- కర్నూలు, బి.శేషశాయి- సత్తెనపల్లి (గుంటూరు),
ప్రయాగ లక్ష్మి- హైదరాబాద్, ఎల్.కరుణ- దేవరకొండ (నల్గొండ),
సోమయాజుల రాహుల్- జయపూర్ (ఒరిస్సా), ఆలవారుశెట్టి
సరిత- నెల్లూరు, పి.పాపారావు- విశాఖపట్నం, తాడి రంగారావు-
రాజమండ్రి, ఆర్.పద్మాలత- హైదరాబాద్, మహమ్మద్ లతీఫ్-
నాచారం (రంగారెడ్డి), ఆర్.శేషశాస్త్రి- అనంతపురం, ఎస్.కె.జుబేదా
బేగం- ఆసిఫాబాద్ (ఆదిలాబాద్), సి.హెచ్.సత్యజగదీష్-
కుర్దారోడ్, కొమ్మ వెంకటసుబ్బయ్య- గుంటూరు, ఎం.మస్తాన్‌రెడ్డి-
విశాఖపట్నం, ఎ.పద్మావతి- శ్రీకాకుళం, సుభాష్ నేమాన-
శ్రీకాకుళం టౌన్, పాలేపు శ్రీనివాస్- రాజమండ్రి, ఎ.ఎస్.అభిజ్ఞా-
రాజమండ్రి, గంటి రమ్య- అమలాపురం, యం.సుప్రీమ్-
కోదాడ(నల్గొండ), యం.శ్రీదేవి- విశాఖపట్నం, లక్కరాజు-
నర్సారావుపేట, సి.లక్ష్మీగణేష్- చంద్రాపూర్, సి.వసంత
నాగేశ్వరావు- సికింద్రాబాద్, ఇ.రాధిక- హైదరాబాద్, జోగా
వెంకటరమణ- పిఠాపురం, పి.రాణి- నరసాపురం (ప॥గో॥జిల్లా),
ఎస్.శ్రీలత- విశాఖపట్నం, జి.సరోజినిదేవి- సికింద్రాబాద్, నీలం
నాగరాజేశ్వరరావు- నెల్లూరు, ఎ.రవికిరణ్- గుంటూరు,
జి.కళ్యాణిశర్మ- నంద్యాల (కర్నూలు), పి.సాయికృష్ణచైతన్య-
హైదరాబాద్, పింగళి శ్యామసుందర్- బెంగుళూరు, సి.ఎస్.రావ్-
నెల్లూరు, గురజాల అన్నపూర్ణ- విశాఖపట్నం, దిల్‌షాద్ ఫాతిమా-
ధవళేశ్వరం (తూ॥గో॥జిల్లా), పి.సురేష్‌బాబు- గూడూరు (నెల్లూరు),
ఎ.టి.కాశీనాథ్- హైదరాబాద్, ఎ.టి.సావిత్రి- హైదరాబాద్,
పల్లాట రమేష్- నాచినపల్లి (వరంగల్), రావుల వేణుగోపాల్-
కాజీపేట (వరంగల్), ఎ.రమణ- దేవరకొండ (నల్గొండ),
కె.కృష్ణమూర్తి- నవీపేట్ (నిజామాబాద్), వై.వెంకటేశ్వర్లు-
పాల్వంచ (ఖమ్మం), ఎ.మోహనకుమార్- శ్రీకాకుళం,
కె.హరిహరప్రసాద్- ఖమ్మం, జి.మదన్‌గోపాల్- యర్రుపాలెం
(ఖమ్మం), పెద్దాడ ఇందిర- సిర్పూర్‌కాగజ్‌నగర్, శిష్ట్లా
సీతామహాలక్ష్మి- హైదరాబాద్, డి.ఆర్.తేజోకార్తిక్- పిలాని
(రాజస్థాన్), నిర్మలక్రిష్ణ- తిరుపతి, డా॥బి.ఎస్.ప్రసాద్- భీమడోల్
(ప॥గో॥జిల్లా), కె.వి.శరవన్‌కుమార్- సాదం (చిత్తూరు), చెన్నా
అనురాధ- విశాఖపట్నం, అనురా వెంకటేశ్వరరావు- సంతపేట
(నెల్లూరు), బి.యం.విజయలక్ష్మి- నెల్లూరు, వనం జానకీదేవి-
పాతపాల్వంచ (ఖమ్మం), బి.రజని- శ్రీకాళహస్తి, తూటం
పూర్ణచంద్రరావు- కాకినాడ, ఎ.బి.సురేఖ- అనంతపురం,
వి.దుర్గభవాని- దోనే (కర్నూలు), వడకలమన్నాటి భార్గవి-
విజయవాడ, వి.రాజశేఖర్‌రెడ్డి- మంగళగిరి (గుంటూరు), అల్లూరి
రామరాజు- విజయవాడ, జి.వి.రమణ- అనంతపురం,
గొట్టుముక్కల రామకృష్ణంరాజు- సత్తెనపల్లి, కె.జ్ఞానస్వరూపదేవి-
గుంటూరు, అనుపోజు శివకుమార్- కొమరవానిపేట (శ్రీకాకుళం),
జి.కె.ఎస్.విశ్వనాథ్- కాకినాడ, సుబ్బలక్ష్మి చెన్నమరాజు- కర్నూలు,
కొవ్వలి హిమబిందు- కంకిపాడు (కృష్ణా), కనుపర్తి జగదీష్-
విజయవాడ, కె.సౌందర్యవల్లి- విజయవాడ, జి.జాబిల్లి-
హైదరాబాద్, వై.వి.లక్ష్మీదీప్తి- హైదరాబాద్, పి.వసంత-
ఇబ్రహింపట్నం (కృష్ణా), ఎ.టి.శ్రీనివాసన్- అనంతపురం,
ప్రభాజ- కాకినాడ, ఆముంచి వెంకటలక్ష్మీ కామేశ్వరి- రాజోలు
(తూ॥గో॥జిల్లా), మద్దుల అప్పారావు- అనకాపల్లి, జాగిర్దార్
మాధురి- సామర్లకోట (తూ॥గో॥జిల్లా), కృష్ణపేయ.యం- వైజాగ్,
పాలెం అనిల్‌కుమార్- చీరాల, జి.ఎస్.ప్రసాద్- హైదరాబాద్,
జి.పద్మజ- హైదరాబాద్, పి.వి.సోమశేఖర్- కాకినాడ, ఎస్.దివ్య-
హైదరాబాద్, సయ్యాద్ నయాబ్- గిద్దలూరు (ప్రకాశం), పొంద్రంకి
రమ్యరాజేశ్వరి- యలమంచిలి (విశాఖజిల్లా), పసుపులేటి శోభనా
చలపతిరావు- గుడివాడ (కృష్ణా), డి.వెంకట్రావు - సాలూరు, డి.
అమరేశ్వర రాయశర్మ- నిడుబ్రోలు(గుంటూరు), శ్రీరాం
నాగేంద్రాచారి- మాచర్ల (గుంటూరు), బి.జాకిర్‌హుస్సేన్-
ఎమ్మిగనూరు (కర్నూలు), ఎస్.నాగబాబు- హైదరాబాద్, నిరివింటి
జయప్రకాష్ శాస్త్రి- వనపర్తి(మహబూబ్‌నగర్), ఎస్.శరత్‌బాబు-
హైదరాబాద్, యం.రామలక్ష్మి- విజయవాడ, సి.అన్నపూర్ణ-
కరీంనగర్, జి.యస్.రావు- పాల్వంచ, యశ్వంతరావు శేషగిరిరావు-
జయపూర్ (ఒరిస్సా), విష్ణుభట్టరాజశేఖర్- మచిలీపట్నం,
తెలికిచెర్ల.ఎం.కె.కిషోర్- కరవంజ (శ్రీకాకుళం), అమూల్య
పాణ్యము- కర్నూలు, కొండపల్లి గంగయ్య- బోధన్
(నిజామాబాద్), తిరుమలప్రసాద్.పి- హైదరాబాద్, సీతాదేవి
ఓలేటి- విజయవాడ, యం.సరళ- దేవరకొండ (నల్గొండ),
అవసరాల మహతి- విశాఖపట్నం, పి.లక్ష్మీదేవి- దొర్నిపాడు
(కర్నూలు), ఎన్.గాయత్రిదేవి- హైదరాబాద్, ఫణికిరణ్- అవనిగడ్డ,
కాకుటూరు సుజాత- హైదరాబాద్, కిన్నెర అనూష- హైదరాబాద్,
ఎమ్.అంజిరెడ్డి- ఒంగోలు, ఎన్.ఎస్.ఎల్.మృదుల- రాజమండ్రి,
వాస్తు వరలక్ష్మిరామచంద్ర- నెల్లూరు, మరువాడ కామేశ్వరరావు-
మంచిర్యాల (ఆదిలాబాద్), అపూర్వభావన- పాలకొల్లు
(ప॥గో॥జిల్లా), పి.రమణి- హైదరాబాద్, మన్నవ మాధవి-
సత్తెనపల్లి, పొన్నం ఉమాదేవి- చిలకలూరి పేట, తమిరశ జానకి-
హైదరాబాద్, డి.శేష్ మనోజ్- నడుపల్లి (ప॥గో॥జిల్లా),
యం.వి.ఎస్.ఎన్.శాస్త్రి- విజయవాడ, మచ్చలక్ష్మి నరసయ్య-
జగిత్యాల, వరదా సాయికుమార్- పర్లాకిమిడి (ఒరిస్సా), కదార్ల
నారాయణ- జగిత్యాల (కరీంనగర్), తులసి లక్ష్మిశకుంతల-
కాకినాడ, ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ (కృష్ణా),
బి.ఎస్.యు.ఎమ్.శాస్త్రి- విశాఖపట్నం, యు.విజయశేఖరరెడ్డి-
హైదరాబాద్, ఎస్.శాంతి శ్రీనివాస్- కడప, పి.లక్ష్మికుమారి-
ఖమ్మం, సి.విజయ సారథి- కర్నూలు, ఎ.ఎస్.హిమబిందు-
కాకినాడ, కిశోర్‌కుమార్ .ఆర్- 8 ఇంక్లైన్ కాలనీ (కరీంనగర్),
బి.కవిత- తిరుపతి, డా॥కె.నంజీవ్ కుమార్- నవీపేట్
(నిజామాబాద్), ఎ.ప్రసన్న- విశాఖపట్నం, ఎమ్.ఎమ్.పి.
శ్రీనివాసరావు- హైదరాబాద్, పి.వి.పవన్‌కుమార్- హైదరాబాద్,
టి.సత్యనారాయణ- గూడూరు, దేశపతి శ్రీనివాసశర్మ- సిద్దిపేట,
కె.వి.రమణారెడ్డి- హైదరాబాద్, జి.వి.ఆర్.మూర్తి- హైదరాబాద్,
సి.హెచ్.కళ్యాణ్ చక్రవర్తి- బెర్హంపూర్ (ఒరిస్సా), పిన్నెల్లి కళ్యాణి-
హైదరాబాద్, సుస్వారము అనిరుథ్- కర్నూలు, సి.వి.రాజేశ్వరి-
విశాఖపట్నం, జి.వరలక్ష్మి- కర్నూలు, ఐ.వి.ఎస్.ఎస్.ఎస్.
రమేష్‌బాబు- సింహాచలము, మద్దిత్యాగరాజు- నరసన్నపేట
(శ్రీకాకుళం), చిట్టా దుర్గానాగేశ్వర్- హైదరాబాద్,
యస్.సత్యనారాయణ- విజయవాడ, సునీత- హైదరాబాద్,
మామిడి మహేంద్ర- పూణే, సి.హెచ్.గణేష్- ఉప్పునుంతల
(మహబూబ్‌నగర్), బొజ్జ హరికృష్ణ- మద్రాసు, ఎ.పురుషోత్తం
రావు- గజ్వేల్ (మెదక్), మద్దాలి మురళీకృష్ణ- నిజామాబాద్,
జే.శ్రీదేవి- వనపర్తి (మహబూబ్‌నగర్), పి.రజనీకల్పన- చీమకుర్తి
(ప్రకాశం), డి.సింహాద్రి- సికింద్రాబాద్, తరిగొప్పుల సంధ్య-
విజయనగరం, వి.విద్యాసాగర్- విశాఖపట్నం, తెలికిచెర్ల
రామకృష్ణ- విజయనగరం, యార్లగడ్డ చిట్టిబాబు- కేశవరం
(తూ॥గో॥జిల్లా), ఎస్.శివనారాయణ- కొత్తపేట (ప్రకాశం),
అద్దంకి శేష భాగ్యశ్రీ- హైదరాబాద్, ఎ.సరోజినిదేవి- రాజమండ్రి,
లావణ్య.కె- ధర్మవరం (అనంతపురం), వై.జానకిదేవి-
రాజమండ్రి, కె.శ్రీ.వైష్ణవి- కడప, పొన్నడ రమేష్- హైదరాబాద్,
ఒ.రోహిత్- గుంతకల్, కోఠి జయలక్ష్మి- హైదరాబాద్, పక్కి
చక్రవర్తి- గరివిడి (విజయనగరం), టి.అయ్యప్ప రెడ్డి- తణుకు
(ప॥గో॥జిల్లా), యాగా పద్మ- కాకినాడ, ఎల్.రజని- హైదరాబాద్,
కె.నీరజ దీపిక- హైదరాబాద్, ఆర్.నవీన్‌కుమార్- అనంతపురం,
కె.చెన్నక్రిష్ణారెడ్డి- హైదరాబాద్, ఆర్.కె.యు.ఎస్.భాస్కరరావు-
ములగపూడి (తూ॥గో॥జిల్లా), పరస జగన్నాథరావు- దొమ్మేరు
(ప॥గో॥జిల్లా), ఒ.అహల్య- హైదరాబాద్, కె.మురళీమోహన్-
మర్కాపూర్ (ప్రకాశం), కట్టా నాగాంజనేయులు- కొట్టంపూడి
(ప॥గో॥జిల్లా), ఎన్.కె.నాగేశ్వరరావు- పెనుగొండ (ప॥గో॥జిల్లా),
ఎమ్.మేఘనాథ్- హైదరాబాద్, యం.శ్రీఅనుదీప్- కాకినాడ,
సౌమిత్రి రమణాచార్య- హైదరాబాద్, ఎన్.ఎల్.స్వాతి-
విశాఖపట్నం, కర్రిరుఖాన్సీ- హైదరాబాద్, యం.దుర్గా మనోజ్ఞ-
హైదరాబాద్, ఎ.అన్నపూర్ణ- హైదరాబాద్, ఎ.జానకి రాం-
హైదరాబాద్, యం.నర్సయ్య- పాల్వంచ (ఖమ్మం),
పి.రవిబ్రహ్మం- విజయనగరం, స్వర్ణ సాయిఫణిహర్ష- స్వర్ణ
(ప్రకాశం), యం.సిద్దయ్య- తిరుపతి, ఆర్.మధుసూదనరావు-
ఎర్రగుంట్ల (కడప), బి.ప్రదీప్‌కుమార్- పర్లాకిమిడి (ఒరిస్సా),
వి.రాజేశ్వరి- మండపేట (తూ॥గో॥జిల్లా), ఎస్.శ్యాంప్రసాద్-
కడప, యడ్లపల్లి చంద్రశేఖర్- తెనాలి (గుంటూరు), యజ్జల
జగన్నాథం- పాతపట్నం (శ్రీకాకుళం), టి.ఎల్.స్రవంతి-
సికింద్రాబాద్.

### ఒక తప్పుతో వ్రాసిన వారు:

ధూళిపూడి సుబ్రహ్మణ్యేశ్వరరావు- గొల్లప్రోలు (తూ॥గో॥జిల్లా),
ఇప్పగుంట వెంకట శ్రీనివాసరావు- మౌలాలీ, కె.రాజరాజేశ్వరి-
హైదరాబాద్, జ్ఞానప్రసూద- చెన్నై, సహారం ఈరణ్ణ- ఆదోని,
పురాణపండ మేఘనా శ్రీరవళి- కాకినాడ, టి.కె.సాగర్‌కుమార్-
ఎమ్మిగనూరు, కిరణ్మయి జంధ్యాల- మచిలీపట్నం,
యం.పి.ధర్మరాజు- నల్గొండ, ఎస్.సుప్రియ కృష్ణ- హైదరాబాద్,
ఆత్మూరి వెంకటశరత్‌కృష్ణ- హైదరాబాద్, మెహర్‌కుమార్-
లింగంపల్లి (నిజామాబాద్), సి.హెచ్.దీపిక- వైజాగ్,
ఎస్.రాధాకృష్ణ- మంచిర్యాల, ఎన్.విజయలక్ష్మి- బాన్సువాడ,
కె.వి.సరస్వతి- హైదరాబాద్, యర్రా శ్రీనివాసరావు- కాకినాడ,
పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), మద్దాలి సువర్చాలా
శ్రీనివాస్- హైదరాబాద్, కోదాటి విజయలక్ష్మి- వరంగల్, నండూరి
రామనుజాచార్యులు- విజయవాడ, బళ్లారి ఉమాదేవి- ఆదోని
(కర్నూలు), ఎ.ఆదినారాయణ- పోతవరం (గుంటూరు),
వి.నాగస్వర్ణ- తెనాలి (గుంటూరు), పంగులూరి- నెల్లూరు,
వి.రవికిరణ్- న్యూపాల్వంచ (ఖమ్మం), కె.శ్రీదేవి- హైదరాబాద్,
ఎ.మాధవి- తాడేపల్లిగూడెం (ప॥గో॥జిల్లా), ఇ.టి.రామరావు-
శ్రీహరికోట, బి.వి.ఎస్.ప్రసాద్- పుల్లలపాడు (ప॥గో॥జిల్లా),
జయంతి విజయశ్రీ- విశాఖపట్నం, సి.నళినికుమారి-
సికింద్రాబాద్, అరుణ.యం- హైదరాబాద్,
ఎ.వి.ఆర్.ఎన్.శ్రీనివాస్- హైదరాబాద్, టి.విజయలక్ష్మి-
హైదరాబాద్, వై.భార్గవి- హైదరాబాద్, యం.కె.దుర్గారావు-
మంచిలి (ప॥గో॥జిల్లా), కె.లక్ష్మణ్‌చారి- సంతోష్‌నగర్,
కె.వి.సుబ్రహ్మణ్యం- కర్నూలు, యం.శ్రీలక్ష్మీదేవి- కాకినాడ,
బి.వినోద్‌కుమారి- హైదరాబాద్, గరిమెళ్ళ అన్నాజీరావు-
అన్నవరం, వల్లూరి రజని- మండపేట (తూ॥గో॥జిల్లా),
జె.పోలరాజు- కడపరాజుపల్లి (ప్రకాశం), భోగరాజు సుబ్బారావు-
విశాఖపట్నం, గెదాల రామారావు- బెంగుళూరు, పి.ప్రసాదరావు-
రామవరప్పాడు (కృష్ణా), ముప్పిరాల వెంకటరమణ- హైదరాబాద్,
యం.మాధురి రంగారావు- నల్గొండ, వై.రాజానాయుడు-
పెద్దచెన్నయ్యగారిపల్లె (చిత్తూరు), మౌలి- విశాఖపట్నం,
ఏవీశ్వరరావు హారిత- మంగలగిరి, ఎ.వి.మాణిక్యాలరావు-
హైదరాబాద్, మద్దినాగరాజు- శ్రీకాకుళం, రాజ్కుమార్ ముగ్గళ్ళ-
మల్కాజాగిరి, ఎస్.ఇందిర- కళ్యాణ్ (మహారాష్ట్ర), పింగళి
కనకవల్లి- గుంటూరు, సన్నిధి రాజకుమార్- ఆకివీడు, చివుకుల
చిరంజీవి- ఒంగోలు, గంటి దుర్గాదేవి- రాయవరం
(తూ॥గో॥జిల్లా), యు.యు.శ్రీరాములు- మద్రాసు, బి.నాగలక్ష్మి-
కర్నూలు, పసుపులేటి ఝాన్సీ- మొగలికుదురు (తూ॥గో॥జిల్లా),
బాలంత్రాపు అశ్విని భరత్- హైదరాబాద్, టి.సూర్యశ్రీ-
హైదరాబాద్, పి.యం.ఆచారి- హైదరాబాద్, పి.జె.శేషసాయి-
సామర్లకోట(తూ॥గో॥జిల్లా), ఇ.శైలజ- ముంబాయి, కాటూరి
రంగాచారి- వరంగల్, రామేశ్వరపు సత్యనారాయణ- కాకినాడ,
పి.ఇందిరాదేవి- హైదరాబాద్, పి.శ్రీనివాస్- తిరుపతి, కె.రాధ-
హైదరాబాద్, ఎ.వినాయక శాస్త్రి- శ్రీనివాసపురం (కర్ణాటక),
పి.లక్ష్మీనారాయణ- ఆదిలాబాదు, సి.హెచ్.సూర్యారావు-
చీపురుపల్లి (విజయనగరం), టి.ఇందిరదేవి- హైదరాబాద్,
అగస్త్యరాజు ఆనంద్ స్వరూప్- ఒంగోలు, లక్ష్మీదేవి లూబూరు-
హైదరాబాద్, రాయప్రోలు లక్ష్మీదేవి- ఒంగోలు, వి,శ్యాంబాబు-
హైదరాబాద్.

### రెండు తప్పులతో వ్రాసిన వారు:

దారెల్లి గౌతమ్ శంకర్- పాల్వంచ (ఖమ్మం), బి.రమాదేవి-
హైదరాబాద్, యం.రఘువీర్- సికింద్రాబాద్, జె.భూపాల్‌రెడ్డి-
ప్రొద్దుటూరు (కడప), యం.వి.ఎస్.ఎస్.ప్రసాద్- మీర్‌పేట్,
బొల్లిముంత పద్మజ- కొండపి (ప్రకాశం), డి.లత- గుంటుపల్లి,
మామడాల కృష్ణయ్య- నల్గొండ, కె.రామరత్నప్రసాద్- పాల్వంచ
(ఖమ్మం), బోడా ఝాన్సీ- విశాఖపట్నం, మోచెర్ల సురేష్-
రాజమండ్రి, ఎస్.కె.భాషా- సాలూరు, బి.ప్రసాద్- మచిలీపట్నం,
వానపల్లి గంగరాజు- విశాఖపట్నం, యం.అమృత- ధోణే
(కర్నూలు), వై.ఎస్.ఆర్.చంద్రిక- హైదరాబాద్, జి.ప్రసాదరావు-
శ్రీకాకుళం, జి.త్యాగరాజు- కర్నూలు, వై.రోశిరెడ్డి- సత్తెనపల్లి,
అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి (ఒరిస్సా), పి.వి.శాంతరాం-
కాకినాడ, కె.లావణ్య- నంద్యాల (కర్నూలు), డా॥వి.రాధిక-
అమలాపురం (తూ॥గో॥జిల్లా), కె.వి.ఎస్.కుసుమలత-
హైదరాబాద్, ఎ.ఎస్.ఆర్.శాస్త్రి- దామరచెర్ల (నల్గొండ).

### మూడు తప్పులతో వ్రాసిన వారు:

బి.శైలజ కుమారి- కర్నూలు, సోమయాజుల సాయిప్రసాద్-
ఒనకడిలీ (ఒరిస్సా), బి.బర్నబాస్- నెల్లిమర్ల (విజయనగరం), దేసు
విజయలక్ష్మి- వినుకొండ (గుంటూరు), మెతుకు మస్తానయ్య-
ఒంగోలు, సయ్యద్ రహమతుల్లా- పర్లాకిమిడి (ఒరిస్సా),
ఎ.సాయిరత్నంబ- హైదరాబాద్, జి.అనందరావు- విజయవాడ,
పి.మదుసూదన్- సికింద్రాబాద్, చెరుకుతోట పరాత్పరరావు-
ఏలూరు, కె.రవిందర్- హన్మకొండ, యనమండ్రి రాజ్యలక్ష్మి-
సికింద్రాబాద్, జి.శివకుమారి- అదోని (కర్నూలు), తాతిరాజు
మోహన్‌రావు- విశాఖపట్నం, సి.హెచ్.సురేష్‌కుమార్-
గనిశెట్టిపాలెం (విజయనగరం), పమిడిముక్కల వరలక్ష్మి-
విశాఖపట్నం.

రచన : కవికోకిల దువ్వూరి రామిరెడ్డి గానం : ఘంటసాల

ప: అంతములేని ఈ భువనమంత పురాతన పాఠశాల
వ: నో నో పాఠశాలకాదు పానశాల
ప: విశ్రాంతి గృహమ్ము, అందు ఇరుసంజెలు రంగులు
వాకిలుల్...
ధరాక్రాంతులు, పాదుషాలు బహరాం
జమిషీడులు వేనవేలుగా కొంత
సుఖించి పోయిరెటకో...

రచన : ఆత్రేయ గానం : ఘంటసాల

కళ్యాణ్ :నేను పుట్టాను - లోకం మెచ్చింది
నేను నవ్వాను ఈ లోకం ఏడ్చింది
నాకింకా లోకంతో పని ఏముంది... డోన్ట్‌కేర్ ॥నేను॥
నేను తాగితే... కొందరి కళ్ళు గిరగిర తిరిగాయి
నేను పాడితే... అందరినోళ్ళూ వంతలు పాడాయి
నేను ఆడితే... అందరి కాళ్ళూ నాతో కలిసాయి
తెల్లవారితే వెనకన చేరి నవ్వుకుంటాయి... డోన్ట్‌కేర్ ॥నేను॥
మనసును దాచేటందుకే పైపైనవ్వులు వున్నాయి
మనిషికిలేని అందం కోసమే రంగులు వున్నాయి
ఎరగక నమ్మిన వాళ్ళ నెత్తికే చేతులు వస్తాయి
ఎదుటి మనిషికి చెప్పేటందుకే
నీతులు వున్నాయి... డోన్ట్‌కేర్ ॥నేను॥
మనిషిని మనిషిని కలిపేటందుకే పెదవులు వున్నాయి
పెదవులు మధురం చేసేటందుకే మధువులు వున్నాయి
బాధలన్నీ బాటిల్లో - నేడే దింపేశెయ్
అగ్గిపుల్ల గీచేశెయ్ - నీలో సైతాన్ తరిమేశెయ్...
డ్రైవ్ ది డెవిల్ అవుట్... ॥నేను॥

రచన : ఆత్రేయ గానం: పి.సుశీల

ఉంటే యీ ఊళ్ళో వుండు
పోతే మీ దేశం పోరా
చుట్టుపక్కల వున్నావంటే
చూడకుండా ప్రాణం ఉండదురా... ॥ఉంటే॥
కూలికెళ్తే నాకేరారా చేనువున్నాదీ
కూడుతింటే నాతో తినరా తోడువుంటాదీ
ఇంకేడకైనా ఎల్లావంటే
నాది చుప్పనాతి మనసు అది నీకు తెలుసు
ఒప్పి వూరుకోనంటది... ॥ఉంటే॥
ఊరినిండా వయసు పిల్లలు - ఒంటిగున్నారు
వాటమైనవాణ్ణి చూస్తే - వదలనంటారు
నీ చపలబుద్ధి సూపావంటే
మనిషి నాకు దక్కవింక మంచిదాన్ని కాను ఆనక... ॥ఉంటే॥
పగటిపూట పనిలో పడితే - పలకనంటావు
రాతిరేళ రగస్సెంగ రాను జడిసేవు
నే తెల్లవార్లు మేలుకుంటే...
ఎఱ్ఱబడ్డ కళ్ళుచూసి
ఏమేమో అనుకొని ఈది ఈది కుళ్ళుకుంటది... ॥ఉంటే॥

రచన : ఆత్రేయ గానం : సుశీల

లత : కలవని, దీనులపాలిట కలవని,
న్యాయమ్ము గెలపగలవని,
నీవే వెలుగై బలమై నడుపంగలవని
నమ్మితిని; నీవు కలవోలేవో

రచన : ఆత్రేయ గానం : ఘంటసాల, యల్.ఆర్.ఈశ్వరి

ఆమె : లేలేలే - నా రాజా లేలే - నా రాజా
లేవనంటావా...నన్ను లేవమంటావా
నిద్దుర లేవనంటావా - నన్ను లేవమంటావా... ॥లేలేలే॥
ఆమె : పెటపెటలాడే - పచ్చివయసు పైపైకొచ్చింది
అతడు : వచ్చీ - వచ్చీ...
మెరమెరలాడే మేని నునుపు - మెత్తగ తగిలింది
ఆమె : మెత్తని మత్తు - వెచ్చని ముద్దు ఒద్దిక కుదిరింది
అతడు : ఇద్దరు వుంటే ఒక్కరికేలా నిద్దురవస్తుంది
అతడు : రారా... నా రోజా రావే - నా రోజా
రాతిరయ్యిందా - నన్ను లేచి రమ్మందా... ॥రారా॥
ఆమె : నల్లనల్లని కన్నులలోన - ఎఱ్ఱని కైపుంది
అతడు : ఎఱ్ఱ ఎఱ్ఱని కుఱ్ఱతనమును జుఱ్ఱుకు తాగాలి
ఆమె : తాగిన రాత్రి - తాగని పగలు ఒక్కటి కావాలి
అతడు : ఆఖరిచుక్క - చక్కని చుక్క అప్పుడు యివ్వాలి ॥లేలేలే॥

రచన : ఆత్రేయ గానం: పి.సుశీల

లత : ఎవరో రావాలి నీ హృదయం కదిలించాలి
నీ తీగలు సవరించాలి నీలో రాగం పలికించాలి ॥ఎవరో॥
మూలదాగి - ధూళిమూగి
మూగవోయిన - మధురవీణా
మరిచిపోయిన - మమతలాగా
మమతలుడిగిన - మనసులాగా
మాసిపో.... తగునా... ॥ఎవరో॥
ఎన్ని పదములు నేర్చినావో
ఎన్ని కళలను దాచినావో
కొనగోటమీటినచాలు - నీలో
కోటి స్వరములు పలుకును... ॥ఎవరో॥
రాచనగరున వెలసినావు రసపిపాసకు నోచినావు
శక్తిమరచి, రక్తివిడిచి మత్తు ఏదో మరిగినావు
మరిచిపోతగునా... ॥ఎవరో॥

రచన : ఆత్రేయ గానం : ఘంటసాల, సుశీల

అతడు : కడవెత్తుకొచ్చింది కన్నెపిల్ల - అది
కనబడితె చాలు నా గుండె గుల్ల
ఆమె : కాడెత్తుకొచ్చాడు గడుసు పిల్లడు - వాడు
కనబడితె చాలు నాకొళ్లు తెలవదు
అతడు : పిక్కలపైదాక చుక్కల చీరకట్టి
పిడికిలంత నడుము చుట్టు పైటకొంగు బిగగట్టి
ఎళ్తుంటె చూడాలి దాని నడక - అబ్బో
ఎర్రైత్తి పోవాలి దాని ఎనక... ॥కడవ॥
ఆమె : చురకత్తి మీసాలు - జుట్టంత వుంగరాలు
బిరుసైన కండరాలు - మెరిసేటి కళ్ళడాలు
వస్తుంటె చూడాలి వాడి సోకు - వాడు
వద్దంటె ఎందుకీ పాడు బ్రతుకు... ॥కాడెత్తు॥
ఆమె : తలపాగ బాగ చుట్టి - ములుకోల చేతబట్టి
అరకదిమిపట్టుకొని - మెరక చేనులో వాడు
దున్నుతుంటె చూడాలి వాడి జోరు - వాడు
తోడుంటె తీరుతుంది వయసు పోరు... ॥కాడెత్తు॥
అతడు : నీలాటి రేవులోన నీళ్ళ కడవ ముంచుతూ
ఒంగింది చిన్నదీ ఒంపులన్ని వున్నది
చూస్తుంటె చాలు దాని సోకుమాడ - పడి
చస్తాను 'వస్తనంటె' కాళ్ళకాడ... ॥కడవ॥

రచన : ఆత్రేయ　　　గానం : ఘంటసాల

కళ్యాణ్ : తేట తేట తెలుగులా
తెల్లవారి వెలుగులా
తేరులా - సెలయేరులా
కలకలా - గలగలా
కదలి వచ్చింది - కన్నె అప్సర
వచ్చి నిలిచింది - కనుల ముందర... ॥తేట॥
తెలుగు వారి ఆడపడుచు ఎంకిలా - ఎంకి
కొప్పులోని ముద్దబంతి పువ్వులా
గోదారి కెరటాల గీతాలవలె నాలో
పలికినది - పలికినది - పలికినది...
చల్లగా - చిరుజల్లుగా
జలజలా గలగలా.... ॥కదలి॥
రెక్కలొచ్చి వూహలన్ని ఎగురుతున్నవి
ప్రేమమందిరాన్ని - చుక్కలతో చెక్కుతున్నవి
లోలోన నాలోన ఎన్నెన్నో రూపాలు వెలిసినవి
వెలిసినవి - వెలిసినవి...
వీణలా - నెరజాణలా...
కలకలా - గలగలా... ॥కదలి॥

రచన : ఆత్రేయ　　　గానం : ఘంటసాల, పి.సుశీల

అతడు : నీ కోసం వెలిసిందీ ప్రేమ మందిరం
ఆమె : నీ కోసం విరిసిందీ హృదయ నందనం
అతడు : ప్రతి పువ్వూ నీ నవ్వే నేర్చుకున్నది
ప్రతి తీగా నీ వంపులు తెచ్చుకున్నది
ఆమె : ప్రతి పొదున నీ మమతే పండుతున్నది
ప్రతి పందిరి నీ మగసిరి చాటుతున్నది ॥నీ కోసం॥
అతడు : అలుపురాని వలపులు ఆడుకునేదిక్కడ
చెప్పలేని తలపులు చేతలయ్యేదిక్కడ
ఆమె : విడిపోని బంధాలు వేసుకునేదిక్కడ
తొలి చెలిమి అనుభవాలు తుది చూసేదిక్కడ ॥నీ కోసం॥
ఆమె : కలలెరుగని మనసుకు కన్నెరికం చేశావు
శిలవంటి మనిషిని శిల్పంలా మార్చావు
అతడు : తెరువని నా గుడి తెరిచి దేవివై వెలిశావు
నువు మలచిన ఈ బ్రతుకు నీకే నైవేద్యం ॥నీ కోసం॥

# కథా సంగ్రహం

కళ్యాణ్‌వర్మ పిల్ల జమీందారు. జల్సారాయుడు. మధుపానం, స్త్రీలోలత్వం అతనితోనే పుట్టినయ్!

లత నవయువతి. ఆత్మగౌరవం, ఆత్మవిశ్వాసం ఆమె మతం!

ఇద్దరూ కలుస్తారు. "చెడిపోయిన వాళ్ళను చేరదీస్తానేమోగాని, నేనెవర్నీ చెడగొట్టను" అన్నాడు అతను. "థ్యాంక్సు!" అన్నది ఆమె.

ఎస్టేటు విభాగాలై కళ్యాణ్ మీద కొత్త బాధ్యతలు పడ్డాయి. తన వ్యవహారాలు తను చూసుకోవలసి వచ్చింది కళ్యాణ్‌కు.

ఎయిర్ హోస్టెస్ ఉద్యోగం వదులుకొని, కుటుంబాన్ని పోషించడానికి వేరే ఉద్యోగం చూసుకోవలసి వచ్చింది లతకు...

మర్యాదగా కళ్యాణ్ దగ్గర సెక్రటరీగా చేరింది లత. కళ్యాణ్‌ని పైకి చూస్తే త్రాగుబోతు, వ్యభిచారి; లోనికి చూస్తే ఉన్నత భావాలు, ఉత్తమ సంస్కారం అతని మైకం చాటునుండి కనిపిస్తూనే ఉంటాయి లతకు.

అయినా అతని బాహ్య ప్రవర్తన ఆమె ఆత్మాభిమానాన్ని గాయపరచింది. ఆ ఉద్యోగం వద్దంది లత. "అయాంసారీ" అన్నాడు కళ్యాణ్. చుట్టూ వాతావరణం కూడా "ఆయన చెడిపోయాడేమో గాని, చెడ్డవాడు కాదమ్మా" అని మారుపలికింది. లత ఏమీ చెయ్యలేకపోయింది.

ఒకసారి కళ్యాణ్ నడవడికకు అతని తల్లి పెద్దరాణి దుఃఖించింది. లత

రచన : ఆత్రేయ　　　గానం : ఘంటసాల

కళ్యాణ్ : తాగితే మరిచిపోగలను - తాగనివ్వదు
మరిచిపోతే తాగగలను - మరవనివ్వదు
మనసు గతియింతే మనిషి బ్రతుకింతే
మనసున్న మనిషికీ సుఖములేదంతే...
ఒకరికిస్తే - మరలిరాదు
ఓడిపోతే - మరిచిపోదు
గాయమైతే - మాసిపోదు
పగిలిపోతే - అతుకుపడదు... ॥మనసు॥
అంతా మట్టేనని తెలుసు
అదీ ఒక మాయేనని తెలుసు
తెలిసీ వలచీ విలపించుటలో
తీయదనం ఎవరికి తెలుసు ॥మనసు॥
మరుజన్మ వున్నదోలేదో
ఈ మమతలప్పుడేమౌతాయో
మనిషికి మనసే తీరని శిక్షా
దేవుడిలా - తీర్చుకున్నాడు కక్షా... ॥మనసు॥

రచన : ఆత్రేయ　　　గానం : ఘంటసాల

కళ్యాణ్ : ఎవరికోసం - ఎవరికోసం
ఈ ప్రేమ మందిరం - యీ శూన్యనందనం
ఈ భగ్నహృదయం - యీ అగ్నిగుండం
ఎవరికోసం - ఎవరికోసం - ఎవరికోసం ॥ఎవరి॥
ప్రేమభిక్ష నువ్వేపెట్టి... ఈ పేద హృదయం - పగులగొట్టి
పిచ్చివాణ్ణి పాత్రలేని బిచ్చగాణ్ణి చేశావు
నువ్విచ్చినది దాచలేదు ఇంకెవ్వరినీ అడుగలేను
బ్రతుకు నీకు యిచ్చాను చితిని నాకు పేర్చావు ॥ఎవరి॥
ఓర్వలేని ఈ ప్రకృతి ప్రళయంగా మారనీ
నా దేవి లేని ఈ కోవెల తునాతునలైపోనీ
కూలిపోయి ధూళిలో కలిసిపోనీ
కాలిపోయి బూడిదే మిగలనీ... ॥ఎవరి॥
మమత నింపమన్నావు మనసు చంపుకొన్నావు
మధువు తాగనన్నాను విషం తాగమన్నావు
నీకుప్రేమంటే నిజంకాదు నాకు చావంటే భయంలేదు
నీ విరహంలో బ్రతికాను ఈ విషంతో మరణిస్తాను ॥ఎవరి॥

కళ్యాణ్‌ని మారుస్తానని హామీ యిచ్చింది. "అసాధ్యం" అంది రాణి. కాని లతే గెలిచింది. అసాధ్యం సాధ్యం అయింది.

మైకపు మబ్బులు తొలగగానే కళ్యాణ్‌లోని ఉత్తముడు ప్రకాశించాడు. అతని తేజస్సుకి లత ఉక్కిరిబిక్కిరై దాసోహం అంది. ఇద్దరూ ఒకరికొకరు దగ్గరయ్యారు. ఇద్దరి మధ్యా ప్రేమాంకురమయ్యింది. ఆ ప్రేమకు రూపకల్పన చేశాడు కళ్యాణ్. అందుకే లక్షలు ఖర్చుపెట్టి ప్రేమనగరం నిర్మించాడు అతను.

"నీకోసం వెలిసిందీ ప్రేమమందిరం" అని అతనూ,

"నీకోసం విరిసిందీ హృదయనందనం" అని ఆమే పరవశించారు.

ఇందుకొక గాలిదుమారం లేచింది. ఇందుకు కొందరి కళ్ళు కుట్టినయ్.

ఇందుకొక కుట్ర తలెత్తింది... ఆ దుమారంలో... ఇద్దరూ చెల్లాచెదురైపోయారు. ఇద్దరి మధ్య ఓ అగాధం ఏర్పడింది. ప్రేమనగరంలో...

"ఎవరికోసం.... ఎవరికోసం... ఈ ప్రేమ మందిరం - ఈ శూన్య నందనం ఈ భగ్న హృదయం - ఈ అగ్నిగుండం... ఎవరికోసం... ఎవరికోసం... ఎవరికోసం..." అంటూ విలపించాడు కళ్యాణ్. "నీ విరహంతో బ్రతికాను.... ఈ విషంతో మరణిస్తాను" అంటూ ఆలపిస్తూనే విషం తాగాడు. కానీ నిజమైన ప్రేమ అమృతం లాంటిది. అది ప్రాణం పోస్తుందే గాని తీయదు. అందుకే కళ్యాణ్ బతికాడు. ఒక విధంగా చెప్పాలంటే లత బతికించుకుంది. కళ్యాణ్‌ని దక్కించుకుంది. శుభం






## నటీనటులు

| | |
|---|---|
| నటసామ్రాట్ అక్కినేని నాగేశ్వరరావు | వాణిశ్రీ |
| గుమ్మడి | శాంతకుమారి |
| సత్యనారాయణ | యస్.వరలక్ష్మి |
| రాజబాబు | హేమలత |
| కె.వి.చలం | రమాప్రభ |
| రావి కొండలరావు | మీనాకుమారి |
| ధూళిపాళ | పుష్పకుమారి |
| సాక్షి రంగారావు | విజయలక్ష్మి |
| పెరుమాళ్ళు | అనిత |
| కాకరాల | జూ॥ భానుమతి |
| డా॥ శివరామకృష్ణయ్య | విజయలక్ష్మీ కన్నారావు |
| సీతారాం | బేబి బ్రహ్మాజీ |
| డాక్టర్ రమేష్ | కోళ్ళ సత్యం |

మాష్టర్ దేవానంద్, మాష్టర్ వెంకటేష్, మాష్టర్ నీహార్

డాన్సర్స్ : లక్ష్మీఛాయ (బాంబే), జ్యోతిలక్ష్మి, జయకుమారి.

గెస్ట్ ఆర్టిస్టులు : యస్.వి.రంగారావు, వి.నాగయ్య, రమణారెడ్డి, సూర్యకాంతం, పుష్పలత.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : అరికెపూడి (కోడూరి) కౌసల్యాదేవి |
| రచన | : ఆచార్య ఆత్రేయ |
| పద్యం1 | : కవికోకిల దువ్వూరి రామిరెడ్డి |
| సంగీతం | : కె.వి.మహదేవన్ |
| డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ | : యస్.వెంకటరత్నం, W.I.C.A. |
| చీఫ్ ఎడిటర్ | : కె.ఎ.మార్తాండ్ |
| ఎడిటర్ | : జె.నరసింహారావు |
| కళ | : యస్.క్రిష్ణారావు |
| సాంగ్స్ అండ్ రీ రికార్డింగ్ | : ఎ.ఆర్.స్వామినాధన్(విజయా గార్డెన్స్) |
| సౌండ్ రికార్డిస్ట్ | : వి.బి.సి.మీనన్ |
| స్టిల్స్ | : సత్యం(జైహింద్ స్టూడియోస్) |
| కాస్ట్యూమ్స్ | : యం.క్రిష్ణారావు |
| నృత్యములు | : చిన్ని - సంపత్ |
| సీనిక్ ఎఫెక్ట్స్ | : ఆర్.జయరామారెడ్డి |
| మేకప్ | : చౌదరి, పోతరాజు, మాధవయ్య, సుబ్రహ్మణ్యం |
| ప్లేబ్యాక్ | : ఘంటసాల, పి.సుశీల, ఎల్.ఆర్.ఈశ్వరి |
| ప్రాసెసింగ్ | : జెమినీ కలర్ లేబరేటరీ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : యస్.యస్.సత్యన్నారాయణ |
| అసిస్టెంట్ | : వంకినేని సత్యన్నారాయణ |
| ఆఫీసు ఇన్‌ఛార్జి | : కె.యస్.కోదండరామన్ |
| పబ్లిసిటీ | : ఈశ్వర్ |
| ప్రెస్ పబ్లిసిటీ | : ఎన్.వి.కె.ఆర్ (విజయవాడ) |
| ప్రెస్ రిలేషన్స్ | : శ్రీకృష్ణ |
| స్టూడియో | : వాహిని |
| ఆపరేటివ్ కెమేరామన్ | : కృష్ణ |
| హేర్ స్టైయిల్స్ | : ఆస్వే, తానారపు భాస్కరరావు |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : జి.చిరంజీవి, బి.సుబ్బారావు |

**సహాయకులు**

| | |
|---|---|
| ఎడిటింగ్ | : యన్. సాంబశివరావు |
| కళ | : శంకర్ |
| కెమేరా | : జి.ప్రభాకర్,కనకరాజ్,నవకాంత్ |
| సౌండ్ | : యస్.సుబ్బారావు, యస్.రాజామణి |
| కాస్ట్యూమ్ | : పి.పుల్లారావు, సత్యన్నారాయణ, నారాయణ |
| మేకప్ | : దాసు |
| ప్రొడక్షన్ | : వి.రమణయ్య, నరసింహారావు, అప్పారావు, కృష్ణ,మెహిద్దీన్ |

| | |
|---|---|
| నిర్మాత | : **డి.రామానాయుడు** |
| డైరక్టర్ | : **కె.యస్.ప్రకాశరావు** |


డి.రామానాయుడు


కె.యస్.ప్రకాశరావు


ఆత్రేయ


కె.వి.మహదేవన్


ఘంటసాల


పి.సుశీల


ఎల్.ఆర్.ఈశ్వరి

